ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ ఆచార్యర్ తిరువడిగళే శరణమ్



పరమ కారుణికులగు అఖ్గియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన

# ఆచార్య హృదయము

(సూత్ర, సూత్రార్థ, వ్యాఖ్యాన సంగ్రహము)



పాలవంచ తిరుమల గుదిమెళ్ళ
వేంకట లక్ష్మీనృసింహాచార్యులు

ఆచార్యహృదయము (సూత్ర, సూత్రార్థ, వ్యాఖ్యాన సహితము)

ప్రథమ ప్రచురణము
1000 ప్రతులు
2004



మూల్యము : రూ. 100/-

ముద్రణ :
వేంకటలక్ష్మీనృసింహప్రెస్
మచిలీపట్టణము

ప్రతులకు :
శ్రీమాన్ పాలవంచ తిరుమల గుదిమెళ్ళ
వేంకట లక్ష్మీనృసింహాచార్యులు
23/329, బచ్చుపేట
మచిలీపట్టణము - 521 001
ఫోన్ : (08672) 224327

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహకారముతోను ముద్రితము

శ్రీమతే రామానుజాయ నమః



# సంప్రదాయ హృదయము

శ్రీరంగ క్షేత్రమున "మూడు పూవులు ఆరు కాయలు" అన్నట్లు విశిష్టాద్వైత సిద్ధాన్తము శ్రీవైష్ణవ సంప్రదాయముగూడ విలసిల్లుచున్న రోజులవి. భట్టర్ - నంజీయర్ - నంబిళ్ళై అను ఆచార్య పరంపరకు పిదప శ్రీకృష్ణపాదుల పుత్రరత్నములుగా అవతరించిన పిళ్ళై లోకాచార్యులవారును, అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనారును, ద్రవిడ ప్రబన్ధ సంప్రదాయ ప్రవర్తకులుగా ఉత్తమాచార్య పురుషులుగా శ్రీరంగ క్షేత్ర వైభవముతోపాటు శ్రీవైష్ణవ శ్రీని దశదిశల వ్యాపింపజేయుచుండిరి. శ్రీ నంబిళ్ళై స్వామివారును వారి శిష్యులైన పెరియ వాచ్చాంబిళ్ళై - వడక్కుత్తిరువీథిపిళ్ళై మొదలగువారును ఆరంభించిన ద్రావిడ దివ్య ప్రబన్ధ సారార్థ ప్రవచస-వ్యాఖ్యాన రూపమున ఏర్పడిన ప్రచార కార్యక్రమమును పిళ్ళైలోకాచార్యులవారు అళగియ మణవాళ ప్పెరుమాళ్ స్వామివారును తమ గ్రన్థముల ద్వారా విస్తరింపజేసిరి. ఆళ్వారుల సూక్తులలోని పరమార్థమును తమ ప్రబన్ధములలో వెల్లడించిన గౌరవము ఈ ఇద్దరు ఆచార్యులకే దక్కినది. సోదరులైన ఈ ఇరువురును బ్రహ్మచారులై సాంసారిక సుఖముల ప్రక్కకు మరలకుండా జీవితమంతయు సంప్రదాయ సేవకే అర్పించిన మహామహులు.

అందు మొదటివారు రచించిన అష్టాదశ రహస్య గ్రన్థములలో ముముక్షుప్పడియు, శ్రీవచనభూషణము అనునవి అత్యన్త ప్రాధాన్యము వహించి శ్రీవైష్ణవ లోకమునకు పరమోపాదేయములైనవి.

ఇక రెండవవారైన అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ స్వామివారు ప్రసాదించిన ప్రబన్ధములలో ఈ ఆచార్య హృదయ గ్రన్థము సంప్రదాయవేత్తలకు శిరోధార్యమైనది. వీరు తిరుప్పావై ప్రబన్ధమునకు, మరియు మధురకవుల కణ్ణినుణ్ శిరుత్తాంబు ప్రబన్ధమునకు విపుల వ్యాఖ్యలు ప్రసాదించియున్నారు. ఆచార్య హృదయమువలె ద్రావిడామ్నాయ హృదయమను పేరుగల మరొక ప్రబన్ధమును గూడ వీరు ప్రసాదించినట్లు తెలియుచున్నది. కాని అది ప్రసిద్ధికి రాలేదు.

శ్రీవచనభూషణమువలె ఈ ఆచార్య హృదయ గ్రన్థము గూడ ఆళ్వారుల వైభవమునకు పతాకయై, బహుముఖముగా వారి ప్రబన్ధములకు ప్రామాణ్యమును స్థాపించుటయేగాక అందలి రహస్యార్థములను విలక్షణ శైలిలో ఆవిష్కరించినది. స్వాపదేశార్థములను ప్రతిపాదించినది. దివ్య ప్రబన్ధములకు వేదాతిశాయి వైభవమును సప్రమాణముగా నిరూపించినది. అన్నగారి గ్రన్థము ద్రాక్షాపాకమువలె ప్రసన్న మధురము కాగా, వీరి ప్రబన్ధరచన నారికేళ పాకమువలె గంభీరార్థ గుంభితమై, ఆళ్వారుల సూక్తులలోని ద్రవిడ శబ్ద జాలముతో నిబద్ధమైనది. దీనిపై విశదవాక్శిఖామణియగు శ్రీ మణవాళ మామునుల మధుర వ్యాఖ్యయే అవతరింపనిచో, సామాన్యులకు ఇది దురవగాహమై యుండెడిది.

తిరువాయ్‌మొళి ప్రబన్ధమును భగవద్విషయము అను వ్యాఖ్యతో సేవించినవారు ఈ ఆచార్య హృదయమును సేవించినపుడే ఆ కాలక్షేపమునకు పరిపూర్తి యని ప్రపన్నుల నిర్ణయము.

ద్రవిడ పాశురములలోని సూక్తి శకలములతో సాగిన ఇందలి పెద్ద పెద్ద చూర్ణికలు సామాన్యులకు నోట పట్టవు. కాని సమర్థులు అనుసంధించునపుడు శబ్దసౌందర్యముచే సంస్కృత దండకాదులవలె కర్ణపేయములై యుండును. శ్రీ పరాంకుశ మునీన్ద్రుల సూక్తిసుధాసముద్రములోని మధురభక్తిభావ రత్నములను తెలిసికొన దలచినవారు అర్థముతోపాటు ఈ గ్రన్థమును అధ్యయనము చేయక తప్పదు. ద్రవిడ భాషా పరిచయము లేనివారికి భాషాక్లేశము ఒక గట్టి ప్రతిబన్ధకమే, నిరాశతో వెనుదిరిగిపోవుటగూడ సంభవమే, కాని సరసమైన అనువాదము ఉన్నప్పుడు జిజ్ఞాసువుల అపేక్ష ఫలవంతము కాగలదు. సంస్కృతగ్రన్థములెన్నెన్ని అనువదింపబడి తత్తద్గ్రన్థ మాధుర్యమాస్వాదింపబడుటలేదు. ఈ అనువాద ప్రక్రియ విజ్ఞానపూర్ణములైన మహాగ్రన్థములన్నిటికిని సాధారణమై లోకమున అనుభవములోనున్నది.

ప్రకృతము - ఆళ్వారుల దివ్య ప్రబన్ధములన్నింటికిని అనువాదములను వెలయించి శ్రీవైష్ణవ సంప్రదాయసేవను చేయుచున్న శ్రీ ఉ.వే. పాలవంచ తిరుమల గుదిమెళ్ళ వేంకట లక్ష్మీనృసింహాచార్యులవారు ప్రధానమైన ఈ శ్రీ ఆచార్యహృదయ గ్రన్థమునకును నిర్దుష్టమగు అనువాదముతోపాటు లఘు వ్యాఖ్యనుగూడ చేర్చి వెలయించుట ముదావహమైన విషయము. ఈ ఆచార్యులవారు స్వాచార్యానుగ్రహ లబ్ధ ద్రవిడ ప్రబన్ధ పరిజ్ఞానము సంపూర్ణముగా కలవారైనందున, ఈ అనువాద వ్యాఖ్య గూడ పాఠకులకు సంతృప్తి కలిగించగలదనుట నిస్సందేహము. వీరి అనువాద గ్రన్థముల ద్వారా "పరాంకుశ మునీన్ద్రాది పరమాచార్య సూక్తయః స్వదన్తాం ..." అని ఆశాసించుచూ, ఈ నాలుగు మాటలు వ్రాయుటకు మాకు అవకాశము కల్పించిన శ్రీ లక్ష్మీనృసింహాచార్య స్వామివారికి కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

ఇట్లు శ్రీ రామానుజదాసుడు,

**శ్రీ న.చ. రఘునాథాచార్యులు**

వరంగల్

శ్రీమతే రామానుజాయ నమః



# గ్రన్థావతరణము - విశిష్టత

ఈ గ్రన్థమును రచించినవారు అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనువారు. వీరు శ్రీ వడక్కుత్తిరువీథిపిళ్లైగారి ద్వితీయపుత్రులు. శ్రీ పిళ్లైలోకాచార్యులవారి తమ్ములు.

ఒకనాడు నంబిళ్లైగారు ఏకాంతమున వేంచేసియుండగా వడక్కుత్తిరువీథిపిళ్లైగారి తల్లిగారు వచ్చి దండము సమర్పించ, నంబిళ్లైగారేమి విశేషమనియడుగ, స్వామీ నేనేమని చెప్పను, నా కుమారుడొక పిచ్చివానివలె నున్నాడు. నా కోడలేకాంతమున భర్తను సమీపింప సర్పమని భయపడి చెమటలుపట్టి కేకలు వేయుచున్నాడు. ఇదేమి పాపమో తెలియున్నది. ఇంట తిరువారాధన మొనర్ప నొక బిడ్డడైన నుండవలెనుగదా యని ప్రార్థింప, నంబిళ్లైగారు నవ్వి మీ కోడలును ఋతుస్నానానంతరము ఇచ్చటకు తీసికొనిరండన, నామెయు నట్లొనర్ప, నంబిళ్లైగారు శిష్యబృందముతోనుండి నామె గర్భమును తమ చేతితో స్పృశించి మంగళాశాసనమొనర్చి తమ ప్రియశిష్యులగు వడక్కుత్తిరువీథిపిళ్లైగారిని జూచి నా యాజ్ఞమేరకు మీరామెతో నీ రాత్రియందు శయనింపుడనగా వారట్లే ఆచార్య నియమనమును పాటించిరి.

అంతట నామె గర్భముదాల్చి 12వ మాసమున నొక మగశిశువును ప్రసవించెను. ఆ బాలునకు వడక్కుత్తిరువీథిపిళ్లైగారు తమ ఆచార్యులగు నంబిళ్లైగారి అపరనామమగు లోకాచార్యులని పేరిడిరి. ఈ బాలుడు చిన్నవాడగుటచే పిళ్లైలోకాచార్యులని ప్రసిద్ధి గల్గినది. సంవత్సరాంతమున నీ బాలుని తండ్రిగారు రంగని సేవింపజేసి ఆచార్యులకు దండమిడి పిల్లవానికి ఆచార్య తిరునామమును పెట్టుకొనినట్లు తెల్పిరి. అందులకు నంబిళ్లైగారు కోపగించి రంగని తిరునామము పెట్టుకొనవలెననెడి మా అభిప్రాయము నతిక్రమించిరనగా సమీపస్థులగు శిష్యులు, స్వామీ మరొక కుమారునికై ఆశీర్వదింపుడు. దేవరవారి కోర్కెదీరుననగా, వారట్లే మంగళాశాసనమొనర్ప వడక్కుత్తిరువీథిపిళ్లైగారి భార్య గర్భముదాల్చి మరొక కుమారుని గనెను. ఆ బిడ్డనికి నంబిళ్లైగారు రంగనాథుని పేరగు అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అను తిరునామముంచిరి.

వీరును తమ అన్నగారివలెనే సకల శాస్త్రములందును మిక్కిలి ప్రావీణ్యమును సంపాదించి నాలాయిర దివ్యప్రబన్ధములను అర్థయుక్తముగ కరతలామలకమొనర్చుకొనుటయేగాక ఆళ్వార్లయొక్క అభిప్రాయ విశేషములనున్న బాగుగ గుర్తెఱిగియుండిరి.

శ్రీరంగమున నొకనాడు నాటి స్వాములు కొందరు శ్రీరంగనాథుని సేవించి పిళ్లైలోకాచార్యులు శ్రీవచనభూషణమను నొక రహస్యగ్రన్థమును వ్రాసి యందు వర్ణాశ్రమాచార విరుద్ధముగ ప్రవర్తించెనని ఫిర్యాదు చేయగా, శ్రీరంగనాథుడు అర్చకముఖముగ నావేశించి పిళ్లైలోకాచార్యులను పిలువనంప, నా సమయమునకు పిళ్లై లోకాచార్యులవారు కావేరికి స్నానమునకై వేంచేయ వారికి మారుగా వారి తమ్ములగు అళకియ

మణవాళప్పెరుమాళ్ నాయనార్ శ్రీరంగని సేవించి విషయమును గ్రహించి అన్నగారి శ్రీసూక్తులు సత్యములే యనియు, వర్ణాశ్రమాచారములకన్న జ్ఞానమే ప్రధానమని సిద్ధాంతీకరించుచు శ్రీరంనాథుని ఊరేగింపునకు అభిముఖముగ వెనువెనుకకు నడుచుచు నాల్గువీథులు చుట్టివచ్చుసరి నాల్గు ప్రకరణములను ఆశువుగ నాలాయిర దివ్య ప్రబంధములలోని పాశుర ప్రమాణములతో విన్నవింప శ్రీరంగనాథుడు మిక్కిలి ఆనందించి ప్రతివీథి చివరను ప్రకరణపూర్తియందు తన మెడలోని యొక మాల జారి వారి మెడలో పడునట్లొనర్ప స్వాములెల్లరు జూచి అత్యాశ్చర్యపడిరి.

ఇట్లనుగ్రహింపబడిన శ్రీసూక్తులే ఆచార్యహృదయమనుపేర గ్రన్థస్థమైనవి. ఆచార్యులనగా శ్రీ నమ్మాళ్వార్లు మొదళగు ఆళ్వారాచార్యులనియు వారి అభిప్రాయములే హృదయమనియు పూర్వుల యభిప్రాయము.

ఆచార్య హృదయమనగా ఆచార్యునికుండవలసిన లక్షణములనుట. ఈ లక్షణములను బయల్పఱచు టకు సర్వేశ్వరుడే తాను ప్రథమాచార్యులై మూడు పర్యాయములు మూడు మంత్రముల నుపదేశించెను. అవియే మూలమంత్ర ద్వయమంత్ర చరమశ్లోకములుగా ప్రసిద్ధమై పూర్వాచార్యులందరిచేతను ఆదరింపబడియు నాచరింపబడియు నేటికిని మనవరకును ఆచార్యులవలన పొందబడుచున్నవి. వానియొక్క రహస్యార్థములే ఆచార్య హృదయమనబడి ప్రసిద్ధినొందియున్నవి.

ముఖ్యముగా నాచార్యునకుండవలసిన లక్షణములు నాల్గు. అవి, 1. సద్వంశము, 2. జ్ఞానము, 3. అనుష్ఠానము, 4. పరోపదేశము. ఇట్టి ఆచార్యులయొక్క అభిప్రాయమే ఆచార్య హృదయము.

పూర్వోత్తర మీమాంసలకు గ్రంథకర్తలు వేరైనను ప్రతిపాద్య విషయములు వేరైనను కార్యకారణ భావ సంబంధమునుబట్టి శ్రీభాష్యకారులు శాస్త్రైక్యమును సాధించినట్లు ప్రకృతమునను శ్రీవచనభూషణ ఆచార్య హృదయ గ్రన్థములు రెండును జ్ఞానానుష్ఠాన స్థానములందుండి ఐక్యమును ప్రతిపాదించుచున్నవి.

శ్రీవచనభూషణమునకన్నను ఆచార్య హృదయ సూత్రములు కఠినమై నాలాయిర పాశురముల మిశ్రితములు. జ్ఞానాధికులకేగాని సామాన్యమగు పండితులకీ చూర్ణికలు అర్థముగావు. చూర్ణికలే అర్థముగానిదే, అందలి గంభీరార్థములెట్లు తెలియును.

ఈ సూత్రములను అళకియ మణవాళప్పెరుమాళ్ నాయనార్లును, వాని వ్యాఖ్యానములను మణవాళ మామునులును కృపజేసియుండిరి. అవి సంస్కృత ద్రవిడ భాషా ప్రధానములైయుండుటచే ఉభయ వేదాన్తముల నెఱిగిన ఆచార్యులవారికి మాత్రమే గ్రహింపదగియున్నవి.

ఇందలి విషయముల నెఱుగుట ముముక్షువు లెల్లరకు నావశ్యకమగుటచే వానిని సులభముగ గ్రహించి భాషా దౌర్లభ్యము లేక తరింపగలరను ఉద్దేశ్యముతో సంప్రదాయ లోకమునకీ గ్రన్థము వెలువరింపబడుచున్నది.

ఇది భగవద్భాగవతాచార్య నియమనమగుటచే పెద్దలెల్లరును మంగళాశాసనమొనర్ప ప్రార్థించుచున్నాను.

ఇట్లు భాగవత విధేయుడు

**పాలవంచ తిరుమల గుదిమెళ్ళ వేంకట లక్ష్మీనృసింహదాసుడు**

**శ్రీమతే రామానుజాయ నమః**

**పరమ కారుణికులగు**

**అழகియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన**

**ఆచార్యహృదయము - తనియన్‌లు**

ఆచార్యస్యాన్తవక్తారం అభిరామవరాధిపమ్ ।
శ్రీకృష్ణతనయం వన్దే జగద్గురువరానుజమ్ ॥

మణవాళరవణై ప్పళ్ళి పయిల్ పవర్ క్కెవ్వుయిరుమ్
కుణపోకమెన్ఱు కుఱుకైక్కతి పనురైత్తతుయ్య
ఉణర్‌పావినుట్పొరుళొన్ఱు మఱియావులకఱియ
మనవాళన్ మాఱన్ మనముఱైత్తాన్ వణ్ ముడుంబై వన్దే ॥

మాతవత్తోన్ మాఱన్ మనజ్ఞాఱుమ్ మనవాళన్
తోతవత్తిత్తూయ్ మఱైయోఱాన పెత్తార్ - నితియినాల్
ఆఙ్గవర్ తాళ్ శేర్ పెత్తరాయ్ మనవాళముని
పూఙ్గమల త్తాళ్‌కళ్ నెంజే పోత్తు ॥

**విశదవాక్శిఖామణియగు మణవాళమాముని అనుగ్రహించిన**

**ఆచార్యహృదయ వ్యాఖ్యానమ్**

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీన్ద్రప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥

**అవతారిక**

శ్రియఃపతియై సర్వస్వామియగు సర్వేశ్వరుడు నిరతిశయానన్దమైన శ్రీవైకుణ్ఠమున నిత్యనిర్మలజ్ఞానాదిగుణులై స్వచ్ఛన్దానువృత్తిస్వరూపస్థితిప్రవృత్తిభేదులగు నిత్యసూరులచే అనవరతపరిచర్యమాణచరణనళినుడై వేంచేసి యుండగా లీలావిభూతిలోనున్నవారు నిత్యసూరులవలె భగవానుని అనుభవింపదగిన సంబంధము కలవారై యుండియు, అనర్థపడు

టను చూచి మిక్కిలి కలతపడిన మనసుగలవాడై వీరలను ఉజ్జీవింపజేయు నాశచేత కరణ కళేబరములులేక అచిత్తువలె పడియుండి భోగ మోక్షశూన్యులై పడియున్న దశలో దయగలవాడై తన పాదారవిందములను ఆశ్రయించుటకు తగిన కరణకళేబరములనిచ్చిజ్ఞానవికాసమును ప్రవృత్తి నివృత్తి శక్తియును కల్గించి ఈ జ్ఞానకార్యమగు త్యాజ్యోపాదేయ వివేకసాధనమగు వేదప్రదానమొనర్చి ఆపై మన్వాదులకును అంతర్యామియై యుండి చేతనులయొక్క విశిష్టవేషవిషయమగు శాస్త్రమును బయల్పఱచిననూ ఆ శాస్త్రాభ్యాసము అనేక యోగ్యతలు కావలసినదగుటచేత చిరకాలసాధ్యమై దుష్కరమైయుండుటచేత అట్టి యోగ్యతలు లేకున్నను సులభముగ తెలియదగిన ఆత్మయాథాత్మ్యస్వరూపమును తెలియబఱచు సకల శాస్త్రసారమగు తిరు అష్టాక్షరీ మహామంత్రమును స్వయముగనే బయల్పఱచిననూ ప్రయోజనము లేకపోవుటచే తానే వచ్చి దిద్దుబాటొనర్పదలచి రామకృష్ణాద్యవతారములనెత్తివీరున్నచోటికే వచ్చి దిద్దుబాటొనర్ప యత్నించినను ఒకరున్ను ఆశ్రయించి బాగుపడకపోవుటచే నిక చేయవలసినదేమని చింతించి మృగప్రతిమతో మృగమును పట్టుకొనెడి ఉపాయజ్ఞుడగు వేటగానివలె యోచించి దక్షిణదిక్కునకు తన విశేషకటాక్షమును ప్రసరింపజేయగా ఆ నిర్హేతుక కటాక్షవిశేషలబ్ధ దివ్యజ్ఞానభక్తివైరాగ్యపూర్ణులగు ఆళ్వార్లు దానిననుభవించ ఆ అనుభవజనిత పరీవాహరూపముగ దివ్యప్రబంధములు సర్వలక్షణోపేతముగ వారి వాక్కునుండి బయల్పడినవి.

ఇవియును ద్రావిడవేదరూపముగ విస్తృతమై అనేకార్థప్రతిపాదకములై ఉండుటచేత అందరకును వాని గంభీరార్థములను తెలుసుకొనలేకపోవుటను తలచి మన పూర్వాచార్యులు తమ ఆచార్యపరంపరద్వారా లభించిన అర్థవిశేషములను అతిసంగ్రహము అతివిస్తృతము గాని విధముగ ఈ ఆచార్యహృదయగ్రన్థమొనర్చిరి.

ఆద్యస్య నః కులపతేః అన్నట్లు వైదికసన్తానమునకయకును ప్రథమాచార్యులగు శ్రీనమ్మాళ్వార్లు గూర్చిన దివ్యప్రబంధముల ద్వారా వారి హృదయమును తెలియ బఱచుటచే నీ గ్రంథమునకు ఆచార్యహృదయమని పేరు కల్గినది.

భగవన్నిర్హేతుకలబ్ధ దివ్యభక్తిరూపాపన్న జ్ఞానులగు నాళ్వార్ల శ్రీసూక్తులచే విశేషజ్ఞులందరికి నిది మిక్కిలి మనోహరమై యుండును.

దీనిని అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ సూత్రరూపమున కృపజేయగా విశదవాక్శిఖామణియగు మణవాళమాముని పరమకృపతో మణిప్రవాళశైలిన వ్యాఖ్యానమొనర్చిరి.

శ్రీమతే రామానుజాయ నమః

పరమ కారుణికులగు అழ்కియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించిన

# ఆచార్యహృదయము

(సూత్ర, సూత్రార్థ, వ్యాఖ్యాన సంగ్రహము)

## ప్రథమ ప్రకరణము

శ్లో|| ద్రావిడామ్నాయహృదయం గురుపర్వక్రమాగతమ్ |
రమ్యజామాతృదేవేన దర్శితం కృష్ణసూనునా||

1. **కారుణికనాన సర్వేశ్వరన్ అఱివిలామనిశర్ ఉణర్వెన్నుమ్ శుడర్విళక్కేత్తి**
కరుణగల సర్వేశ్వరుడు అజ్ఞులగు మనుజులు జ్ఞానమనెడు వెలుగుదీపమునెత్తి
**పిఱజ్గిరుళ్‌నీజ్గి మేల్ ఇరున్దనన్దా వేదవిళక్కైక్కణ్డు నల్లదుమ్ తీయదుమ్**
ఒత్తగుచీకటిపోయి పైగానున్న ఆరని వేదదీపమునుచూచి మంచి చెడ్డల
**వివేకిక్కైక్కు మఱైయాయ్ విరిన్ద తుళక్కమిల్ విళక్కిల్ కొళుత్తిన ప్రదీపమాన**
విచారించుటకు కారణమై పెరిగిన కదలికలేని దీపమునుండి ముట్టించిన దీపమువలె
**కలైకళై నీర్మైయినాల్ అరుళ్‌శెయ్‌తాన్.**
విద్యలను దయచే అనుగ్రహించెను.

వ్యా - సర్వేశ్వరుడు, అజ్ఞులగు సంసారులు జ్ఞానమను దీపమునెత్తి అజ్ఞానమును పోగొట్టుకొని తనను దర్శించి మంచిచెడ్డలను తెలుసుకొనుటకై సకలవేదకారణమై, నిత్యమై, సకలార్థప్రకాశకమైయున్న 'అ'కారమునుండి బయల్పడిన దీపమువంటి వేదమును, దాని వివరణములగు శాస్త్రములను కృపచేత ప్రసాదించెను.

**అవ** - వివేకఫలము తెలుపుచున్నారు.

2. **వివేకఫలమ్ వీడు - పత్తు.**

వివేకఫలము విడుచుట - ఆశ్రయించుట.

వ్యా - త్యాజ్యములను విడుచుట, ఉపాదేయములను ఆశ్రయించుటయును వివేకముయొక్క ప్రయోజనము.

**3. త్యాజ్యోపాదేయఙ్గళ్ సుఖదు:ఖఙ్గళ్.**

త్యాజ్యోపాదేయములు సుఖదు:ఖములు.

వ్యా - అందరకును దు:ఖము త్యాజ్యము. సుఖము ఉపాదేయము.

**4. ఇవత్తుక్కు ఎల్లై ఇన్బుతుమ్బళి పల్ మా మాయత్తు అళ్ళున్దుకైయుమ్ కళిప్పుమ్**

వీనికి హద్దు సుఖదు:ఖపుకూడిక పలు గొప్ప మోహముల మునుగుటయును గర్వమును

**కవర్వుమ్ అత్తు, పేర్ ఇన్బత్తిన్బుఱుకైయుమ్.**

దు:ఖమును పోయి గొప్ప ఆనందమును పొందుట.

వ్యా - అనంతక్లేశభాజనమగు సంసారమున మునుగుటకన్న దు:ఖములేదు; నిత్యవిభూతియందు సదా భగవదను భవమొనర్చుటకన్న వేరు సుఖము లేదు.

**అవ** - సుఖదు:ఖములకు కారణము తెల్పుచున్నారు.

**5. అనన్తక్లేశ నిరతిశయానందహేతు మఱన్దేన్ - అఱియకిలాతే - ఉణర్విలేన్ - ఏఱిలేన్ -**

అనేకదు:ఖ అధికానందహేతువు మరన్దేన్ అఱియకిలాతే ఉణర్విలేన్ ఏఱిలేన్

**అయర్త్తు ఎన్లుమ్, ఉయ్యుమ్ వకై - నిన్ఱొన్ఱై - నన్గఱిన్దనన్ ఉణర్విన్నుళ్ళే -**

అయర్త్తు అనియూ, ఉయ్యుమ్వకై నిన్ఱొన్ఱై నన్గరిన్దనన్ ఉణర్విన్నుళ్ళే

**అమ్బరిశు శొల్లుకిఱ జ్ఞాతవ్య పఞ్చక జ్ఞానాజ్ఞానఙ్గళ్.**

అమ్బరిశు అనియు, చెప్పబడిన తెలియదగు అర్థపంచకజ్ఞానము తెలిసి,తెలియకపోవుటలు.

వ్యా - సంసారసంబంధమనెడు దు:ఖమునకు కారణము అర్థపంచకజ్ఞానమునెఱుగకపోవుటయూ, మోక్షమనెడు మహానందమును పొందుటకు కారణము అర్థపంచకజ్ఞానమునెఱుగుటయును.

**అవ** - ఈ అజ్ఞానాదులకు కారణము తెల్పుచున్నారు -

**6. ఇవత్తుక్కు క్కారణమ్ - ఇరణ్డిల్ ఒన్జినిల్ ఒన్దుకైకళ్.**

వీనికి కారణము రెండిటియందు ఒకటియందును ఊనికయుండుటలు.

వ్యా - ఈ అర్థపఞ్చకజ్ఞానము కల్గకపోవుటకు కారణము రజస్తమోగుణములు రెండింటి యందును ఊనికగల్గియుండుట, అర్థపఞ్చకజ్ఞానముకల్గుటకు సత్త్వగుణమొక్కటియందు ఊనికగల్గియుండుట యును.

**అవ** - ఈ గుణములకు కారణమును తెల్పుచున్నారు.

**7. సత్త్వాసత్త్వనిదానమ్ ఇరుళ్‌తరుమ్ అమలజ్గళాక ఎన్నుమ్**

సత్త్వ, అసత్త్వకారణము ఇరుళ్‌తరుమ్ అమలజ్గళాక అనుపాశురములచెప్పినట్లు

**జన్మ జాయమానకాల కటాక్ష జ్గళ్.**

జన్మ జాయమానకాల కటాక్షములు.

**వ్యా** - రజస్తమోగుణములు అధికముగానుండుటకు కారణము "ఇరుళ్ తరుమాఞాలత్తుళ్ ఇనిప్పి అవి" అను పాశురమున చెప్పినట్లు అజ్ఞానమును కలుగచేయునట్టి ఈ సంసారమున జన్మించుట; సత్త్వగుణమధికముగానుండుటకు కారణము "అమలజ్గళాక వి ళ్ళి క్కుమ్" అనుపాశురమున చెప్పినట్లు జీవుని జననకాలమున సర్వేశ్వరుడు తననేత్రములచే కటాక్షించుట.

**అవ** - వీనికి కారణమును తెల్పుచున్నారు.

**8. ఇవత్తుక్కు మూలమ్ ఇరు వల్లరుళ్ నల్ - వినైకళ్.**

వీనికి మూలము రెండగు మంచిసుకృతములును పుణ్యపాపములును.

**వ్యా** - జన్మకు మూలము పుణ్యపాపములు; జాయమానకటాక్షమునకు కారణము సర్వేశ్వరుని సహజమగు కృపయను సుకృతము.

**అవ** - వీనికి కారణమును తెల్పుచున్నారు.

**9.** కర్మ **కృపా బీజమ్ పొయ్‌నిన్ఱ, అరుళ్‌పురిన్ద, ఎన్గిఱ అవిద్యా సౌహార్ద జ్గళ్.**

కర్మకు, కృపకు కారణము పొయ్‌నిన్ఱ అరుళ్‌పురిన్ద అనుపా.చెప్పిన అవిద్యాసౌహార్దములు.

**వ్యా** - పుణ్యపాపరూపకర్మలకు కారణము అవిద్య, అనగా "పొయ్ నిన్ఱ జ్ఞానమ్" అను తిరువిరుత్తమునందలిపాశురమున చెప్పిన విధముగ అసత్యమగు శరీరమున ఆత్మయనెడి జ్ఞానము అభిమానము అనగా దేహమే ఆత్మయను దేహాత్మభ్రాంతి. సర్వేశ్వరుని కృపకు కారణము 'అరుళ్‌పురిన్ద శిన్తై' అనెడి తిరువాశిరియము నందలి పాశురమున చెప్పినట్లు కృపతో కూడిన చిన్త. అనగా భగవానుని సౌహార్దము.

**అవ** - ఈ అవిద్యా-సౌహార్దములకు కారణము తెలుపుచున్నారు.

**10. ఏతన్నిమిత్తమ్ మున్నమే ముతల్ మున్నమే యాన అచిదయన అనాది**

వీనికి కారణము మున్నమే ముతల్ మున్నమే అనుచోట్ల చెప్పినట్లు అచిత్ అయన అనాది

**సమ్బన్ధజ్గళ్.**

సంబంధములు.

**వ్యా** - అవిద్యకు మూలము అనాదియగు అచిత్సంబంధము. సౌహార్దమునకు మూలము నారాయణసంబంధము. కాగా, ఇంతవరకును అచిత్సంబంధహేతువుగా అవిద్యయు, అది కారణముగా పుణ్య పాపములు, అది కారణముగా జన్మము, అది కారణముగా రజస్తమోభివృద్ధి,అది కారణముగా అర్థ పంచకజ్ఞానము లేకుండుట, అది హేతువుగా సంసారదు:ఖము కల్గుననియు; నారాయణసంబంధకారణముగ భగవత్సౌహార్దమును, అది హేతువుగా కృపయు, అది హేతువుగా జాయమానకటాక్షమును, అది హేతువుగా సత్త్వవివృద్ధి, అది కారణముగ అర్థపంచకజ్ఞానము, అదిహేతువుగ మోక్షముకల్గునని చెప్పబడినది.

**అవ** - ఈ రెంటివలన ఆత్మకు కలుగునది తెలుపుచున్నారు-

**11.** **ఇవై కిట్టముమ్ వేట్టువేళానుమ్ పోలె ఒణ్పొరుళ్ పొరుళ్-అల్లాతవై**
ఇవి చిట్టెము కందిరీగె వలే స్వప్రకాశమనియు ఏస్తువుగానెంచతగనిదనియు
**యెన్నాతే నానిలాత యానుముళనావన్ ఎన్గిఱ సామ్యమ్**
అనక నానిలాత యానుముళనావన్ అనుపాశురములచెప్పినట్లు సామ్యమును
**పెఱ తిన్ను ఊతి అన్దముమ్ వాళ్వుమ్ ఆకిఱ**
పొందునట్లు తినియు ఊదియు నాశమనియు సుఖమనియు చెప్పబడు
**హాని సత్తైకళై ఉణ్డాక్కుమ్.**
హాని సత్తువలను కలిగించును.

**వ్యా** - చిట్టెము తనలో చేరిన మాణిక్యమును కాంతినశించునట్లు తినివేసి రూపనాశమునొనర్చి తనవలె చేయు నట్లు అచిత్సంబంధము స్వయంప్రకాశకమగు ఆత్మను లేనిదానివలె చేసి జ్ఞానలేశమున్ను లేనట్లు తిని సత్తువకు (ఉనికికి) హానిని కలిగించును. కందిరీగ ఒక పురుగును తెచ్చి గోడ మూలయందుంచి మట్టితోకప్పి తన తొండము పట్టినంత రంధ్రమునుంచుకొని ఆ రంధ్రముగుండా పురుగును పొడుచుచు ఉండుటచే లోనున్న పురుగు పైనున్న కందిరీగనే భయముతో చూచుచు దానిశబ్దమునే వినుచుండుటచే దానివలే మారిపోవును. అట్లే నారాయణసంబంధము, వస్తువుగా నెన్నదగని ఆత్మను, వస్తువుగాచేసి విభుత్వసామ్యమును గల్గించి తనవలె నొనర్చి సత్తువను కల్గించును.

**అవ** - ఇట్లు అనాదిగా అచిదయనసంబంధముతో నీజీవాత్మకుకల సంబంధము నిత్యముండునా యనిన తెల్పుచున్నారు -

**12. ఒన్ఱు కూడినతాయ్ పత్తుఱుక్క మీణ్డొళ్లి కైయాలే పళ్ళువడియేన్**
ఒకటి ఆగంతుకమై పత్తుఱుక్కుమ్ మీణ్డొళ్లి య అను పా.చెప్పినట్లు పళ్ళువడియేన్
**ఎన్ఱుమతు ఒన్ఱుమే ఒళ్లిక్క ఒళ్లియాదు.**
అనునది ఒకటియే విడదీయరానిది.

**వ్యా** - అచిత్సంబంధము పోగొట్టుకొనతగినది అగుటచే ఆగంతుకము. అయనసంబంధము విడదీయరానిదగుటచే అనాది.

**అవ** - ఈ అయన సంబంధమే శాస్త్రప్రదానమునకు కారణమనుచున్నారు -

**13. ఇన్ద ఉదిరత్తేఱిప్పు త్రైగుణ్యవిషయమాన అవత్తుక్కు ప్రకాశకమ్.**
ఈ ఉదరసంబంధమే త్రిగుణములతో గూడిన వేదమునకు కారణమైనది.

**వ్యా** - ఈ అనాదియగు అయనసంబంధమే వేదములను బయల్పఱచుటకు కారణమైనది.

**అవ** - అయనసంబంధమే కారణముగ వేదములను బయల్పఱచినచో మోక్షహేతువగు శాస్త్రమును మాత్రమే తెల్పక బంధహేతువులగు శాస్త్రములను ఏల విధించెనన్న తెల్పుచున్నారు-

**14. వత్సలైయాన మాతా, పిళ్ళై పెకణియామల్ మణ్తిన్నవిట్టు ప్రత్యౌషధమిడుమాపోలే,**
వాత్సల్యముగల తల్లి బిడ్డను అడ్డగింపక మన్నుతిననిచ్చి విరుగుడుకుమందిచ్చునట్లు
**ఎవ్వుయిర్క్కుమ్ తాయ్ఇరుక్కుమ్ వణ్ణమాన ఇవనుమ్ రుచిక్కేడాక పన్దముమ్**
సకలాత్మలకును తల్లియైయున్న విధమగు ఈతడును రుచికితగినట్లు బంధమును
**పన్దమ్అఱుప్పతోర్ మరున్దుమ్ కాట్టుమిఱే.**
బంధమును పోగొట్టునట్టి మందును చూపునుగదా.

**వ్యా** - వాత్సల్యముగల తల్లి బిడ్డ ఇష్టమునకు తగినట్లు మన్నుతిననిచ్చి ఆ దోషము పోగొట్టుటకై విరుగుడునకు మందిచ్చినట్లే సకలాత్మలయందు తల్లివలె వాత్సల్యముగల సర్వేశ్వరుడును చేతనుల రుచికనుగుణముగ బంధహేతువులగు శాస్త్రములను జూపి తరువాత బంధవిముక్తికి తోడ్పడు మోక్షశాస్త్రములనున్నూ తెలియబఱచెను.

అవ - బంధశాస్త్రములను తెల్పుటచే ఎల్లరును సంసారముననే పడియుండుటకు అనుకూలించునే యనగా అదియును క్రమముగ వారి ఉజ్జీవనమునకు హేతువగునని చున్నారు -

**15. అతుతానుమ్ ఆస్తిక్యమ్ వివేకమ్ అన్యశేషత్వ- స్వస్వాతన్త్ర్యనివృత్తి-**
అదియు ఆస్తిక్యమును వివేకమును అన్యశేషత్వ-స్వస్వాతన్త్ర్యనివృత్తి-
**పారతన్త్ర్యఙ్గళై ఉణ్డాక్కిన వళి.**
పారతన్త్ర్యములను కలుగజేసిన విధము.

వ్యా - ఉజ్జీవనకరమగు శాస్త్రమును మాత్రమే తెలియపఱచక బంధహేతువులగు శ్యేనయాగాది శాస్త్రములనున్ను చూపించుట ఎందులకనగా తమోగుణప్రచురులై ద్రవ్యార్జనకై పరహింసాపరులై తిరిగెడి నాస్తికులకు మోక్షశాస్త్రమును చెప్పినట్లైన అది వారలకు రుచింపకపోవుటచే వారి రుచికనుగుణముగ పరహింసారూపములగు అభిచారకర్మములను తెల్పినచో దానివలన ఫలముసిద్ధించుటనుబట్టి వారికి శాస్త్రమునందు విశ్వాసముగలిగి ఆస్తికులైన తర్వాత స్వర్గాదిపురుషార్థములను తత్సాధనములను విధించెడి శాస్త్రమును తెలిపి తద్వారా ప్రకృత్యాత్మవివేకమును గలిగించి తరువాత ఆత్మభోగమునకు మార్గమును చూపించి, అందుమూలముగా అన్యశేషత్వనివృత్తిని గల్గించి,తదుపరి పరమాత్మభోగవైలక్షణ్యమును తత్సాధనభూతమగు భక్తిని తెలిపి అందుమూలముగ స్వస్వాతన్త్ర్యనివృత్తిని గల్గించి ఉపాయాంతరములు దుష్కరములని భయపడుసమయమున స్వయత్ననివృత్తిరూపమగు ప్రపత్తిని ఉపదేశించి స్వరూపయాథాత్మ్యరూపమగు పారతంత్ర్యమును గల్గించుటచే ఇట్లు మొదట బంధశాస్త్రమును ఉపదేశించుటయు చేతనులను క్రమముగ ఉజ్జీవింపచేయుటకు మార్గమైనదిగదా. ఇంతవరకు "ఇవై కిట్టముమ్" అనెడి 11వ సూత్రముమొదలు సంసారమోక్షకారణపరంపరకు చరమావధులగు అచిత్సంబంధము అయనసంబంధములను ఇవి ఆత్మకు కలుగజేయువాటిని ఇందు అచిత్సంబంధము అనిత్యమనియు అయనసంబంధము నిత్యమనియు, ఆ అయనసంబంధమే శాస్త్రప్రదానమునకు గారణమనియు అందునను మోక్షశాస్త్రమునేగాక బంధకశాస్త్రమును సయితము తెలియబఱచుట వాత్సల్యగుణము గలవాడగుటచే క్రమముగ చేతనుల నుజ్జీవింపజేయుటకే ననియు ప్రతిపాదింపబడినది.

అవ - ఇకమీద శాస్త్రప్రతిపాద్యవిషయములసంగ్రహముగ దెల్పి వీనిననుష్ఠించుటకు అనేకయోగ్యతలు కావలసియుండుటచే దుష్కరమని తానే యోచించి యెల్లరకు సులభముగ లభింపదగిన శాస్త్రతాత్పర్యమగు తిరుమంత్రమును బయల్పఱచిన విధమును తెలుపుచున్నారు-

**16. చతుర్విధమాన దేహవర్ణాశ్రమాధికారఫలమోక్షసాధనగతియుగధర్మవ్యూహరూప**
నాల్గువిధములగు దేహవర్ణాశ్రమాధికారఫలమోక్షసాధనగతియుగధర్మవ్యూహరూప
**క్రియాదిగళై అఱివిక్కుమ్ పాట్టుపరప్పుక్కు ప్పెరియతీవినియిల్ ఒన్బతామ్**
క్రియాదులను తెలుపునట్టి శాస్త్రవిస్తృతికి గొప్పద్వీపములలో తొమ్మిదవ భాగమగు
**కూఱుమ్ మానిడప్పిఱవియుమ్ ఆక్కై నిలైయుమ్ ఈరిరణ్డిల్ ఒన్ఱుమ్**
భరతవర్షమును మానవజన్మమును ఆక్కైఅన్నట్లు అస్థిరస్థితియును నాల్గింటిలో ఒకటగు
**ఇళమైయుమ్ ఇశైవుమ్ ఉణ్డాయ్ పుకువరేలుమ్ ఎన్గిఱతుక్కు ఉళ్ళే**
బాల్యమును ఆశయు కల్గియుండి పుకువరేలుమ్ అన్నట్లు పూర్ణాయువుపొంది
**విఘ్నమఱ నిఱ్కవా-నిల్లా ప్రమాథియైయెక్కొణ్డు అఱ క్కటైక్కై అరితుఎన్గిఱతే**
విఘ్నమురాకుండ ఉన్నచోటఉండని మనస్సునుస్థిరమొనర్చి శాస్త్రములచదువుట దుర్లభమనిగదా
**వేదసారోపనిషత్ సారతరానువాక సారతమ గాయత్రియిల్ ముతల్ ఓతుకిఱ**
వేదసారోపనిషత్ సారతర అనువాక సారతమ గాయత్రియందు మొదట చెప్పబడిన
**పొరుళ్ముడివాన శురుక్కై తైవవణ్డాయ్ అన్నమాయ్ అముతమ్**
శాస్త్రతాత్పర్యమైన సంగ్రహము[తి.మం.ను] తైవవణ్డై హంసయై అమృతము
**కొణ్డవన్ శాఖైకళిలుమ్ ఓతమ్పోల్ కిళర్ నాల్వేద క్కడలిలుమ్**
గొన్నవాడు అన్నట్లు శాఖలయందును కడలివలె పెరిగిన నాల్గువేదములను కడలిన
**తేనుమ్ పాలుమ్ అముతుమాక ఎడుత్తుపెరు విశుమ్బుఅరుళుమ్ పేర్ అరుళాలే**
తేనెను పాలను అమృతము తీసి గొప్ప ఆనందమిచ్చునట్టి గొప్ప కృపచే
**శిజ్ఞామై విరిత్తతు.**
సంకోచింపక విస్తరింపజేసినది.

**వ్యా** - అతి దురవగాహములగు అనర్థములను ఇమిడ్చుకొనియున్న శాస్త్రములందు తాత్పర్యము తెలియునట్లు చదువుటకు జంబూద్వీపమునందు తొమ్మిదవదగు భరతఖండమునజన్మమును, అందును మానవజన్మమును పొంది శరీరస్థైర్యముగల్గి బ్రాహ్మణవర్ణమున పుట్టుటయు, అందునను బాల్యముననే ఇచ్ఛయుమొదలుగునవి ఆవశ్యకమగుటచే నింతవరకూ లభించియు నిర్విఘ్నముగ శాస్త్రమునభ్యసించుట దుర్లభమని తనహృదయమున దలచిన సర్వేశ్వరుడు తనకృపచే సంసారిచేతనుల నుజ్జీవింపజేయుటకై తానే ఆచార్యుడై యవతరించి సకలశాస్త్రతాత్పర్యమగు తిరుమంత్రమును బయల్పఱచెను.

**అవ** - ఇట్లు శాస్త్ర, శాస్త్రతాత్పర్యములనెట్లు బయల్పఱచెను? వాటికి విషయమేది? యనెడి వివక్షను తెలుపుచున్నారు-

**17. మునివరై యిడుక్కియుమ్ మున్నీర్ వణ్ణనాయుమ్ వెళియిట్ట శాస్త్రతాత్పర్యఙ్గళుక్కు**
మునిశ్రేష్ఠుల నేర్పఱచియు నరనారాయణుడైయు, బయల్పఱచినశాస్త్రతాత్పర్యములకు
**విశిష్ట-నిష్కృష్టవేషఙ్గళ్ విషయమ్.**
విశిష్ట- నిష్కృష్టవేషములు విషయము.

**వ్యా** - వ్యాసాది ఋషులకు అంతర్యామియైయుండి వారిద్వారా బయల్పఱచిన శాస్త్రమునకు చేతనులయొక్క దేహవిశిష్టమగు స్వరూపము విషయము. [అనగా దేహముకన్న ఆత్మ వేరని తెలుసుకొనుటయే ప్రయోజనము.] సర్వేశ్వరుడే స్వయంగా నరనారాయణరూపమై శ్రీబదరికాశ్రమమున అవతరించి శిష్యాచార్యరూపముగా బయల్పఱచిన తిరుమంత్రమునకు చేతనుల నిష్కృష్టస్వరూపము విషయము. [అనగా శరీరముకన్న వేరైన ఆత్మ పరమాత్మకు శేషభూతమని తెలియుటయే ప్రయోజనము.] దీనివలన శాస్త్రమునకు దేహము విషయమనియు, శాస్త్రతాత్పర్యమునకు ఆత్మ విషయమనియు నెరుగునది.

**అవ** - ఈ రెండింటినభ్యసించుటకు ఎల్లరకును అధికారముగలదా లేక కొందరికేనా యను విషయమును తెల్పుచున్నారు-

**18. తోల్పురైయే పోమతుక్కు ప్పలతిలా యోగ్యతైవేణుమ్; మనముడైయీర్**
శరీరముతో పోవుదానికి అనేకమగు యోగ్యతలుకావలయును; మనసుకలవారలారా
**ఎన్గిఱ శ్రద్ధయే అమైన్ద మర్మస్పర్శిక్కు నానుమ్ నమరుమ్ ఎన్నుమ్పడి**
అన్నట్లు శ్రద్ధయే తగియుండు తిరుమంత్రమునకు నేనును నావారును అనదగినట్లు
**సర్వరుమ్ అధికారికళ్.**
అందరును అధికారులు.

**వ్యా** - అంతరమగు స్వరూపమున ఊనికలేక పైనగల దేహమునమాత్రమే అభిప్రాయమగు శాస్త్రమునభ్యసించుటకు జన్మాధిక్యత ఆచారము మొదలగుననేక యోగ్యతలు గావలయును; ఆత్మస్వరూపము విషయముగాగల శాస్త్రతాత్పర్యమగు తిరుమంత్రమునభ్యసించుటకు సర్వసామాన్యముగ అందరకును అధికారముగలదు.

**అవ** - శాస్త్రతాత్పర్యనిష్ఠులుగ ఉండునట్టి ముముక్షువుల నడవడికలను తెలుపుచున్నారు-

**19. శాస్త్రికళ్ తెప్పక్కైయరైప్పోలే ఇరణ్డైయుమ్ ఇడుక్కి ప్పిఱవి**
శాస్త్రజ్ఞులు తెప్పకొయ్యతోనీదువారివలె రెండుచేతులతోనూ పట్టుకొని సంసార

**క్కడలై నీన్ద, సారజ్ఞర్ విట్టత్తిల్ ఇరుప్పారైప్పోలే ఇరుక్కైయుమ్**
సముద్రమును ఈదగా సారజ్ఞులు పడవన ఉన్నవారివలె రెండుచేతులను
**విట్టు కరై కుఱుకుమ్ కాలమ్ ఎణ్ణువర్కళ్.**
విడిచి ఒడ్డును చేరెడి కాలము లెక్కింతురు.

**వ్యా** - శాస్త్రనిష్ఠులగు ఉపాసకులు నదినిదాటువ్వారు తెప్పను ఒక చేతితో పట్టుకొని తామొక చేతితో నీదునట్లు, స్వయత్నమును దానిచే సాధింపబడునట్టి భగవత్కృపయును అవలంబించి సంసారసాగరమును దాటుటకు యత్నించుదురు.తిరుమంత్రనిష్ఠులగు ప్రపన్నులు ఓడయందు రెండు చేతులను విడిచి నిర్భరులైయుండువారివలె వైకుంఠుడనెడి ఓడనాశ్రయించి కేవల భగవత్కృపయే ఉత్తారకమని నిశ్చయించి "కూవిక్కొళ్ళుం కాలమిన్నమ్ కుఱుకాతో" (నీవద్దకు పిలుచుకొనెడి కాలమింకను సమీపించలేదా) అని భగవత్ప్రాప్తికాలమును నిరీక్షించుచుందురు.

**అవ** - వీరికీవిధములుండుటకు కారణమును తెల్పుచున్నారు-

**20. ఇవై స్వరూపత్తై ఉణర్న్దు ఉణర్న్దు ఉణర్వుమ్**
ఇవి ఆత్మస్వరూపమును తెలుసుకొని మననముచేసి ధ్యానించియు
**ఉణర్వై ప్పెఱ ఊర మిక- ఉణర్వుమ్ ఉణ్డామ్.**
జ్ఞానము గల్గునట్లు నడిపించ స్వరూపయాథాత్మ్యజ్ఞానము గలుగును.

**వ్యా** - శాస్త్రజ్ఞులు ఆత్మస్వరూపమును నిత్యజ్ఞానగుణకమై, ఆ జ్ఞానముచే సర్వత్ర వ్యాపించి దేహాద్విలక్షణమై, కర్తృత్వభోక్తృత్వయుక్తమై, భగవచ్ఛేషమై యుండునని శ్రవణమననములచే సాక్షాత్కరింపగనే, వారు స్వయత్నముచే జన్మసముద్రమును దాటయత్నింతురు; తిరుమంత్రనిష్ఠులు, భగవద్వ్యతిరిక్తమగు సర్వమును హేయమను జ్ఞానము లభించునట్లు నిర్హేతుకముగ భగవానుడు తెలియబఱచగా దానివలన ఆత్మస్వరూపమును దేహాదివిలక్షణమనియు జ్ఞాతృత్వాదిగుణకమనియును తదీయశేషత్వపర్యంతమగు భగవచ్ఛేషత్వముగలిగి తత్కాష్ఠయగు పారతంత్ర్యభోగ్యత్వములుగలదనియు తెలియగనే తమభారమును వానిపై పడవైచి స్వయత్నరహితులై యుందురు. స్వరూపవిషయమున వీరికి గల జ్ఞానమునందలి తారతమ్యమే యింతకుముందు చెప్పినట్టి యాకారములు వీరి కుండుటకు హేతువని దీనిచే తెలియుచున్నది. "మునివరై" అనెడి 7వ సూత్రముమొదలు నింత వరకూ శాస్త్రముయొక్క, తత్తాత్పర్యమగు తిరుమంత్రముయొక్క విషయములకు గల భేదమును, అధికారి భేదమును ఆ అధికారుల విశ్వాసములగల భేదమును, అందులకు కారణమగు జ్ఞానమున గల తారతమ్యము చెప్పబడినవి.స్వరూపమనియు, స్వరూపయాథాత్మ్యజ్ఞానమనియు నిట్లు

ఆత్మస్వరూపవిషయమగు జ్ఞానమున తారతమ్యముగలదు. అందు "పతిం విశ్వస్య" (తై. నా. 1) [జగత్తును పాలించువాడు] అనియు, "యస్యాస్మి" (యజు. 2అ. 3-7) [ఏ పరమాత్మకు నేను శేష భూతుడనో] అనియు; "న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే" (బృ. 6-3-10) [జ్ఞాతయగు ఆత్మ యొక్క జ్ఞానమునకెన్నడును భంగములేదు.] అనియు; "జానాత్యేవాయం పురుష:" (ఈ పురుషుడు తెలుసుకొనువాడు) అనియు; నిట్లు ఆత్మ భగవంతునికి శేషభూతమైనదనియు జ్ఞాతయనియు చెప్పి అట్టి జ్ఞాతృత్వకార్యమగు భోక్తృత్వమునకు ప్రయోజనముగ "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై.ఆ1) [ముక్తపురుషుడు పరబ్రహ్మమును వాని కల్యాణగుణములను అనుభ వించుచున్నాడు] అనియును తెలుపునట్టి శాస్త్రముద్వారా ఆత్మస్వరూపమును తెలుసుకొన్నప్పుడు భగవచ్ఛేషత్వమును భగవదనుభవ భోక్తృత్వమును తెలియును. అట్టి శాస్త్రముయొక్క తాత్పర్య మగు తిరుమంత్రముయొక్క అర్థమును తెలుసుకొన్నతర్వాతనే పారతంత్ర్యభోగ్యతారూపమగు ఆత్మస్వరూపయాథాత్మ్యజ్ఞానము ప్రకాశించును.

అవ - ఈ పారతంత్ర్యభోగ్యతారూపమగు జ్ఞానమే ఆత్మస్వరూపముయొక్క యథార్థ జ్ఞానమనెడి విషయమును తెలుపుచున్నారు-

**21. శేషత్వభోక్తృత్వఙ్గళ్-పోలన్ఱే పారతంత్ర్యభోగ్యతైకళ్.**

శేషత్వభోక్తృత్వములవంటివిగావుకదా పారతంత్ర్యభోగ్యతలు.

**వ్యా** - శేషత్వమనగా ఇష్టమువచ్చినట్లు ఉపయోగపరచుకొనుటకు తగినదిగా నుండుట. ముద్దబంగా రమువలే. **పారతంత్ర్య**మనగా శేషికి యిష్టమువచ్చినట్లు వినియోగపడుచుండుట. అనగా ఆభరణబం గారమువలె. **భోక్తృత్వ**మనగా జ్ఞాతృత్వబలమువలన భోగదశయందు చేరియుండు రసములను తాన నుభవించువాడగుట.

భోగ్యతయనగా పదార్థమునందుండు రస వర్ణాదులు వాటిననుభవించు వానికి భోగ్యముగా నుండునట్లు ఆత్మకు గల జ్ఞానానందాదులు సర్వేశ్వరునికే భోగ్యములుగా నుండుట.

కావున ఈ ఆత్మవస్తువును శేషియగు పరమాత్మకు యిష్టమువచ్చినట్లు వినియోగపఱచి యిచ్చునదు పారతంత్ర్యము, ఇష్టమువచ్చినట్లు వినియోగపరచుకొనుటకు తగియుండుటమాత్రమే అగు శేషత్వముకంటె గొప్పది. అట్లే భోగసమయమున స్వార్థతాబుద్ధి కలుగజేయునట్టి భోక్తృత్వము కంటె అట్టి భోక్తృత్వమును శేషియొక్క ఇష్టమునకై వినియోగపఱచి ఇచ్చునట్టి భోగ్యత గొప్పది.

**అవ** - ఈ పైవివరణమును స్వరూపయాథాత్మ్యప్రకాశకమగు తిరుమంత్రమున చూపు చున్నారు -

**22. జ్ఞానచతుర్థికళిన్ మేలేయిఱే ఆనన్దషష్ఠికళుక్కు ఉదయమ్.**

జ్ఞానచతుర్థుల పైన గదా ఆనందషష్ఠుల ఉదయము.

వ్యా - ఆత్మను తెలుపు మకారమున"మన-జ్ఞానే" అను ధాతువుచేనుదయించి భోక్తృత్వమును ప్రకాశింపజేయునట్టి జ్ఞానముపై మకారముయొక్క అర్థమును వివరించునట్టియు భోగ్యతను తేటపఱచునట్టియు చతుర్థియందు ఆనందముదయించును. దీనినెచ్చటతెలియదగుననిన ప్రణవముయొక్క ప్రథమాక్షరమున (అకారమున) ఉండి శేషత్వజ్ఞానమును తెలుపునట్టి లుప్తచతుర్థి తరువాత గదా పారతంత్ర్య ఆనందమును తెలుపునట్టి "నమః" అను పదము ఉదయించుట. ఇంత కంటెను మంచి యోజన, శేషత్వ భోక్తృత్వములు ఆత్మయొక్క స్వరూపధర్మములు.పారతంత్ర్యభోగ్యత్వములు ఆత్మయాథాత్మ్య స్వరూపధర్మములు. స్వరూపధర్మములకన్న స్వరూపయాథాత్మ్యధర్మములు గొప్పవి.

నమః శబ్దములోని మః చేత నేను, నాదియను భావములేర్పడుచున్నవి. 'న' చేత అవినిషేధింపబడినవి. కాగా నమః పదముచేత శేషత్వజ్ఞానము కల్గును. దీనిచే ఎవడు జ్ఞాతయో వాడే భోక్తయు (ఎవడు తెలుసుకొనునో వాడే భోక్తయు అనుభవించువాడు) అగుటచే ఈ నమః పదముచే శేషత్వభోక్తృత్వ జ్ఞానము కల్గినది. దీనితరువాతదియగు నారాయణపదముపైనగల స్పష్టచతుర్థియగు ఆయ చేత నారాయణునికొఱకేగానీ నాకొఱకు గాని, యితరులకొఱకుగానికాదని తెలియుటచే పారతంత్ర్యభోగ్యత్వజ్ఞానము కలుగుచున్నది. అనగా భగవానునికే పరతంత్రుడనగు నేను చేయు కైంకర్యములవలన గలుగు ఆనందము (భోగ్యత) భగవానునికే గాని నాకు కాదను భావన. ఇట్లు శేషత్వభోక్తృత్వములకు విరోధులగు పారతంత్ర్యభోగ్యత్వముల పుట్టుకను సహించిన శేషత్వభోక్తృత్వములకన్న తమ విరోధుల పుట్టుకను సహింపని పారతంత్ర్యభోగ్యత్వములు శ్రేష్ఠములు.

జ్ఞానులు, శాస్త్రజ్ఞులనియు సారజ్ఞులనియు రెండువిధములు. శాస్త్రజ్ఞులు శాస్త్రముద్వారా ఆత్మస్వరూపమును. జ్ఞాతృత్వభోక్తృత్వశేషత్వస్వరూపములుగల దానినిగ తెలుసుకొని మోక్షమును పొందుటకు ఉపాసనాదులనొనర్చుటచే స్వప్రయత్నమును సర్వేశ్వరుని కృపను రెంటిని సాధనములుగా స్వీకరింతురు.

సారజ్ఞులు సర్వేశ్వరునియందు భారముంచి స్వప్రయత్నమేమియూ లేక నిర్భరులుగా నుందురు.

ఇట్లు ఆత్మ,శేషత్వభోక్తృత్వస్వరూపముగలదియను శాస్త్రజ్ఞులజ్ఞానముకంటే ఆత్మపారతంత్ర్యభోగ్యత్వములే స్వరూపములుగ గలదియను సారజ్ఞులజ్ఞానమే శాస్త్రసారము.

**అవ - స్వరూపయాథాత్మ్యజ్ఞానదశలో తెలియవచ్చు పారతంత్ర్యభోగ్యత్వములు**

స్వరూపజ్ఞానదశలో తెలియవచ్చు శేషత్వభోక్తృత్వములను అనాదరించుననని తెలుపుచున్నారు-

**23. ముళై త్తెళుంద సూర్యతుల్య యాథాత్మ్య చరమమ్, వితియిల్ కాణుమ్**

పుట్టి పెరిగిన సూర్యచంద్రసమమగు వాస్తవమగు పారతంత్ర్యభోగ్యతలు శాస్త్రమున కన్పించు

**ప్రథమమధ్యమదశైకళై పకల్‌విళక్కుమ్ మిన్మినియుమ్ ఆక్కుమ్.**

శేషత్వభోక్తృత్వదశలను పగటిదీపముగను మిణుగురుగను చేయును.

**వ్యా** - శాస్త్రముద్వారా శ్రవణమననాదులమూలమున ప్రథమాక్షరమగు ప్రణవమునందలి అకారముచే శేషత్వజ్ఞానమును మకారముచే భోక్తృత్వజ్ఞానమును తెలియదగును. ఇదిస్వయత్నసాధ్యమగు స్వరూపజ్ఞానము. అట్లుగాక మధ్యమపదమగు 'నమః' పదముచేత కలుగునట్టి పారతంత్ర్య, చరమపదమగు 'నారాయణాయ' చేత కలుగునట్టి భోగ్యతలు స్వరూపయాథాత్మ్యజ్ఞానమనబడును. ఇవి భగవదనుగ్రహముచే కలుగునవి. కావున స్వయత్నస్వప్రయోజనములకెంతమాత్రము తావీయనివియును, స్వశేషియగు పరమాత్మ భోగ్యతకనుకూలమై స్వరూపము నధికముగ ప్రకాశింపజేయునవియగు పారతంత్ర్యభోగ్యతలు శేషత్వ భోక్తృత్వములను తిరస్కరించి పగటిదీపమువలెను మిణుగురుపురుగు కాంతివలెను అల్పమొనర్చును.

**అవ** - శాస్త్రజ్ఞులుగా చెప్పబడిన స్వరూపజ్ఞానపరులను ప్రవృత్తిమార్గనిష్ఠులుగను, సారజ్ఞులుగ చెప్పబడిన స్వరూపయాథాత్మ్య జ్ఞానపరులను నివృత్తిమార్గ నిష్ఠులుగను చేయునదేదియని తెల్పుచున్నారు.

**24. నాలిల్ ఒన్ఱు ప్రవర్తకమ్ ; ఒన్ఱు నివర్తకమ్.**

నాల్గింటిలో ఒకటి ప్రవర్తకము ఒకటి నివర్తకము.

**వ్యా** - శేషత్వభోక్తృత్వ పారతంత్ర్యభోగ్యతలు నాల్గింటిలోనూ భోక్తృత్వము ప్రవృత్తిమార్గనిష్ఠులనొనర్చును. భోగ్యతనివృత్తిమార్గనిష్ఠులనొనర్చును. భోక్తృత్వమనగా నేను అనుభవించువాడనను భావన అగుటచేత తనకైతాను ప్రయత్నమొనర్ప వలెను. భోగ్యతయనగా తాననుభవింపబడువాడనను భావనయగుటచే తన ననుభవించువాడగు సర్వేశ్వరుడే తనకై ప్రయత్నమొనర్చునుగాన అనుభవింపబడువాడగు చేతనుడు తనుచేయుప్రయత్నమేమియు లేకపోవుటచే నివృత్తిమార్గనిష్ఠుడగును.

**అవ** - శేషత్వభోక్తృత్వజ్ఞానము ప్రపన్నులకును ఉండునుగదా. అది వారికెట్లు ఉపకరించుననుచున్నారు-

**25. ముఱ్ఱాపదర్క్కు క్రియాఙ్గమానవై యిరణ్డుమ్ శెయల్తీర్న్దార్ వృత్తియిల్**
ముందువాళ్ళకు క్రియకంగములగు రెండును చేయుటతీరినవారికి కైంకర్యమున
**స్వనిర్బంధమ్ అఱుక్కుమ్**
తన నిర్బంధమును తొలగించును.

వ్యా - ముందుగ చెప్పబడిన ఉపాసకులకు, ఉపాసనక్రియకు అంగములగు శేషత్వభోక్తృత్వములు రెండును ప్రపన్నునకు ఆనందమున తనకై తానుచేయవలసినదేదియు లేక సర్వేశ్వరుని అతిశయమును పెంచుటకు ఉపయోగపడు కైంకర్యమున తన ప్రయోజనమునకను నిర్బంధమును నశింపజేయును.

అవ - క్రియయని చెప్పబడిన కర్మయును, వృత్తియని చెప్పబడిన కైంకర్యమును ఉపాసక-ప్రపన్నులకు ఎందుకు అనుగుణముగా ఉండుననుచున్నారు -

**26. కర్మ కైంకర్యఙ్గళ్ సత్యాసత్య నిత్యానిత్య వర్ణదాస్యానుగుణఙ్గళ్.**
కర్మ కైంకర్యములు సత్య, అసత్య, నిత్య, అనిత్య, వర్ణ, దాస్య అనుగుణములు.

వ్యా - కర్మము అసత్యమును అనిత్యమునగు బ్రాహ్మణాదివర్ణములకనుగుణముగా (తగినదిగా) నుండును. కైంకర్యము సత్యమును నిత్యమునగు ఆత్మస్వరూపమగు దాస్యమునకు తగినదిగానుండును. వర్ణము శరీరసంబంధమునుబట్టి వచ్చి శరీరముతో పోవునదిగావున అసత్యమును అనిత్యమును. దాస్యము ఆత్మతత్త్వమునుబట్టి ఉండునదిగాన సత్యమును నిత్యమును.

అవ - కర్మ కైంకర్యముల కల్గించునవేవి? అనితెల్పుచున్నారు-

**27. ఇవత్తుక్కు విధి రాగఙ్గళ్ ప్రేరకఙ్గళ్.**
వీనికి విధి, అనురాగములు ప్రేరకములు.

వ్యా - కర్మమునకు శాస్త్రవిధియు, కైంకర్యమునకు భగవంతునియందలి అనురాగమును (ప్రీతియు) ప్రేరకములు. యజేత (యజ్ఞము చేయవలెను) జుహుయాత్ (హోమము చేయవలెను) అనెడు శాస్త్రవిధి కర్మమును ప్రేరేపించును. ఉకన్దు పణి శెయ్తు [ప్రీతితో సేవయొనర్చి] అనెడి భగవంతుని యందలి ప్రీతితో దాస్యధర్మమునకు అభివర్ధకమగు కోరిక కైంకర్యమునకు ప్రేరకము.

అవ - కైంకర్యకర్మలకు ఆశ్రయమెవ్వరనిన తెల్పుచున్నారు-

**28. మణ్ణినారుమ్ మత్తైయారుమ్ ఆశ్రయమ్.**

ప్రపన్నులు ఉపాసకులు ఆశ్రయము.

వ్యా - భగవంతునియందును అతడు ప్రీతితో వేంచేసియున్న దివ్యదేశములందును ప్రీతిగల ప్రపన్నులు కైంకర్యమునకు ఆశ్రయభూతులు. జ్యోతిస్వరూపుడగు సర్వేశ్వరుని శాస్త్రనియమనము ప్రకారము ఉపాసించువారు కర్మమునకు ఆశ్రయభూతులు.

అవ - పైనచెప్పిన కర్మ కైంకర్యములకు విషయమేదని తెల్పుచున్నారు-

**29. అరుళ్ ముడియనిఱుత్తి అడైయనిన్గతుమ్, నల్లతోర్అరుళ్ తన్నాలే నన్గుమ్**

కృప పూర్తిగనింపి అంతరాత్మగ నున్నదియు మంచికృపను తానేచూపి మిక్కిలి

**ఎళియనాకిఱతుమ్ విషయమ్.**

సులభుడై అర్చగానున్నదియు విషయము.

వ్యా - చేతనులయందలి కృపచే వారి వారి కర్మానుగుణముగ శాస్త్రోక్తములగు కోర్కెలనిచ్చుటకై బ్రహ్మాది దేవతాంతర్యామిగనుండి ఫలములనిచ్చుట కర్మానుష్ఠానమునకు విషయము. తన కృపవలననే ఎక్కువ సులభుడై అర్చావతారముగనున్నస్థితియే కైంకర్యమునకు విషయము.

అవ - కర్మ కైంకర్యముల తారతమ్యము తెలుపుచున్నారు-

**30. ఇవత్తాలే సాధారణమ్ అసాధారణమ్ ఎన్నుమ్.**

వీనిచే సాధారణము అసాధారణము అనబడును.

వ్యా - దేవతాంతర్యామిగనుండు సాధారణవిగ్రహముగలవానినిగూర్చి చేయు కర్మము సాధారణమనియు, అర్చావతారముగనుండు అసాధారణవిగ్రహముగలవానినిగూర్చి చేయు కైంకర్యము అసాధారణమైన దనియు చెప్పబడుచున్నది.

అవ - కైంకర్యనిష్ఠులకు కర్మ తనంతనే తొలగిపోవుననుచున్నారు.

**31. జాత్యాశ్రమ దీక్షైకళిల్ భేదిక్కుమ్ ధర్మఙ్గళ్పోలే అత్తాణిచ్చేవకత్తిల్**

జాతిఆశ్రమ దీక్షలయందు భేదించు ధర్మములవలె అంతరంగసేవయందు

**పొతువానతు నழுవుమ్.**

సాధారణకర్మ విడిచిపోవును.

వ్యా - బ్రాహ్మణాదిజాతులయందును, బ్రహ్మచర్యాది ఆశ్రమములందును, జ్యోతిష్టోమాది దీక్షల యందును ఆచరించవలసిన ధర్మములు వేరువేరుగనుండునట్లు కైంకర్యపరులకు సాధారణకర్మ నిద్రించువానిచేతిలోని వస్తువు దానంతటదియే జారిక్రిందపడునట్లు విడిచిపోవును.

**అవ** - కైంకర్యనిష్ఠులకు కర్మనిష్ఠులతో సంబంధము లేదనుచున్నారు-

**32.** సాధనసాధ్యఙ్గళిల్ ముదలుమ్ ముడివుమ్ వర్ణధర్మికళ్ దాసవృత్తికళెన్ఱు
సాధనసాధ్యములందు కర్మయును కైంకర్యమును వర్ణోచితకర్మిష్ఠులు కైంకర్యనిష్ఠులు అని
**తుఱై వేఱిడువిత్తతు.**
రేవును వేరుచేసినది.

వ్యా - సాధనమునందు మొదటిదగు కర్మయును, సాధ్యమునందు చివరిదగు కైంకర్యమును, వర్ణాశ్రమము లకు తగిన కర్మలనాచరించెడి కర్మిష్ఠులనియును, స్వరూపమునకు తగిన సేవలొనర్చెడి కైంకర్యనిష్ఠులనియును రేవులను వేరుచేసినవి. తిరువహీంద్రపురమున విల్లిపుత్తూర్పకవర్ అను నొక జీయర్స్వామి యుండిరి. వీరు స్నానాద్యనుష్ఠానములకొఱకు నదికివెళ్ళి అందరూ స్నానమాడెడి రేవును విడిచి వేరు రేవున స్నానమాచరించగా, అచ్చటి బ్రాహ్మణులు వీరిని వేరురేవునకేలపోతిర నియడుగగా అందుకు జీయరు "మీరు కర్మిష్ఠులు మేము ప్రపన్నులము. మీతో మాకు పొత్తు కుదురదు" అనిరి.

**అవ** - కర్మ కైంకర్యనిష్ఠులయొక్క జన్మవిశేషమును తెలుపుచున్నారు-

**33.** వేదవిత్తుక్కళుమ్ మిక్కవేతియరుమ్ ఛందసామ్ మాతావాలుమ్ అతుక్కుమ్
కర్మనిష్ఠులును కైంకర్యనిష్ఠులును వేదమాతయగు గాయత్రిచేతను దానికి
**తాయాయ్ తాయినుమాయినశెయ్యుమ్ అత్తాలుమ్ పిఱప్పిక్కుమతు ఇరువర్క్కుమ్**
తల్లియై తల్లికన్నఉపకరించు అష్టాక్షరిచే పుట్టించునది ఇద్దరికిని
**శ్రేష్ఠజన్మమ్.**
శ్రేష్ఠజన్మము.

వ్యా - కర్మనిష్ఠులకు గాయిత్రి ఉపదేశముచే శ్రేష్ఠజన్మయును, ఆ గాయత్రికిని తల్లియై అంతకన్న ఉపకారకమగు తిరుమంత్రోపదేశముచే కైంకర్యనిష్ఠులకు శ్రేష్ఠజన్మయును లభించుచున్నవి. గాయత్రి ఉపదేశముచే వర్ణాశ్రమములకు తగిన విధినిషేధములకును, అందుకు తగిన ఫలప్రాప్తికి తగినదగుటచే కర్మిష్ఠులకు శ్రేష్ఠ జన్మము. తిరుఅష్టాక్షరి ఉపదేశముచే స్వరూపమునకు తగిన విధి నిషేధములకును, అందుకు తగిన ఫలప్రాప్తికిని తగినదగుటచే కైంకర్యనిష్ఠులకు శ్రేష్ఠజన్మము.

**అవ** - ఇట్టి శ్రేష్ఠములగు జన్మలుగల వీరిరువురినికి లక్షణములు తెలుపుచున్నారు-

**34. అన్దణర్ మఱైయోరెన్గుమ్ అడియార్తొణ్డరెన్గుమ్ ఇవర్కళుక్కు నిరూపకమ్.**

బ్రాహ్మణులు వైదికులనియు శేషత్వకైంకర్యనిష్ఠులనియు వీరలకు నిరూపకము.

**వ్యా** - వర్ణమునకు తగిన వైదికత్వము కర్మిష్ఠులకు నిరూపకము. ఆత్మ వస్తువునకు జ్ఞానానందముల కంటెను అంతరంగనిరూపకమగు శేషత్వమును దానికి తగిన కైంకర్యమును కైంకర్యనిష్ఠులకు నిరూపకము.

**అవ** - వీరికి జ్ఞానకులాదులచే వచ్చు పేర్లు నిరూపకములు కావా?యనిన తెలుపుచున్నారు-

**35. ఒరుతలైయిల్ గ్రామకులాది వ్యపదేశమ్ కులన్దరుమ్ మాశిల్కుడి**

కర్మనిష్ఠులకు గ్రామకులాది వ్యవహారము కులమిచ్చును దోషరహితకులము

**పృక్ఱియెన్ఱు పతియాక క్కోయిలిల్ వాళ్ముమ్ ఎన్బర్కళ్.**

నిందయని స్థానముగ శ్రీరంగమున సుఖించువ రు అందురు.

**వ్యా** - కర్మనిష్ఠులకు గ్రామకులాదులనుబట్టి వ్యవహారము. కైంకర్యనిష్ఠులకు తిరుమంత్రముచే లభించిన ఉత్తమమైన దాసకులముగలవారు, శేషత్వవిరోధియను దోషములేని వైష్ణవకులముకల వాడు అని చెప్పుటతప్ప గ్రామకులాది నిర్దేశమొనర్చుట దోషావహమను తలంపుతో అట్లుచెప్పక తిరుమల, శ్రీరంగము మొదలగు దివ్యదేశముల సుఖించువారని చెప్పుదురు.

**అవ** - కర్మిష్ఠుల కైంకర్యనిష్ఠుల కూటస్థపురుషులను తెల్పుచున్నారు-

**36. విప్రర్క్కు గోత్రచరణసూత్రకూటస్థర్ పరాశర పారాశర్య బోధాయనాదికళ్**

విప్రులకు గోత్రచరణసూత్రకూటస్థులు పరాశర వ్యాస బోధాయనాదులు

**ప్రపన్నజనకూటస్థర్ పరాఙ్కుశ- పరకాల యతివరాదికళ్.**

ప్రపన్నజనులకూటస్థులు పరాంకుశ పరకాల యతివరాదులు.

**వ్యా** - కర్మనిష్ఠులగు బ్రాహ్మణులకు గోత్రచరణసూత్రములకు కూటస్థులనబడు మూలపురుషులు, పరాశరవ్యాసబోధాయనాది ఋషులు. ప్రపన్నజనులకు కూటస్థులనబడు మూలపురుషులు, నమ్మాళ్వార్లు, తిరుమంగైయాళ్వార్లు, భగవద్రామానుజులు మొదలగువారు. గోత్రమనగా వంశపరంపర చరణములనగా వేదశాఖలు. సూత్రమనగా కర్మానుష్ఠానమును ప్రతిపాదించునట్టి కల్పము.

**అవ** - కర్మిష్ఠులకు బ్రాహ్మణత్వమును, ప్రపన్నులకు వైష్ణవత్వమును సిద్ధించుటకు హేతువులు తెలుపుచున్నారు -

**37. అధ్యయన జ్ఞానానుష్ఠానఙ్గళాలే బ్రాహ్మణ్యమాకిఱా పోలే శన్దఙ్గళాయిరముమ్**
వేదాధ్యయన జ్ఞానానుష్ఠానములచే బ్రాహ్మణ్యము సిద్ధించునట్లు ద్రావిడవేదాధ్యయన
**అఱియక్కత్త వల్లారానాల్ వైష్ణవత్వసిద్ధి.**
అర్థజ్ఞానానుష్ఠానపరులగుటచే వైష్ణవత్వసిద్ధి.

వ్యా - వేదమును చదువుట, దానియర్థమునెఱుగుట, వేదోక్తవిధులనాచరించుటలచే బ్రాహ్మణ్యము సిద్ధించినట్లే తిరువాయ్మొళ్ళి వేంఋపాశుర ములను వాని యర్థ ములను ఆచార్యోపదేశముచే నెఱిగి వానికి తగినట్లు ఆచరించినచో వైష్ణవత్వము సిద్ధించును.

అవ - సంస్కృతవేదాధ్యయనపరులగు కర్మిష్ఠులకు ద్రావిడవేదవేదాన్తాధ్యయనము లేక పోయినచో వైష్ణవత్వము సిద్ధింపదే తప్ప బ్రాహ్మణత్వమునకు హానిలేదేయనిన తెల్పు చున్నారు-

**38. ఇన్ద పుట్పొరుళ్ కత్తుణర్న్దు మేలైత్తలై మత్తైయోరాకాతారై "అయల్శతు**
ఇట్టి రహస్యార్థము తెలుసుకొని ఉత్కృష్టులగు వేదాంతులుకానివారు వేదమునకు
**పేృతిమారెన్ఱు" ఉత్పత్తి నిరూపిక్కుమ్.**
పొరుగువారని పుట్టుకచే బ్రాహ్మణులనబడుదురు.

వ్యా - ఉపనిషద్రహస్యప్రతిపాదకమగు ద్రావిడవేదార్థమును ఆచార్యఉపదేశమూలకముగ అభ్యసించక నాల్గువేదములనభ్యసించియున్నను అట్టివారు జాతిమాత్రముచే బ్రాహ్మణులనబడుదురేగాని, సర్వశాస్త్రతాత్పర్యమగు విష్ణుభక్తిలేనివారగుటచే వారియందు బ్రాహ్మణ్యములేదు.

అవ - తిరువాయ్మొళ్ళి కి వేదత్వమును సాధింపదలచి ముందుగ నిట్టి వేదమొకటియుండునా? అనుటకు సమాధానమును తెల్పుచున్నారు-

**39. "ఎవ్వులకత్తెవ్వైవైయుమ్" ఎన్గైయాలే వేదమ్ బహువిధమ్.**
ఎవ్వులకత్తెవ్వైవైయుమ్ అనుటచే వేదము పలువిధము.

వ్యా - లోకభేదమునుబట్టియు అధ్యయనముచేయువారి భేదమునుబట్టియు వేదము అనేకముగ నుండును.

అవ - అట్లైన ఇవి ఒకే భాషలోనుండక భాషాభేదమునకు కారణమేమన్న తెలుపుచున్నారు-

**40. ఇతిల్ సంస్కృతమ్ ద్రావిడమెన్గిఱ పిరివు ఋగాదిభేదమ్పోలే.**
దీనియందు సంస్కృతము ద్రావిడమనెడి విభాగము ఋగ్వేదాదిభేదమువలెనే.

వ్యా - ఈ వేదమున సంస్కృతము ద్రావిడము అనెడి విభాగము సంస్కృతవేదమున ఋగ్యజుస్సా మాధర్వకములను భేదములవంటిదే. కావున ఈ వేదరాశియొక్కటియే ఐనను, సంస్కృతభాషలోనే ఋగ్వేదాదిరూపముగ అనేకవిభాగములు గల్గినట్లు భాషాభేదమునుబట్టియును సంస్కృతద్రావిడరూపముగ విభాగమును కలిగియుండవచ్చును.

అవ - సంస్కృతభాషవలెనే ద్రావిడభాష అనాదికాదుకదా. ఇది అగస్త్యునివలన ఏర్పడినదిగదా యనిన తెల్పుచున్నారు-

**41. శెన్దిఱత్తమిళ్ ఎన్టైయాలే ఆగస్త్యముమ్ అనాది.**

విలక్షణద్రవిడము అనుటచే ఆగస్త్యమును అనాది.

వ్యా - "భగవానుని యదార్థముగ తెలుపునట్టి ద్రావిడసంస్కృతవేదముల కలుగచేసి" అని తిరుమంగై యాళ్వార్లు సాదించినట్లు ద్రవిడసంస్కృతవేదములు రెండును అనాదియే. అగస్త్యుడు ప్రకాశింపచేసిన మాత్రమున ద్రావిడము, ఆగస్త్యమని చెప్పబడెనేగానిఅనాదిత్వము ప్రసిద్ధమే.

అవ - ద్రావిడభాష అనాదియైనచో తిరువాయ్మొళి వేదమని తెల్పుటఎట్లన్న ?చెప్పుచున్నారు-

**42. వడమొళి మఱైయెన్గతు తెన్మొళి మఱైయై నినైత్తిఱే.**

సంస్కృతవేదమనుట ద్రవిడవేదమును తలచియేకదా.

వ్యా - వేదమనుటయే చాలియుండ, నమ్మాళ్వార్లు సంస్కృతవేదమనుటద్రావిడవేదమొకటి కలదని తలచియే కదా! అట్టిది వేరొక్కటి లేనియెడల ఇట్లు విశేషించి చెప్పనవుసరములేదుగదా!

అవ - సంస్కృతవేదమునకు అంగోపాంగములున్నట్లు ద్రవిడవేదమునకు కూడా కలవాయన్న చెప్పుచున్నారు-

**43. వేదచతుష్టయ అఙ్గోపాఙ్గఙ్గళ్ పతినాలుమ్బోలే ఇన్నాలుక్కుమ్**

వేదములు నాల్గింటికి అంగోపాంగములు పదినాల్గువలె ఈ నాల్గింటికిని

**ఇరున్దమిళ్ నూల్పులవర్పనువలాఱుమ్ మత్తై యెణ్మర్ నన్మాలైకలుమ్.**

విస్తృతద్రవిడశాస్త్రపండితులశాస్త్రములారును మిగిలిన 8మంది విలక్షణప్రబంధములును.

వ్యా - ఋగ్యజుస్సామాధర్వణవేదములు నాల్గింటికిని శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు,

కల్పము జ్యోతిషము అని ఆరు అంగములై; మీమాంస న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము మొదలగు ఎనిమిది కలిసిమొత్తం 14అంగోపాంగములైనట్లుగా, నమ్మాళ్వార్లదివ్యప్రబంధములగు తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొழి లు నాలుగువేదములుకాగా, తిరుమంగైయాళ్వార్లు సాదించిన పెరియతిరుమొழி, తిరువెழుకూత్తిరుక్కై, తిరుక్కురున్దాణ్డకమ్, తిరునెడున్దాణ్డకమ్, శిరియతిరుమడల్, పెరియతిరుమడల్ అను ఆరును అంగములై, మిగిలిన ఎనిమిదిమంది ఆళ్వార్లు సాదించిన తక్కినప్రబంధములు ఉపాంగములని పేర్కొనబడుచున్నవి.

**అవ** - ఇతరవిద్యలకన్న వేదమునకు ఆధిక్యమున్నట్లు తిరువాయ్‌మొழி కి ఇతరదివ్యప్రబంధములకన్న ఆధిక్యముకలదాయనిన తెల్పుచున్నారు-

**44. సకలవిద్యాధిక వేదమ్పోలే ఇతువుమ్ దివ్యప్రబంధప్రధానమ్.**

సకలవిద్యాధిక్యమగు వేదమువలె ఇదియు దివ్యప్రబంధముల ప్రధానము.

**వ్యా** - అంగోపాంగములగు తక్కిన విద్యలన్నింటికన్నను వేదమునకు ప్రాధాన్యతయున్నట్లు దివ్యప్రబంధములన్నింటిలోనూ తిరువాయ్‌మొழிకి ప్రాధాన్యముకలదు.

**అవ** - వేదమునకు శాస్త్రమనియు, భగవదాజ్ఞారూపమనియు, దోషరహితమనియు, శ్రుతియనియు, సత్యమనియు, అనాదియనియు, నాశరహితమైనదనియు నిత్యాదులున్నట్లు తిరువాయ్‌మొழி కి కూడ కలవా యనిన తెలుపుచున్నారు-

**45. వేదనూల్ ఇరున్దమిழ்నూల్ ఆజ్ఞై ఆణై వశైయిల్ ఏతమిల్శురుతి**

వేదశాస్త్రము గొప్పద్రవిడశాస్త్రము ఆజ్ఞ ఆజ్ఞ నిర్దోషము దోషరహితశ్రుతి

**శెవిక్కినియ ఓతుకిన్ఱ తుణ్మై పొయ్యిల్పాడల్ పణ్డై నిఱ్కుమ్ మున్నై**

చెవికింపగు చెప్పుచున్న సత్యము అబద్ధములేనిపాటలు అనాది అంతములేని అనాది

**అழிవిల్లా ఎన్నుమ్ లక్షణఙ్గళొక్కుమ్.**

అంతములేని అన్నట్లు లక్షణములు సమము.

**వ్యా** - సంస్కృతవేదమును వేదశాస్త్రమనినట్లు ద్రావిడవేదమును గొప్పద్రావిడవేదశాస్త్రము అనుటచేతను, దానిని భగవదాజ్ఞగా చెప్పినట్లు దీనిని భగవదాజ్ఞారూపమగు ఆయిరమనుటచేతను, దానిని దోషరహితమన్నట్లు దీనిని దోషములేని వేయిపాశురములనుటచేతను, దానిని విని గ్రహింపదగినది అన్నట్లు దీనిని చెవికింపైనదనుటచేతను, దానిని సత్యమన్నట్లు దీనిని అసత్యములేనియు

నుటచేతను, దానిని అనాది అనంతము అన్నట్లు దీనిని అనాదియై నాశనములేనిదనుటచేతను, సంస్కృతద్రావిడవేదములు రెండును సమానలక్షణములు గలవిగ నుండును.

అవ - వేదమునకు కర్తలేకయుండ ద్రవిడవేదమునకు ఆళ్వార్లు కర్తలుగా చెప్పియుండుటచే దానివలె దీనికి నిత్యత్వాపౌరుషేయత్వములెట్లు సిద్ధించుననిన తెల్పుచున్నారు-

**46. "శొల్లప్పట్ట" ఎన్గతిల్ కర్తృత్వమ్ స్మృతియత్తై స్వయమ్భూపడైత్తాన్ ఎన్గతుపోలే.**

చెప్పబడిన అన్నదానిలో కర్తృత్వము స్మృతిని బ్రహ్మసృజించెను అన్నట్లు.

వ్యా - శఠకోపులు చెప్పినట్టి వేయిపాశురములు అనుతావున చెప్పబడిన కర్తృత్వము ఆద్యంతములులేని వేదవాక్కు బ్రహ్మముచే బయల్పఱచబడినదియని స్మృతివాక్యమున చెప్పబడిన కర్తృత్వమువంటిదే కావున ద్రవిడవేదమునకు అనిత్యత్వపౌరుషేయత్వములు సంభవింపవు.

అవ - వెనుకటివారివలెనే వీరును అనుచున్నారు-

**47. నాల్వేదమ్ కణ్డ పురాణఋషి మంత్రదర్శికళైప్పోలే ఇవరైయుమ్**

నాల్గువేదముల దర్శించిన వేదవ్యాసులు మంత్రద్రష్టలవలెను వీరినిన్ని

**ఋషి-ముని-కవి యెన్నుమ్.**

ఋషి-ముని-కవి యనిరి.

వ్యా - నాల్గువేదములను దర్శించిన పురాణఋషియగు వేదవ్యాసులవలెను మంత్రద్రష్టలగు శౌనకాదులవలెను నమ్మాళ్వార్లను ఋషి ముని కవి యని పేర్కొనియున్నారు.

అవ - మరియు ద్రవిడవేదము (తిరువాయ్మొళ్ళి) యొక్క అనాదిత్వమును సూచించు వేరొక హేతువును తెల్పుచున్నారు-

**48. "పడైత్తాన్ కవి" యెన్నపోతే ఇతువుమ్ యథాపూర్వ కల్పనమామే!**

సృజించినవాని కవి అన్నప్పుడే ఇదియు వెనుకయున్నట్లే సృజించినదగునే!

వ్యా - ప్రళయానంతరము జగత్తును సృజించునపుడు వెనుకనున్న క్రమమును తప్పక చతుర్ముఖుడు సూర్యచంద్రాదులను సృజించినట్లు ద్రావిడవేదమును(తిరువాయ్మొళ్ళియు) మునుపటివలెనే పరంపరగ వచ్చినది.

**అవ** - ద్రావిడవేదమగు తిరువాయ్మొళ్ళి భగవంతుని యనుగ్రహమువలన నమ్మాళ్వార్లకు సిద్ధించి ఆళ్వార్ల అనుగ్రహమువలన తరువాతివారెల్లరకును ఆధారభూతమై ఆళ్వార్లపేరున వ్యవహరింపబడుటను తెల్పుచున్నారు-

**49. ఉఱక్కమ్ తలైక్కొణ్డపిన్నై మఱైనాన్గుమ్ ఉణర్న్ద తన్దైళ్ అప్పనోడే**
యోగనిద్ర ముగించినవెనుక వేదములునాల్గును ధ్యానించిన తన తండ్రివద్ద
**ఓతిన శన్దచ్చతుముకన్ శలజ్జలన్ద వెణ్పురినూల్ మానురి**
చదివిన వేదపాఠి బ్రహ్మ గంగనీరుకూడిన (జడలు) తెల్లనిజందెము కృష్ణాజినముతో
**తిరితందు ఉణ్ణుమ్ కామనుడల్ ఇరుక్కిలజ్జ జ్యేష్ఠపుత్రాదికళుక్కు**
బిచ్చమెత్తి తినెడి మన్మథదేహము దహించిన రుద్రాదులకు
**మఱై పయంతాప్పోలే ఆతుమిల్కాలత్తు ఎన్దైయాన వాయ్ముతలప్పన్**
వేదము చదివించినట్లు ప్రళయకాలమున తండ్రియైన కృతికికారణుడు
**పిరమకురువాయ్ ఇరాప్పకల్ మున్శొల్ల కత్తనమేయెన్డయివరుం నావినాల్**
పరమగురువై రేయింబగళ్ళు ముందుచెప్ప నేర్చితిమనినవీరును (ఆళ్వార్లు) నాల్కచే
**నన్మైయాలెన్డు ఓతవల్ల పిరాక్కళై కన్మినన్గళెన్డు శొల్ప్పయిత్త**
ప్రీతిచేనని చదువగల ఉపకారుల (మధురకవుల) చదువుడని అభ్యసింపజేయ
**వేదమ్ ఓతువార్ ఓత్తాకైయాలే అధర్వణాదికళ్పోలే యితువుమ్ పేర్పెత్తతు.**
వేదము చదివినవారి చదువగుటచే అధర్వణాదులవలెనే ఇదియు పేరుపొందినది.

**వ్యా** - భగవంతుడగు నారాయణుడు యోగనిద్రనుంచి మేల్కొని తన సంకల్పముచే నాల్గు వేదములను ధ్యానించి తన పెద్దకుమారుడగు చతుర్ముఖబ్రహ్మకు ఉపదేశింప, అతడును తన జ్యేష్ఠ పుత్రుడైనట్టియు గంగాజలమును జడలయందు ధరించినట్టియు, తెల్లనియజ్ఞోపవీతమును కృష్ణాజినమును ధరించి, బిచ్చమెత్తుకొనితినునట్టియు, మన్మథుని దహింపజేసినవాడగు రుద్రునకును, మరికొంతమందికిని ఉపదేశించినట్లు; శ్రియఃపతి సంహారకాలముతరువాత ప్రథమగురువై దివారాత్రములు సంతలను జెప్ప ఆళ్వార్లు అధ్యయనమొనర్చి తమ పుత్రతుల్యులైన శిష్యులగు మధురకవులు, నాథమునులు మొదలగు వారికి అభ్యసింపజేసిరి.

సంస్కృతవేదము అభ్యసింపజేసినవారిపేర్లతో అధర్వణము తైత్తిరీయము కాణ్వమను పేర్లతో వ్యవహరింప బడినట్లు దివ్యప్రబంధమును ఆళ్వార్లప్రబంధమని ప్రసిద్ధిని పొందినది.

**అవ** - నమాళ్వార్లు సాదించిన నాల్గుప్రబంధములు వేదమునందలి యేయే స్థానముల ఉన్నవనిన తెల్పుచున్నారు-

**50. ఇయఱ్పామూన్ఱుమ్ వేదత్రయమ్పోలే పణ్ణార్పాడల్ పణ్పురైయిశైకొళ్ వేదమ్పోలే.**

ఇయఱ్పామూడును వేదత్రయమువలె రాగయుక్తతి.వాయ్ గానరసపూర్తికల సామవేదమువలె.

వ్యా - ఇయఱ్పాలోని తిరువిరుత్తము, తిరువాశిఱియము, పెరియతిరువన్దాది అను మూడు ప్రబంధములును క్రమముగ ఋగ్యజురథర్వణవేదస్థానీయములు. నాల్గవదగు తిరువాయ్మొழி ప్రబన్ధము సామవేదస్థానము.

అవ - ఋగ్వేదము సామమైనదనుమర్యాద దీనికిన్ని సరిపోవునాయనిన తెల్పుచున్నారు.

**51. ఋక్కు సామత్తాలే సరసమాయ్ స్తోభత్తాలే పరమ్పుమాపోలే శొల్లార్**

ఋగ్వేదము సామరసముచే రసావహమై స్తోభముచే విస్తరించినట్లు శబ్దపూర్తి

**తొడైయల్ ఇశైకూట్ట అమర్శువైయె యాయిరమాయిత్తు.**

మాలయై రాగకూర్పుచే రసపూర్ణమై వేయియైనది

వ్యా - ఋచస్సామరసః అన్నట్లు ఋగ్వేదము సామరసముచే రసయుక్తమై హావు హావు హావు అనెడి స్తోభముచే సామవేదముగ విస్తరించినట్లే, తిరువిరుత్తమును స్వరముతో రసయుక్తమై శబ్దార్థ పూర్తిగలిగి సామవేదసారమైన వేయి పాశురములు గల తిరువాయ్మొழிగ విస్తరించినది.

అవ - సామవేదము అనేకవిధములు కలదియగుటచే ఇది యేసామముతో తులతూగు ననుచున్నారు.

**52. శన్దోకనెన్ను సామన్యమాకామల్ ముతలిలే పిరిత్తు**

ఛందోగసాముడని సామాన్యముకాకుండ మొదటనే విభజించి

**యాழ்పయిల్ గానస్వరూపియై "పాలైయాకి" ఎన్ఱు విశేషిక్కైయాలే**

వీణపై నేర్వదగిన గానముగ భోగ్యుడై పాలవలెనై అని విశేషించుటచే

**వేతకీతచ్చామి నానెన్ను సామమ్ తోన్ఱ ఉద్గీథ ప్రణవత్తై ప్రథమత్తిలే**

వేదగానసాముము నేనని సామము తోచ ఉద్గీథ ప్రణవమును మొట్టమొదట

**మాఱాడి చరమగతి ముడివాక తొణ్డర్కు అముతెన్న దేవాన్నమాక్కి**

క్రమముతప్పించి అర్చిరాదిగతిని చివరగ భక్తులకు అమృతముగ దేవాన్నమొనర్చి

**మహాఘోష నల్ వేదవొలిపోలే మహాధ్యయనమెన్న పాడుకైయాలే**

గొప్పధ్వనిగల సామ వేదఘోషవలె గొప్ప అధ్యయనమని పాడుటచేత

**ఇతై ఛాందోగ్యసమమ్ ఎన్బర్ గళ్.**

దీనిని ఛాందోగ్యసమమని అందురు.

వ్యా - భగవానుని సామాన్య సామస్వరూపుడని గాక ఛందోగసామస్వరూపుడనియు వీణాగానము

వలె పాలవలె భోగ్యమై వేదానాం సామవేదోస్మి అన్నట్లు సామగాన స్వరూపుడని భగవానుడు ఆదరిం చిన దానితో సమమైనది ఈ తిరువాయ్ మొళ్ళి. ఉద్గీథసామముయొక్క సారమగు ఓంకారము నందలి అకార, ఉకార, మకారములను మార్చి తిరువాయ్‌మొళ్ళి లోని మొట్టమొదటిపాశురముయొక్క మూడుపాదముల మొదటి అక్షరములుగా ప్రయోగించుటలో ఉకార, అకార, మకారములతో ప్రారం భించుటచేతను, ఉద్గీథసామమునకు లక్ష్యభూతమగు "ఉత్" ను తిరువాయ్‌మొళ్ళి ప్రారంభమున ఉ తో మొదలిడి చివరిపాశుర చివరిపదమగు "ఉయర్ న్దే" లోని తే తో పూర్తిచేయుటచే ఉద్గీథసామసా రము తిరువాయ్‌మొళ్ళి యని తెల్పబడినది. అట్లే ఛాందోగ్యమున చెప్పబడిన అర్చిరాదియను చర మగతిని తిరువాయ్‌మొళ్ళి చివరన శూఴ్విశుమ్బనెడి దశకమున చెప్పుటచేతను భక్తామృతముగ నెన్నబడునట్లు దేవతలనబడు నిత్యముక్తులకు భోగ్యమగునట్లు గొప్పధ్వనిగ అధ్యయనోత్సవమున భక్తులు పరవశమగునట్లు అనుసంధించుటచే తిరువాయ్‌మొళ్ళిని సామవేదసమమనిరి.

అవ - వెనుకటివిషయమునే ఆప్తోపదేశపూర్వకముగ తెల్పుచున్నారు-

53. పురవియేழ் ఒరుకాలుడైయతేరిలే తిరుచ్చక్కరమొత్తు కాలశక్కరచ్చెజ్గోల్ నడావి
గుర్రములేడు ఏకచక్రరథమున చక్రముతో సాటియై కాలచక్రము ఆజ్ఞను నడిపి
జ్యోతిశ్చక్రవాళి శురుక్కి అగ్నిషోమీయ తేజోమృతత్తుక్కు ఊత్తమ్ మన్దేహర్కు
నక్షత్రాదులకాంతిని తగ్గించి అగ్నిచంద్రుల తేజోమృతమునకు ఊటయై మందేహాదులకు
చ్చన్దీయుమ్, ముక్తిమార్గత్తలైవాశలుమ్, కణ్ణావాన్ కణ్డిల్ పిఱన్ద కణ్మణియుమ్
వెలుగునిప్పును ముక్తిమార్గప్రధానద్వారమును సర్వేశ్వరుని కంటిన పుట్టిన జగచ్చక్షువై
త్రయీమయమమాన మణ్డలత్తిలే తణ్ణామరైశుమక్క తోళ్వళైయుమ్ కుழైయుమ్
వేదమయమగు సూర్యమండలమున చల్లనిపద్మమువహింప భుజకీర్తులున్ను కుండలములును
తిరుచ్చెయ్యముడియుమ్ ఆరముమ్ పడైయుమ్ తిక్ழుమ్ పొన్‌మేనియుమ్
అందమై యెర్రనికిరీటమును హారమును ఆయుధములును ప్రకాశించు బంగరుమేని యు
శెఝుడర్ త్తామరైక్కణ్ణుమాయ్, అణినిఱమూర్తి యీతెన్నుమ్బడి ఇరణ్డైయుమ్
ఎఱ్ఱగవెలుగు తామరనేత్రుడై సుందరతేజోమూర్తి ఇదియనునట్లు రెంటినిన్ని
తన్నిఱమాక్కుకిఱ శెయ్యాళానవిద్యయోడే అరుక్కన్‌మేవిన సదాధ్యేయతేజస్సిన్
తనవలె ప్రకాశింపించు ఎర్రనగులక్ష్మితో సూర్యాంతర్వర్తియగు సదాధ్యేయతేజోమయ
సామరసోద్గాననామమ్ ఉళ్ళుత్తైయాన ఆద్యంతజ్ఞళాలే ఓరాయిరమామవత్తిలే
సామవేదసారఉద్గీథనామము ఉత్ లోనసుండునట్లు మొదలుచివరలచేఒకటే వేయిముఖములైనవానిలో
ఒన్తై ఆయిరముకత్తినాలరుళిన తీర్థమ్బోలే తీర్థజ్గళాయిరముమాక విస్తరిక్కిఱారెఝ్
ఒకటే వేయివిధములుగాచేసిన తీర్థమువలె తీర్థములువేయిగ విస్తరింపజేసిరని

వేదగురూపదేశమ్.

వేదాచార్యభట్టర్ ఉపదేశము.

వ్యా - గాయత్రీ, బృహతీ, ఉష్ణిక్, జగతీ, త్రిష్టుప్, అనుష్టుప్, పఙ్క్తియనబడు ఏడు ఛందస్సులను ఏడు గుఱ్ఱములుగ లేక ఏడు ముఖములుగల గుఱ్ఱముగ (లేక ఏడుపేర్లుగల గుఱ్ఱముగ ) రథమున చక్రాయుధమువంటి కాలమను ఏకచక్రరథమున ఉభయవిభూతులయందును తనఆజ్ఞను జరిపించుచు జ్యోతిర్గణముయొక్క తేజస్సును సంకోచింపజేసి అగ్నియొక్క తేజస్సునకు చంద్రునియొక్క అమృతమునకును ఉత్పత్తిస్థానమై మందేహులనబడు రాక్షసులకు జ్వలించునగ్నియై ముక్తిమార్గమగు అర్చిరాదిగతికి తలవాకిటిద్వారమై సర్వేశ్వరుని నేత్రమునుండి పుట్టినట్టియు జగచ్చక్షువైనట్టియు వేదమయమగు సూర్యమండలమున చల్లని పద్మాసనమున గూర్చుని భుజకీర్తులును మకరకుండలములను తేజోమయసుందరకిరీటమును హారము దివ్యాయుధములును ప్రకాశించు బంగరు తిరుమేనును ఎఱ్ఱనితామరలవంటి కన్నులుకలిగిన సర్వేశ్వరున్ని సూర్యమండలమునున్ను రెంటినిన్ని తనకాంతిచే ఎఱ్ఱగచేయునట్టి విద్యయనబడు లక్ష్మి పిరాట్టితోగూడి సూర్యమండలమధ్యవర్తియై సదా ధ్యేయమగు సర్వేశ్వరుని తెలియబఱచు సామవేదసారమగు ఉద్గీథయందలి 'ఉత్' అను భగవానుని నామమును వేయివిధముల ప్రవహించు గంగానదివలె పవిత్రమగు వేయిపాశురములుగ విస్తరింపజేసినతిరువాయ్మొఴియందు ఆద్యంతముల; అనగా 'ఉయర్వఱ' లోని ఉ తో ప్రారంభించి 'ఉయర్న్దే' లోని త్ తో పూర్తిచేసిరని ఆప్తతములగు వేదాచార్యభట్టరువారి ఉపదేశము.

అవ - నమ్మాళ్వార్ల నాల్గుప్రబంధములకును వేదసామ్యమును సాధించి, ఇకపై వేదోపబృంహణసామ్యమును తెల్పుచున్నారు-

**54. అన్ఱిక్కే స్వరూపరూపగుణవిభూతిచేష్టితజ్ఞళై విశదమాక్కుకిఱ పఞ్చరాత్ర**

అంతేగాక స్వరూపరూపగుణవిభూతిచేష్టితములను విశదమొనర్చెడి పాఞ్చరాత్ర

**పురాణేతిహాసజ్ఞళ్పోలే నీలభారూపోక్తి తెరియచ్చొన్న వేదోపబృంహణమెన్బర్కళ్.**

పురాణేతిహాసములవలె నీలవర్ణజ్యోతిరూపవివరణమును తెలుప వేదవివరణమందురు.

వ్యా - భగవంతునియొక్క దివ్యాత్మస్వరూపమును, కల్యాణగుణములను, ఉభయవిభూతులను, అవతారచేష్టితములను స్పష్టముగా తెలియపఱచిన పాఞ్చరాత్ర పురాణేతిహాసములవలెనే ఆళ్వార్ల దివ్యప్రబంధములును తెల్పియుండుటచేత ఇవి వేదోపబృంహణసమములనియు తెల్పుదురు.

అవ- ఆళ్వార్లదివ్యప్రబంధములకుగల అధిక్యత ఋషిప్రణీతగ్రంథములకు లేదనుటకై

రెంటి యొక్కయు ఉత్పత్తికారణములు తెల్పదలచి మొదటిగ ఋషిప్రోక్తముల ఉత్పత్తి కారణములను తెల్పుచున్నారు-

**55. కల్పాదియిల్ తోత్తిత్తు వర్ధిక్కుమ్ చతుర్ముఖన్ ఛన్దస్సుమ్ మోహశాస్త్రప్రవర్తకన్**
కల్పాదిన తోచినది వర్ధించు చతుర్ముఖుని సంకల్పమున్ను తామసశాస్త్రప్రవర్తకుడును
**పిణచ్చుడలై వెన్దార్ ఆక్కుమ్ ఆఱుమ్ అణిన్దు ఏఱేఱి శుఱ్ఱన్దు ఆడుమ్**
శవభస్మమును ఎముకలు పులితోలు నదిని ధరించి ఎద్దునెక్కి తిరుగుచు ఆడెడి
**ఆలమమర్ పిచ్చుత్తెళిన్దు తాన్ వణఙ్గుమాఱు ఉరైక్క కేట్ట సజాతీయర్**
విషధరుడు భ్రమతొలగి తను ఉపాసించురీతిని చెప్పగావినిన పులస్త్యాదుల
**ప్రసాదముమ్ ఆర్షమూలమ్.**
అనుగ్రహము ఋషులకు కారణము.

**వ్యా** - కల్పాదిన సత్త్వరజస్తమోగుణవశ్యుడైన చతుర్ముఖుడు అప్పటికప్పటికేర్పడిన గుణమునకు తగియున్నట్లు కల్గినతలంపుచే చెప్పబడినవియు, మోహనశాస్త్రమును తామసపురుషుల మోహింపచేయుటకై లోకమున ప్రవర్తింపజేయుమని భగవానుడాదేశింపగా, వానియాజ్ఞానుగుణముగ తామసమోహనార్థము మోహనశాస్త్రములను ప్రవర్తింపజేయుచు భస్మధారియై ఎముకలను పులితోలును ధరించి గంగానదిని తలపై ధరించి ఎద్దునెక్కి తిరుగుచు నృత్యమొనర్చుచు కంఠమున భగవదాజ్ఞానుగుణముగ విషమును ధరించినవాడగు రుద్రుడు తానే సర్వేశ్వరుడననే భ్రమతొలిగి, తాను ఉపాసించుపద్ధతిని సజాతీయులగు అగస్త్యపులస్త్యదక్షమార్కండేయులు నల్గురకునుపదేశింపగా వారలలో నొకడగు పులస్త్యుడు పరాశరమహర్షి అనుగ్రహముచే వరమునొంది పురాణసంహితలను రచించుటయు, రచింపజేయుటయు చేసినవాడగుటచే వానియనుగ్రహమువలన ఋషిప్రోక్తములగు గ్రంథములేర్పడినవి.

**అవ** - ఆళ్వారుల దివ్యప్రబంధములకు మూలమేదనిన తెల్పుచున్నారు-

**56. పరమసత్త్వత్తోడే ఉళ్ళియురైక్కుమ్ నిఱైఞానత్తయనామ్ శివనామ్**
శుద్ధసత్త్వముతో యోచించిచెప్పిన జ్ఞానపూర్తిగల్గిబ్రహ్మకు శివునకంతర్యామియగు
**తిరుమాలరుళ్కొణ్డు ఇవర్ పాడినార్.**
శ్రియఃపతిదయచే వీరు గానమొనర్చిరి.

**వ్యా** - శుద్ధసత్త్వముతో వేదమార్గమును తప్పక జ్ఞానపూర్తిగలవాడై, బ్రహ్మరుద్రులకు అంతర్యామి అగు శ్రియఃపతి అనుగ్రహముచే ఆళ్వార్లు దివ్యప్రబంధములు అనుగ్రహించిరి.

**అవ** - బ్రహ్మరుద్రులయనుగ్రహము ఋషిప్రోక్తములగు గ్రంథములకు కారణమని గ్రంథకర్తలగు మహర్షులవాక్యములచే తెల్సినట్లు, ఆళ్వార్లప్రబంధములకు మూలము భగవదనుగ్రహమనువిషయము ఆళ్వార్లశ్రీసూక్తులచే తెలియవచ్చుచున్నదా? యన్నచో తెల్పుచున్నారు-

**57.** **కరువుళ్ వేఱిలామై అరనయనెన చ్చెయ్యుమవైపోలే మూవురువాముతల్వన్**
అంతర్యామిగ వేరుగాక బ్రహ్మరుద్రులు చేసినారనుప్రసిద్ధివలె మున్మూర్తులకు కారణుడై
**తుప్పరవాలే పరమకవికళాయ్ పాడువియాతు నేర్పడచ్చొల్లుమ్ నీర్మైయిలా**
సామర్థ్యముచే గొప్పకవులచే పాడించుకొనక తగినట్లుచెప్పుటకు యోగ్యతలేని
**ఎన్నై త్తన్నాక్కి ఎన్ నాముతల్వన్దుపుకున్దు తప్పుతలఱ త్తన్నై వైకున్దనాక**
నన్ను తనవలెచేసి నా నాల్కమొదటవచ్చిచేరి దోషములేనట్లు తనను వైకుంఠునిగ
**త్తన్శొల్లాల్ తానే తుతిత్తు మలక్కు నావియిల్ మొయ్యశొల్లాల్**
తనవాక్కుచే తానే స్తుతించుకొని మోహింపించు నాల్కచే యధార్థవాక్కులచే
**శొల్లవల్లే నెన్ఱు నానుమ్శొల్లి నాడుమ్ కైయెడుక్కుమ్పడి ఎన్శొల్లాల్ యాన్శొన్న**
చెప్పశక్తుడనని నేనేచెప్పి లోకులును నమస్కరించునట్లు నామాటలచే నేనుచెప్పిన
**ఇన్కవి యెన్పిత్తాన్ ఎన్గారిఱే!**
భోగ్య కవనము అనబడెను అనిరిగదా!

**వ్యా** - బ్రహ్మరుద్రాదులకంతరాత్మగానుండి సృష్టిసంహారములనొనర్చుచున్నను, జగత్సృష్టి వేదోపదేశము జగత్సంహారము త్రిపురదహనము వీటిని బ్రహ్మరుద్రాదులు స్వయముగ చేసినారని లోకులు చెప్పుకొనునట్లు ప్రసిద్ధిపఱచువాడు, తన అఘటితఘటనాసామర్థ్యమువలన గొప్పకవులగు వ్యాస పరాశరవాల్మీకి మొదలగు కవులచేగానీ, ముదలియాళ్వార్లు మొదలగు ఆళ్వార్లచేగానీ కవిత్వము చెప్పించుకొనక తనకు తగినట్లు కవిత్వముచెప్పసమర్థుడనుకాని నన్ను సాధనముగా చేసుకొని తనకున్న జ్ఞానశక్త్యాదులుకలవానిగాచేసి నాలో ప్రవేశించి నన్ను స్పృశించుటచేత నాదోషములెవ్వియును తనకు అంటకుండ, నేను స్తుతించుటచే తాను వైకుంఠనాథుడై అచ్చటి సంపదలను లభించినవానినిగ దలచి నా నాల్కపై నుండి తనను తానే స్తుతించుకొని, నేను చెప్పిన మధురమగు కవిత్వమని లోకమున ప్రసిద్ధిపఱచినాడని తెల్పుటచే సర్వేశ్వరుని అనుగ్రహమువల్ల వీరు తిరువాయ్మొళ్ని కృపచేసినారని ప్రసిద్ధమగుచున్నది.

**అవ** - గ్రంథవైలక్షణ్యమేగాక వక్తృవైలక్షణ్యమునుబట్టియు ఋషులకంటె ఆళ్వారుల భేదమును తెల్పుచున్నారు-

**58. ధర్మవీర్యజ్ఞానత్తాలే తెళిన్దు హృష్టరాయ్ మేలేమేలే తొడుప్పారైప్పోలన్డ్రే అరుళిన**
తపోబలజ్ఞానముచే తెలిసి సంతుష్టులై పైపైగా కవనము చెప్పువారివలెగాక కృపజేసిన
**భక్తియాలే ఉళ్‌కలజ్గీ శోకిత్తు ముప్పాఱుమాసమ్ మోహిత్తు వరున్ది యేజ్గి**
భక్తిచేత మనసుకలతపడి దు:ఖించి మూడుఆరునెలలు మూర్ఛనొంది శ్రమించి దు:ఖించి
**తాఴ్‌న్దశొల్‌కళాలే నూత్కిఱ విచర్.**
గద్గదస్వరముతో చెప్పిన వీరు.

వ్యా - మహర్షులు తామాచరించిన తపోబలముచే గల్గినజ్ఞానముచే కవిత్వము చెప్పిరి. కాని ఆళ్వారులట్లుగాక భగవదనుగ్రహముచేలభించిన అజ్ఞానరహితభక్తిరూపాపన్నజ్ఞానముగలవారై భగవద్విశ్లేష దు:ఖముచే హృదయమెల్ల శిథిలమై అతని చేష్టలనెల్లదలచి మూడుపర్యాయములు ఆరేసి నెలల చొప్పున మూర్ఛిల్లి గద్గదస్వరముగల శబ్దములతో ప్రబంధములను రచించిరి.

అవ- విషయాంతరవైరాగ్యమునుబట్టియు ఆళ్వార్లు ఋషులకన్న అధికులనుచున్నారు-

**59. స్వాధ్యాయ యోగజ్గళై క్కత్తుమ్ తెళిన్దుమ్ కణ్ణమెయ్‌మైప్పాలే ఓతియుణర్‌న్ద**
వేదాధ్యయన అష్టాంగయోగముల నేర్చియు తెలిసియు అవైశద్యముచేత వేదాధ్యయన పరులగు
**అవర్ ఇన్నుమ్ ఆశాపాశబద్ధర్ అవన్ వ్యఙ్గుమ్ దివ్యచక్షుస్సాలే నేరే కార్‌శెఱిన్ద**
ఋషులు ఇంకను ఆశాపాశబద్ధులు వాడు కృపజేసిన దివ్యనేత్రములచే బ్రహ్మకు కాలకంఠుడగు
**నీఱాడి కట్కరియ అరుమ్బొరుళై క్కణ్డపోతే "యామునాయై"ఎన్నుమ్బడి ఇవర్కు**
గంగాధరునకు చూడరాని దుర్లభవస్తువు చూచినప్పుడే మేముపొందకుండ అన్నట్లు వీరికి
**వన్ పాశజ్గళ్ నీజ్గిత్తు.**
ప్రబలపాశములు విడిచినవి.

వ్యా - సాంగోపాంగముగ వేదాధ్యయనమొనర్చియు యమనియమాద్యనుష్ఠానరూపమైన యోగము నభ్యసించియు వీనిచే తెలియవచ్చు పరమాత్మను ఇట్టివాడని తెల్సుకొని, స్వయత్నమూలముగ వానిజూడయత్నింపదలచి నప్పుడు స్పష్టముగ తెలియరానందున శాస్త్రాభ్యాసమొనర్చి త్యాజ్యోపాదేయ జ్ఞాన మెఱిగిన మహర్షులును నింతవరకు సాంసారికభోగవిషయమున ఆశలనెడి అనేకములైన త్రాళ్ళచేబంధింపబడియుండిరి. కానీ ఆళ్వార్లట్లుగాక సర్వేశ్వరుడిచ్చిన దివ్యజ్ఞానముచే బ్రహ్మరుద్రాదులకును తెలియ సాధ్యపడని వేదతాత్పర్యమగు సర్వేశ్వరుని వాని నిర్హేతుకానుగ్రహముచే దర్శించి అవిద్యాదులబోగొట్టుమని శరణాగతియొనర్చినవీరికి ప్రబలమగు బాహ్యసంబంధములు సవాసనగ వీడినవి.

అవ- ధారకాదులనుబట్టియు, ఋషులకన్న ఆళ్వారుల వైలక్షణ్యమును తెల్పుచున్నారు-

**60. అవర్కళుక్కు కాయోడెన్నుమవైయే ధారకాదికళ్, ఇవర్కెల్లామ్ కణ్ణనిఱే.**

వారికి ఫలమూలాదులనబడునవే ధారకాదులు, వీరికన్నియు కృష్ణుడేకదా!

వ్యా- ఋషులకు ఫలమూలపత్రవాయు ఉదకములే ధారకపోషకభోగ్యములుకాగా, ఆళ్వార్లకు తినెడి యన్నమును త్రాగెడినీరును అనుభవించెడి భోగ్యపదార్థములగు చందనకుసుమతాంబూలాదులు అన్నియును భగవానుడే.

అవ - సంబంధులనుబట్టియు ఋషులకన్న ఆళ్వార్ల వైలక్షణ్యమును తెల్పుచున్నారు-

**61. ఱ్ఱునీర్ తుళుమ్బక్కడలుమ్ మలైయుమే విశుమ్బుమ్ తుఝాయ్ తిరుమాలెజ్ఞు**

కన్నీరు కార్చుచు సంద్రమున గిరులందు మిన్నునను వెదికి శ్రియఃపతియని

**ఎజ్ఞే కాణ్ణేన్ ఎన్నుమివర్ అలమాప్పు అవర్ కళుక్కు పుత్రవియోగత్తిలే.**

ఎచ్చట చూతును అని వీరి తల్లడపాటు వారలకు పుత్రవియోగమున.

వ్యా - శ్రీనమ్మాళ్వార్లు భగవంతునియందలి అభినివేశముచే ప్రాకృతవిషయవ్యామోహము వీడి వాని యనుభవము లేనందున కష్టపడినదంతయు ఋషులు ప్రాకృతవిషయసంబంధము విడువక పోవుటచే నవి లభియనయున దుఃఖించిరి. వశిష్ఠమహర్షి పుత్రవియోగముచే పర్వతాగ్రమునుండి పడుటయు అగ్నిలోప్రవేశించుటయు మెడలో రాతిని కట్టుకొని సముద్రములో పడుటయు నొనర్చెను. అట్లే వ్యాసులును పుత్రశోకముచే హా పుత్రా హా శుకాయని దు:ఖించెను.

అవ- ఇంకను ఫలసాధనాదుల విషయమునను ఋషులకన్న ఆళ్వార్లకుగల వైలక్షణ్యమును తెల్పుచున్నారు.

**62. ఫలసాధనదేవతాంతరఙ్గళిల్ ఇవర్కళ్ నినైవు పేచ్చిలే తోన్డుమ్.**

ఫలసాధనదేవతాంతరములందును వీరల తలంపు మాటలలో తెలియును.

వ్యా- ఋషులు ఫలవిషయమునను, ఫలసాధనవిషయమునను దేవతాంతరములనాశ్రయించిరి. ఆళ్వార్లకు అట్లుగాక ఫలమనబడు ఉపేయమును, సాధనమనబడు ఉపాయమును, భగవానుడే. ఈ విషయము వారి వారి మాటలవలననే తెలియవచ్చుచున్నది.

అవ - ధర్మవీర్యజ్ఞానత్తాలే అను 58వ సూత్రముమొదలు ఇంతవరకును 5సూత్రముల చేత ఋషులకన్న ఆళ్వార్ల వైలక్షణ్యమును తెల్పి ఇకపై ప్రబంధవైలక్షణ్యమును

తెల్పుచున్నారు.

**63. రామాయణమ్ నారాయణకథైయెన్ఱు తొడఙ్గి గఙ్గాగాఙ్గేయసమ్భవాది అసత్కీర్తనమ్**
రామాయణమనియు నారాయణకథయనియు మొదలిడి గంగాగాంగేయసంభవాది అసత్కీర్తనము
**పణ్ణిన ఎచ్చిల్‌వాయ్ శుద్ధిపణ్ణామల్ "తిరుమాలవన్‌కవి" ఎన్ఱ వాయోలైప్పడియే**
చేసిన ఎంగిలినోరు శుద్ధిచేసుకొనక శ్రియఃపతియొక్కకవి అనిన ప్రతిజ్ఞరీతిగ
**మాత్తఙ్గళాయ్‌న్దుకొణ్డ ఉరియశొల్‌వాయిత్త ఇతు వేదాదికళిల్ పౌరుష-**
మాటలనుతెలిసిప్రయోగించి తగినశబ్దకూర్పుగల ఇది వేదాదులలో పురుషసూక్త-
**మానవ- గీతా- వైష్ణవఙ్గళ్‌పోలే అరుళిచ్చెయలిల్ సారమ్.**
మనుధర్మశాస్త్ర-గీత- విష్ణుపురాణములవలె దివ్యప్రబంధములలో సారము.

**వ్యా** - శ్రీరామచంద్రుని చరితమును చెప్పుటకై శ్రీరామాయణమును ప్రారంభించి గంగోత్పత్తిని సుబ్రహ్మణ్యోత్పత్తిని పుష్పకవర్ణనము మొదలగునవి ఎక్కువగా చెప్పుటచేత వాల్మీకియొక్కయు **నారా**యణకథను తెల్పెదనని ప్రారంభించి భీష్మాదులజన్మలను యుద్ధపత్రికయాయన్నట్లు వ్యాస మహర్షియు చెప్పియుండుటచే వారలవాక్కు అసత్కీర్తనముచేయు ఎంగిలినోళ్ళుగలవారై భగవ త్కీర్తనలచే శుద్ధిచేసికొనవలసివచ్చెను. ఆళ్వారులట్లుగాక శ్రియఃపతి విషయమగు కవిత్వమును అన్యపరములుకానట్టియు సర్వేశ్వరునికే తగినట్టియు శబ్దజాలముతో చెప్పియుండుటచే వారివాక్కు పరిశుద్ధమైనది.

అట్టి పరిశుద్ధమగు వాక్కుతో చెప్పబడిన తిరువాయ్‌మొழி వేదమునందు పురుషసూక్తము వలెను ధర్మశాస్త్రములలో మనుధర్మశాస్త్రమువలెను భారతమునందు భగవద్గీతవలెను పురాణము లలో విష్ణుపురాణమువలెను దివ్యప్రబంధములలో సారతమమైయున్నది.

**అవ** - దివ్యప్రబంధములలో సారభూతమగు తిరువాయ్‌మొழி ప్రామాణ్యాతిశయమును తెల్పుటకై ఆళ్వార్ల ఐకకంఠ్యమును వారిలో ప్రధానులగు నమ్మాళ్వార్లతిరువాయ్ మొழிలో విరోధించు శాస్త్రములాదరణీయములు కావని తెల్పుచున్నారు.

**64. గురుశిష్యగ్రంథవిరోధఙ్గళై పరమతాదికళాలే పరిహరియ్యామల్ "శెఙ్గోల్‌శెన్దమిழ்**
గురుశిష్యగ్రంథవిరోధములను పరమతాదులచే పరిహరింపనక్కఱలేక శెంతమిழ்
**ఇన్‌కవి" "పరవియఱ్ఱైక్కుమ్" ఎన్ఱు అన్యోన్యమ్ కొణ్డాడి పేశిత్తేపేశుమ్ ఏకకంఠరిల్**
ఇన్‌కవి పరవియఱ్ఱైక్కుం అని ఒకదానినొకటి కొనియాడి చెప్పినదేచెప్పునట్టి ఒకేమాటగలవారిలో
**ఎన్నైల్‌మికు ఎన్ఱుమ్ ఇవరురైకొళిన్‌మొழி కొణ్డు శాస్త్రార్థఙ్గళ్ నిర్ణయిక్కవేణ్డుకైయాలే**
ఎన్నైల్ మికు అని వారుచెప్పినతివాయ్‌మొழிద్వారా శాస్త్రార్థముల నిర్ణయింపవలసియుండుటచే

**వలఙ్గొణ్డఇతుక్కు చ్చేరాతవై మను విపరీతఙ్గళ్‌పోలే.**

చెప్పసమర్థతగలదీనికిచేరనివి మనుస్మృతికి విరోధించువానివంటివి.

వ్యా- ఋషులలో గురుశిష్యులగు వ్యాసజైమినులలో వ్యాసులు బ్రహ్మసూత్రములు వ్రాయగా జైమిని కర్మసూత్రములు వ్రాయుటచే విరుద్ధముగ కన్పించెడిదానిని పరిహరించుటకుగా వేదము ప్రమాణము కాదనెడివారికి కర్మావస్యతను తెల్పుటకుగా పరమతము నవలంబించి చేసినదని సమర్థింపవలసియున్నది. అట్లుగాక " అందమగు కవిత్వము చెప్పువారలారా " అనియు, " అందమగు ద్రవిడమున కవనము చెప్పువారలారా " అనియు, " ఇంపగు కవులారా " అనియు, " శ్రీరంగనాధా అని పిలుచు దాసులు " అనియు, పరస్పరము శ్లాఘించుకొని ఒకరు చెప్పినదే యెల్లరును చెప్పనట్టి ఐకకంఠ్యముగల ఆళ్వార్లలో నమ్మాళ్వార్లు సాధించిన తిరువాయ్‌మొళ్ళి వలననే శ్రీరామాయణాదులయొక్కయు శాస్త్రార్థములలోని సంశయగ్రస్తములగు అర్థములను నిర్ణయింపవలసియున్నందున "ప్రతిపాదనసామర్థ్యము గల" తిరువాయ్‌మొళ్ళిలో అనుకూలింపని శాస్త్రములను మనుధర్మశాస్త్రములతో అనుకూలింపని స్మృతులనువలెనే నిషేధింపనగును.

అవ- తిరువాయ్‌మొళ్ళి ఆధారముగ శాస్త్రార్థముల నిర్ణయించినవారెవరనిన తెల్పుచున్నారు-

**65. భాష్యకారర్ ఇతుకొణ్డు సూత్రవాక్యఙ్గళ్ ఒరుఙ్గవిడువర్.**

శ్రీభాష్యకారులు దీనిగొని బ్రహ్మసూత్రవాక్యముల సమన్వయపఱచిరి.

వ్యా - భగవద్రామానుజులు శ్రీభాష్యగ్రంథమును రచించునపుడు సూత్రవాక్యములలోని సందిగ్ధార్థములనన్నింటిని తిరువాయ్‌మొళ్ళిలోని శ్రీసూక్తులనాధారముగ చేసుకొనియే నిర్ణయించి ఐకకంఠ్యము కలుగజేసినవారైరి.

అవ- శ్రీభాష్యకారులట్లొనర్చుటకు కారణమేమి యనుచున్నారు-

**66. అతుక్కుమూలమ్ "విధయశ్చ" ఎన్గిఱ పరమాచార్యవచనమ్.**

దానికిమూలము విధయశ్చ అనెడి పరమాచార్యులవచనము.

వ్యా- స్తోత్రరత్నమగు ఆళవన్దార్ల స్తోత్రమున పరమాచార్యులగు శ్రీయామునాచార్యులవారు "విధయశ్చ వైదికా: త్వదీయగమ్భీరమనోనుసారిణ:" [నీయొక్క శాస్త్రవిధులు నీ దాసుల మనస్సుననుస

రించి ఉండునవి] అని సాధించుటచేత ఆళ్వార్లవంటివారితలంపును శాస్త్రములననుసరించి ఉండు నవెడి భావనచే భాష్యకారులు బ్రహ్మసూత్రములలోని సందిగ్ధములను తిరువాయ్మొళ్ళి దివ్యప్ర బంధప్రమాణముల గొనియే పరిహరించిరి.

**అవ** - వేదమువలె స్వత: ప్రమాణమై ఆప్తతమమగు తిరువాయ్మొళ్ళియందు వేరే కొందరను ప్రమాణముగా చెప్పియుండుటకు కారణమేమియన తెల్పుచున్నారు-

**67. ఆప్తిక్కు ఇవర్ శురుతి మార్కణ్డేయన్ పార్థన్ ఎన్గిఱ ఇవై వ్యాస-మను-**
ఆప్తికి వీరు శ్రుతి మార్కండేయుడు పార్థుడు అనెడి ఇవి వ్యాస-మను-
**బ్రహ్మవాదికళై వేదమ్ శొల్లుమాప్పోలే.**
బ్రహ్మవాదులును వేదము చెప్పినట్లు.

**వ్యా** - ఆప్తత్వమునకు తగినట్లు ఆళ్వార్లు తిరువాయ్మొళ్ళియందు "ఉళన్శుడర్మికు శురుతి యుళ్" [కలదు కాంతివంతమగు శ్రుతులయందు] అనియు, "మార్కణ్డేయనుమ్ కరియే" [మార్కణ్డే యుడున్ను సాక్షియే] అనియు, "పార్తన్ తెళిన్దొళ్ళిన్ద" [అర్జనుడు తెల్పుకొనిన] అనియు తెల్పుట పర మాప్తమగు వేదము "బ్రహ్మవాదినో వదన్తి" [బ్రహ్మవాదులు చెప్పుచున్నారు] అనియు విశ్వాసము నకై వ్యాసునిన్ని మనువునున్ను బ్రహ్మవాదులనున్ను పేర్కొనినట్లు అని తెలియనగును.

**అవ** - తిరువాయ్మొళ్ళిని ఉపబృంహణముతో సమముగగొనుచో నిది వేదమునకు వ్యాఖ్యయగునేగాని వేదమెట్లగునన తెల్పుచున్నారు-

**68. భారత-గీతైకళిన్ వేదోపనిషత్త్వమ్పోలే ఇతువుమ్ వ్యాఖ్యేయానాలుమ్**
భారత-భగవద్గీతల వేదోపనిషత్త్వమువలె ఇదియు ఉపబృంహణమేయైనను
**వేదరహస్యమామ్.**
ఉపనిషత్తగును.

**వ్యా** - భారతమునకును భగవద్గీతకును వేదత్వ ఉపనిషత్త్వములెట్లు సిద్ధించెనో అట్లే తిరువాయ్మొళ్ళికిని వేదత్వము వేదరహస్యమగు ఉపనిషత్త్వము సిద్ధించుటలో అభ్యంతరములేదు.

**అవ**- సంస్కృతవేదమునకు దాని ఉపబృంహణములకువలెనే తిరువాయ్మొళ్ళికిని అలంకారాదులు కలవని తెల్పుచున్నారు-

**69. ఉదాత్తాది పదక్రమజటావాక్యపంచాది పాదవృత్తప్రశ్నకాండాష్టకాధ్యాయాంశ**
ఉదాత్తాదుల పద క్రమ జటావాక్య పంచాదులును పాదవృత్తప్రశ్నకాండఅష్టకఅధ్యాయఅంశ
**పర్వాది అలఙ్కారంగళ్‌పోలే ఎழுత్తు అశై శీర్ పన్దమ్ అడి**
పర్వాది అలంకారములవలె అక్షరము అవ్యయము గణము బంధము పాదము
**తొడై నిరైనిరై ఓశై తళైఇనమ్ యాప్పు పా తుఱై ప్పణ్ ఇశై**
సందర్భము నిరైనిరై శబ్దము తళైఇనమ్ యాప్పు ఛందస్సు తుఱై రాగము స్వరము
**తాళమ్ పత్తు నూఱు ఆయిరమ్ ముతలాన శెయ్‌కోలమ్ ఇతుక్కుముణ్డు.**
తాళము పత్తు నూఱు వేయి మొదలగు అలంకారములు దీనికినికలవు.

వ్యా - వేదమునకు ఉదాత్త అనుదాత్తస్వరితస్వరములును పదము క్రమముజటవాక్యపంచాదులును పాదము వృత్తము ప్రశ్న కాండము అష్టకములవలెను వేదోపబ్రృంహణములకు అధ్యాయము అంశము పర్వములవలె దివ్యప్రబంధములకును ఎழுత్తు కుత్తెழுత్తు మల్లెழுత్తు మొదలగు పేర్లుగల ద్విత్వాక్షరములు పరుషాక్షరములు సరళాక్షరములు 13 విధములగు అక్షరములగు నేరశై నీరై యశై అనబడు రెండువిధములగు అవ్యయములును, ముప్పదివిధములగుశీర్ అనబడు గణములును, పన్దం అనబడు గణములలోని కూర్పువిశేషములును, కురళడి శిన్దడి మొదలగు 5అడులును తొడై అనబడు 43సందర్భములును, పేర్‌నిరైనిరై విననిరైనిరై మొదలగు నిరైనిరైలును, శెప్పలోశై అగవలోశై మొదలగు ఓశలు నాల్గును, నేరొన్తాశిరియ త్తళై నిఱై యొన్తాశిరియ త్తళై మొదలగు 7తళలును, తాழிశై తుఱై విరుత్తమ్ అనబడు పాక్కుల యినములు మూడును, యాప్పనగా ప్రబంధరూపముగానుండుట, వెణ్బా ఆశరియప్పా మొదలగు పాక్కు (ఛందస్సు)లును తుఱైయనునది ఇనయొక్క విధములలో నొక్కటిగాన పునరుక్తమగును. ముతిర్‌న్దకురిఞ్జి నట్టభాష నట్టరాగము శెంది రి పియం తైందళు మొదలగు పణ్ణనబడు రాగములును, కురళ్‌తుత్తమ్ కైక్కిళై ఉழైయిని విళరితాళమ్ అను పేర్లతో పిలువబడు నిషాద ఋషభ గాంధార షడ్జ మధ్యమ దైవత పంచమములనబడు ఇశ (రాగము)లును, గజకర్ణము చోరగతి మకరధ్వజము తారకము లక్ష్మి కీర్తి మొదలగు తాళములును అంశ పర్వాది భాగములలో అవాంతర విభాగములగు అధ్యాయములవలెనే నూరుపాశురముల అవాంతరవిభాగములగు పత్తులు(పదులు)ను, నూరనబడు ప్రధాన విభాగములును ఆయిరమనబడు వేయిపాశురములును మొదలగు అలంకారములు గలవు.

**అవ-** దివ్యప్రబంధము వేదముయొక్క అవతారవిశేషమై ఆళ్వారులచే ప్రసిద్ధమైనదని తెల్పుచున్నారు-

**70. అథవా వేదవేద్యన్యాయత్తాలే పరత్వపర ముతువేదమ్ వ్యూహ వ్యాప్తి**
**అట్లుగాక వేదవేద్యశ్లోకన్యాయముచేత పరత్వపరమగు అనాదివేదము వ్యూహ అంతర్యామి**

**అవతరణఙ్గళిల్ ఓతిననీతి కేట్ట మను పడు కత్తైకళాయ్ ఆక మూర్తియిల్**
అవతారములందు పాఞ్చరాత్రముగ వినిన మన్వాది స్మృతిగ ఇతిహాసములుగ అర్చావతారమందు
**పణ్డియ తమిఙ్గానవాతే వేదత్తై ద్రావిడమాక చ్చెయ్తారెన్నుమ్.**
చెప్పిన ద్రవిడముకాగానే వేదమును ద్రావిడముగ చేసిరనిరి.

వ్యా - తిరువాయ్మొళ్లి దివ్యప్రబన్ధము ఇంతకుముందు చెప్పినట్లు రెండు విధములును కాకుండ "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే" అను శ్లోకమునచెప్పినట్లు వేదములవలన తెలియదగిన పరమపురుషుడు దశరథపుత్రుడుగా అవతరించగా, అపౌరుషేయమగు వేదమును శ్రీవాల్మీకిమహర్షి ద్వారా శ్రీరామాయణముగ అవతరించెను, అన్నవిధముగా పరబ్రహ్మముయొక్క పరస్వరూపమును వర్ణించుటయే లక్ష్యముగాగల అనాదియగు వేదము సృష్టిస్థితిసంహారములనిర్వహించుటకై వ్యూహావస్థయందున్న సర్వేశ్వరుని తెల్పుటకు పాంచరాత్రాగమమైనట్లును సర్వవ్యాప్తిని ప్రతిపాదించు అంతర్యామిత్వమును తెల్పుటకు మన్వాదిస్మృతులుగనైనట్లును అతీంద్రియుడగు వాడు సాధుపరిత్రాణ దుష్కృత వినాశముల నొనర్చుటకై రామకృష్ణాద్యవతారములు ధరింప నాతని అవతారముల యొక్క వ్యాపారాదుల (చేష్టల)ను ప్రతిపాదించునట్టి శ్రీరామాయణ మహాభారతాదులుగ అవతరించినట్లును, ఆయా అవతారముల కాలమునకు తరువాత జన్మించినవారును దు:ఖపడకుండునట్లు భక్తులు కోరినద్రవ్యముతో చేయబడినరూపముతో వారుపేరిడిన నామముతో ఆసన శయనాదుల నొనర్చుచు ఎట్టిప్రదేశముననైన ఏకాలముననైన ఎట్టి అధికారులకునైనా దర్శనమిచ్చుచు సులభుడు గనున్న అర్చావతారమును ధరించిన సర్వేశ్వరుని వైభవమును ప్రతిపాదించుటకై. శ్రీశఠకోపులు రచించిన ద్రావిడప్రబంధము అనబడునట్లు అవతరించినదనిరి.

అవ- అపౌరుషేయమగు వేదము అవస్థాంతరమును పొందినచో అర్థపూర్తికి లోపము రాదా యనిన వక్తృవిశేషముచే (ఆళ్వార్లద్వారా బయల్పఱచబడుటచే) ఆధిక్యమును పొందినదనుచున్నారు-

**71. మణ్ణాడిన నహ్యాజలమ్ తోతవత్తి చ్చఙ్గణితుఱైయిలే తుకిల్వణ్ణ**
కలుషితమైన సహ్యగిరిజలము తోతవత్తి శఙ్గణిరేవులయందు తెల్లనగు
**త్తెణ్ణీరాయ్ అన్తస్థత్తై కాట్టుమాపోలే అల్పశ్రుతర్ కలక్కిన శ్రుతి**
స్వచ్ఛపునీరై లోనివాటిని చూపునట్లు అల్పశ్రుతులు కలచిన వేదము
**నన్ఞానత్తుఱైశేర్న్దు తెళివుత్తు ఆళ్ పొరుళై అఱివిత్తతు.**
విలక్షణజ్ఞానరేవులజేరి తేటనై లోతగు విషయముల తెల్పినది.

వ్యా- ఎత్తగు సహ్యపర్వతమునుండి భూమిపై పడిన జలము మట్టితోగూడికలుషితమై ప్రవహిం

చుచు రేవులను చేరినప్పుడు స్వచ్ఛమై తెల్లని నీరుగల్గి తనలోని వస్తువులను బయటికి కన్పింప చేయునట్లు అల్పజ్ఞానవంతుల విరుద్ధాభిప్రాయములచే దూషితమైన వేదము ఆళ్వార్ల విలక్షణ జ్ఞాన మనెడి రేవునుచేరి తిరువాయ్‌మొழி యను తేటనీరై లోతగు పరమరహస్యములగు అర్థముల నన్నింటిని బయల్పఱచినది.

**అవ** - వేదమునకు అధ్యయనకాల అధికారి నియమము లుండగా దీనికా నియమము లేదే యని చెప్పుచున్నారు-

**72. మేఘమ్ పరుకిన సముద్రామ్బుపోలే నూఱ్కడల్‌శొల్ ఇవర్ వాయినవాయ్**
మేఘము త్రాగిన సముద్రజలమువలె వేదసముద్రజలము వీరి వాక్కునుపొంది
**తిరున్దినవాఱే సర్వదా సర్వోపజీవ్యమామే.**
దిద్దబడగనే ఎల్లప్పుడు అందరకాధారమగునుగదా.

**వ్యా** - ఉప్పునీరై తనలోనుండు జంతువులకేతప్ప బయటివారికి ఉపయోగపడనట్టియు పర్వదిన ములలోతప్ప తక్కినదినములలో స్పృశింపరానిదియునగు సముద్రజలమును మేఘముత్రాగి వర్షింపగనే తీయని నీరై ఎల్లరకును ఎల్లకాలమును త్రాగి జీవింపదగినట్లు అనధ్యయనకాలమున చదువ రానిదై ఉపనీతులై ఉపాకర్మమొనర్చినవారికి మాత్రమే చదువదగినదగువేదము ఆళ్వార్లవాక్కు నుండి బయల్పడి కాల అధికారి నియమములులేక స్త్రీశూద్రాదులచేతను చదువతగినదై సర్వకాలమును సర్వజనులకును ఆధారముగానుండునుకదా.

**అవ** - సర్వాధికారమనుటకు దృష్టాంతమును చూపుచున్నారు-

**73. మృద్ఘటమ్బోలన్ఱే పొఱ్కుడమ్.**
మట్టికుండవలెగాదుగదా బంగారపుకుండ.

**వ్యా** - మట్టికుండనొకమారు వంటకుపయోగించిన దానిని శుచిగ (మడిగ)నున్నపుడే తిరిగిముట్టు కొనతగి యుండునేగాని లేకున్న మడికి తిరిగి పనికిరాదు. అట్లుగాక బంగారుకుండ నెల్లరు నెప్పుడును తాకతగియుండును. అట్లే సంస్కృతవేదము అధికృతాధికారము. అట్లుగాక ద్రావిడ వేదము సర్వకాలమును సర్వాధికారమైయున్నది.

**అవ**- తిరువాయ్‌మొழி యే చివరిప్రమాణమనియు అర్చావతారమే చివరిప్రమేయ మనియు తెల్పి ముగించుచున్నారు-

**74. పెరుమ్ పుళక్కడలుమ్ శ్రుతిసాగరముమ్ అలైత్తు ఆర్న్దు ఓడుమిడఙ్గళిల్**

గొప్పదై వేరగుసంద్రమును వేదసముద్రమును తరంగించి లోతై ప్రవహించుచోట్ల

**అయోగ్యర్క్కు చ్చమైత్తమడువుమ్ శాయ్కరకముమ్ మానమేయచరమమ్.**

అయోగ్యులకు తగినమడుగును దాహపుగొట్టమునైన ప్రమాణప్రమేయములచివరిది.

వ్యా - అపరిచ్ఛేద్యతలో సముద్రముకన్న విలక్షణుడగు సర్వేశ్వరుడు జ్ఞానాదిషడ్గుణపూర్ణుడై రెండు రెండు గుణములను ప్రకటింపజేసి సంకర్షణాదిరూపమున వ్యూహమైయుండునప్పుడును, సముద్రమున లోతుతెలియరాకుండ అగాధమగు స్థలమువలనే కంటికికానరాక అంతర్యామిగనున్న ప్పుడును, సముద్రము ఉప్పుమళ్ళుగా పారునట్టి తావువలెనే కంటికి కన్పించుచు భూలోకమున సంచరించుచున్నట్లు అవతరించినప్పుడును ప్రవాహము చలమలలో నిండి తేటనీరై ఎల్లరకు ఎల్ల కాలము కావలసినంతగా ఉపయోగపడునట్లు అవతారదేశమునకు కాలమునకు దూరమైనవారికిని సేవించి తరింపదగినట్లున్న అర్చావతారము ప్రమేయ పరంపరలో చిట్టచివరిదైనది. అట్లే అనంత మగు పరత్వమును తెలుపు వేదము సముద్రతరంగప్రదేశమువలె సర్వేశ్వరుని వ్యూహమును ప్రతి పాదించుటకై అవస్థాంతరమును పొంది పాంచరాత్రాగమమైనట్లును, సముద్రమున అగాధప్రదేశము వలెనే అంతర్యామిత్వమును ప్రతిపాదించుటకై మన్వాది స్మృతిరూపమైనట్లును, సముద్రము ఉప్పు మళ్ళుగా ప్రవహించినట్లైన రామకృష్ణాద్యవతారముల ప్రతిపాదించుటకై ఇతిహాస రూపముగ విస్త రించినట్లును, దాహముగొన్నవానికి పాత్రలోని నీటివలె అనాయాసముగ అనుభవించ దగినట్లున్న అర్చావతారమును ప్రతిపాదించుటకై తిరువాయ్మొళ్ళి దివ్యప్రబంధముగనై ప్రమాణపరంపరలో చిట్టచివరిదైనది.

అవ - ప్రమేయప్రమాణవైభవమును ప్రతిపాదించిన వెనుక ప్రమాతృ(వక్తృ)వైభవమును ప్రతిపాదింపనెంచి నమ్మాళ్వార్లు శూద్రకులజులుగదాయన భాగవతోత్తముల జన్మనిరూ పణము దోషమనుచున్నారు-

**75. వీట్టిన్చ ఇన్చప్పాక్కళిల్ ద్రవ్యభాషానిరూపణసమం ఇన్చమారియిల్**

అర్చావతారమున తిరువాయ్మొళ్ళిన ద్రవ్యభాషలనిరూపణసమము(పాపము) ఆళ్వార్లయొక్క

**ఆరాయ్చ్చి.**

జన్మనిరూపణము.

వ్యా - భక్తులకిష్టమైన పదార్థమును (ద్రవ్యమును) శరీరముగాగొని వారికానందమును గల్గించునట్టి అర్చావతారవిషయమున ఏ లోహముతో చేయబడినదని ద్రవ్యనిరూపణమువలన గలుగు దోష

మును భగవద్గుణములను ప్రతిపాదించుటచే విశేషజ్ఞులకానందమును గలుగజేయు తిరువాయ్ మొళ్ళి విషయమున భాషానిరూపణము చేయుటవల్లగలుగుదోషమును, శూద్రుడుగానీ కిరాతుడుగానీ చండాలుడుగానీ భగవద్భక్తుడైనచో వానిని జాతినిబట్టి సామాన్యునిగ తలచుమానవుడు నరకమును పొందుచున్నాడని శాస్త్రమునచెప్పి యుండుటచే భక్తాగ్రేసరులగు నమ్మాళ్వార్లను జాతినిరూపణచే శూద్రులనినచో అట్టిమానవుడు నరకమును పొందుచున్నాడు.

**అవ-** భాషావిషయ జన్మవిషయములనుబట్టి దివ్యప్రబంధమును ఆళ్వార్లను త్యజించు వారికి అనిష్టము ప్రసక్తించుననుచున్నారు-

**76. పేచ్చుప్పార్క్కిల్ కళ్ళ పొయ్ నూల్కళుమ్ గ్రాహ్యజ్గళ్, పిఱవి పార్క్కిల్**
భాషనుచూచిన వంచక అసత్య శాస్త్రములు గ్రహించవలెను జన్మనుచూచినచో
**అఞ్జామోత్తుమ్ అఱుమూన్టుమ్ కళ్ళిప్పనామ్.**
పంచమవేదమును భగవద్గీతయును విడువవలెను.

**వ్యా -** భగవద్గుణకీర్తనము ఏ భాషలో చెప్పబడినను స్వీకరింపవలెనని తెల్పియుండగా ద్రావిడ మున చెప్పబడియుండుటచే తిరువాయ్మొళ్ళి త్యాజ్యమనినచో సంస్కృతమున చెప్పబడినవను ఆధిక్యముచే వంచకములును అసత్యములును అగు వేదబాహ్యశాస్త్రములు గ్రాహ్యములు గావలసి వచ్చును. అట్లే తిరువాయ్మొళ్ళియొక్క గ్రంథకర్తయగు నమ్మాళ్వార్లు శూద్రకులజులుగాన త్యజిం పదగునన్నచో పంచమ వేదమనబడు మహాభారతము మత్స్యగంధిపుత్రుడగు వ్యాసునిచే రచింప బడుటచేతను 18అధ్యాయములుగల భగవద్గీత గోపకులజుడగు శ్రీకృష్ణునిచే చెప్పబడుటచేతను విడువదగియుండును. కావున భాషామాత్రమును గ్రంథకర్త జన్మమును మాత్రమే విచారించి ప్రబంధ మును ఆళ్వార్లను త్యజించుటచేత కలుగు అనిష్టమును తెల్పినవారైరి.

**అవ-** శ్రీకృష్ణునికన్నను కృష్ణద్వైపాయనునికన్నను ఆళ్వార్లజన్మ ఉత్కృష్టమైనదనుచు న్నారు-

**77. కృష్ణ కృష్ణద్వైపాయన ఉత్పత్తిపోలన్ఱే కృష్ణతృష్ణాతత్త్వజన్మమ్.**
శ్రీకృష్ణకృష్ణద్వైపాయనుల పుట్టుకవంటిదికాదుకదా నమ్మాళ్వార్లజన్మము.

**వ్యా -** ఒకామె కుమారుడుగపుట్టి అదేరాత్రిలో వేరొకామె కుమారుడైన శ్రీకృష్ణునియొక్క, కన్యాపుత్రు డగు వ్యాసునియొక్క జన్మలవంటిది కాక శ్రీకృష్ణుని శ్రీపాదములనాశ్రయించి అతనివిషయమున నాశయే శరీరముగ గల శ్రీమన్నమ్మాళ్వార్ల అవతారము ఉత్తమమైనది.

అవ - వీరి జన్మలకు గల తారతమ్యమును కన్నవారిని బట్టి తెల్పుచున్నారు-

**78. పెత్తుమ్ పేఱిళన్దుమ్ కన్యకైయానవళుమ్, ఎల్లామ్ పెత్తాళాయుమ్**
కనియు ఫలశూన్యయు కన్యకయైనయామెయు అన్నియు లభించినదైనను
**తత్తుక్కొణ్డాళ్ ఎన్బర్నిన్నార్ ఎన్నుమవళుమ్ నెడుఙ్గాలమ్**
దత్తుతెచ్చుకొన్నది అనువారున్నారు అనెడియామెయు చాలాకాలము
**నఙ్గైమీరెన్నుమివర్క్కు నేరన్ఱే.**
పూర్ణులారాయనెడివీరికి సాటిగారుగదా!

వ్యా - శ్రీకృష్ణుని కుమారునిగా లభించినను వాని బాల్యరసమొక్కింతయును అనుభవించలేకపో తినే అని విచారించెడి దేవకియును బదరికా మి(శమమగు ద్వీపమున పరాశరుని మూలముగ నారా యణుని బాదరాయణుడను పుత్రునిగ లభించిన సత్యవతియు; కృష్ణునిబాల్యచేష్టలన్నియు అనుభ వించిన భాగ్యముగలదయ్యును, తత్తుక్కొణ్డాళ్కొలో తానే పెత్తాళ్కొలో(పెరి.2-1-7) దత్తుతెచ్చుకు న్నదా లేక తానే కన్నదా అని లోకులు చెప్పుకొందురనెడి శంకగల యశోదయు పరిపూర్ణులగు మీరును ఒక కుమార్తెను కనిపెంచితిరిగదాయనెడి నమ్మాళ్వార్లతల్లితో సాటిగారు.

అవ - ఈ ముగ్గురియొక్క జన్మస్థానములనుబట్టియు ఆధిక్యమును తెల్పుచున్నారు-

**79. మీన నవనీతఙ్గళ్ గంధిక్కుమిడముమ్ వెఱికొళ్తుళాయ్ కమళుమిడముమ్**
చేపలు వెన్నలు వాసనకొట్టుచోటును పరిమళించుతులసి వాసించుచోటును
**తన్నిలొక్కుమో.**
సాటియగునా.

వ్యా - చేపలకంపుతోకూడిన వ్యాసులజన్మస్థానమును, వెన్నకంపుతోనిండినకృష్ణునిజన్మస్థానమును, భగవత్సంబంధమును ప్రకాశింపజేయునట్టి తులసియొక్క పరిమళముగల నమ్మాళ్వార్ల అవతారస్థ లముతో సాటికావు.

అవ - వీరి జన్మస్థలములయందలి వైషమ్యమును తెల్పుచున్నారు-

**80. ఆత్తిల్ తుఱైయిల్ ఊరిల్ ఉళ్ళ వైషమ్యమ్ వాచామగోచరమ్.**
నదియందు రేవునందు ఊరియందు ఉన్న విరుద్ధత చెప్పనలవిగాదు.

వ్యా- వ్యాసుని జన్మస్థానము శిష్టులంగీకరింపనిగంగయై, అదిన్నీ ఓడలరేవై ఊరు పల్లెకారుల గూడెమై యున్నది. కృష్ణునిజన్మస్థానము నల్లనినీరు కలదగుటచే తమోమయమగు యమునయై

కాళియుని విషముచే దూషితమైన రేవై, కుడి ఎడమ తెలియని గొల్లల పల్లెయైయున్నది. ఆళ్వార్ల జన్మస్థానము శ్లాఘ్యమగు పగడములపొదల క్రిందశంఖములుచేరియున్న తామ్రపర్ణినదియై తెల్లనిశంఖముల రేవై జ్ఞానాధికులగల్గి విలక్షణులచేత స్తుతింపబడెడి తిరుక్కురుగూరను నగరము. కావున వ్యాసకృష్ణుల జన్మములకంటెను కృష్ణతృష్ణాతత్త్వమగు ఆళ్వారుల జన్మ వైభవమును తెల్పినవారైరి.

**అవ** - ఎంతచెప్పినను జన్మ చేత అధికులుకాదుగదా యనిన దాస్యరసమెరిగినవారికిది తేజస్కరమని తెల్పుచున్నారు-

**81. దేవత్వముమ్ నిన్దైయానవనుక్కు ఒళివరుమ్ జనికళ్‌పోలే బ్రహ్మజన్మముమ్**
దేవజన్మయు హేయముగాతలచువానికి తేజముగల జన్మలవలెనే బ్రహ్మగపుట్టుటయును
**ఇఴుక్కెన్బార్‌క్కు పణ్డైనాళిల్ పిఱవి ఉణ్డాట్టు త్తేశిఱే.**
హేయమనువారికి పండైనాళ్‌న చెప్పిన జన్మము వైకుంఠపు తేజస్సుగదా.

**వ్యా** - రావణవధానంతరము బ్రహ్మాదులు నీవు నారాయణుడవనిన అది శ్రీరామచంద్రునకసహ్యమై నేను దశరథపుత్రుడనగు రాముడను మనుష్యుడనే యనియన్నట్లును, గోవర్ధనమును ఎత్తిన తర్వాత కృష్ణుని అతిమానుషచేష్టనుచూచిన గోపకులు నీవు దేవతవో దానవుడవో యక్షుడవో గంధర్వుడవో అనుటను విన్న కృష్ణుడు అసహ్యించుకొని నేను మీ బంధువగు గోపకుడనగు కృష్ణుడనని నట్లును యామునాచార్యులవారు తమ స్తోత్రరత్నమున చతుర్ముఖబ్రహ్మగా పుట్టుటను నేను కోరను. అనుటచేతను భగవచ్ఛేషత్వవిరోధియగు అహంకారహేతువగు ఉత్తమకులము హేయమనియు ఆళ్వార్లు తమ తిరువాయ్‌మొళ్ళి యందు "పణ్‌డైనాళ్" మొదలగుచోట్ల కులాగతముగ నీ దాస్యమున ఉన్న వారమన్నట్లు అహంకారమునకేమాత్రము తావీయనిదై పరమపదమున భగవత్కైంకర్యమునకు అనుకూలించునట్టి దివ్యదేహమువలె తక్కువ జన్మయును తేజస్కరమని తెల్పినవారైరి.

**అవ** - ఆళ్వార్ల అవతారము పరోపకారమనుటను సోదాహరణముగ తెల్పుచున్నారు-

**82. జనక-దశరథ-వసుదేవ-కులఙ్గళుక్కు మూత్తపెణ్ణుమ్ నడువిల్ పిళ్ళైయుమ్**
జనక- దశరథ- వసుదేవ -వంశములకు జ్యేష్ఠకుమార్తెయు మధ్యమ పుత్రుడును
**కడైకుట్టియుమ్పోలే ఇవరుమ్ పిఱన్దు పుకళుమ్ ఆక్కముమాక్కి అఙ్గైళైయుమ్**
కడగొట్టుబిడ్డడువలె వీరును అవతరించి కీర్తిని కులమర్యాదకాపాడి సంసారబంధమును
**అఱుత్తార్.**
ఛేదించిరి.

వ్యా - జనకుని జ్యేష్ఠపుత్రికయగు సీతాదేవి జన్మించి జనకకులమునకు కీర్తిని తెచ్చినట్లును, దశ రదుని మద్యమపుత్రుడగు బరతుడు జన్మించి పెద్దవాడుండగా చిన్నవానికి పట్టముకట్టరాదని కుల మర్యాదను కాపాడి కీర్తిని తెచ్చినట్లును, వసుదేవుని చిట్టచివరి కుమారుడగు శ్రీకృష్ణుడు జన్మించి తల్లిదండ్రుల బందమును విడగొట్టినట్లును, నమ్మాళ్వార్లవతరించి తమ గ్రామమునకు కీర్తిని తెచ్చు టయే గాక తాము వ్రాసిన తిరువాయ్మొళ్ళి దివ్యప్రబందమును చదువుటచే తమ సంబందముగల వారల సంసారరూపమగు క్రూరమగు బందమును త్రెంచివేసిరి

అవ - నమ్మాళ్వార్ల అవతారమువలన లోకమునకు గల్గిన మంచిని తెల్పుచున్నారు-

**33. ఆదిత్య-రామదివాకర-అచ్యుత-భానుకళుక్కు పోకాత ఉళ్ళిరుళ్నీఙ్గి శోషియాత**
ఆదిత్య -రామదివాకర అచ్యుత -బానులకు పోనట్టి లోనిచీకటిపోయి శుష్కింపని
**పిఱవిక్కడల్ అత్తి వికసియాత పోతిల్క్కమలమలర్న్దతు వకుళభూషణ**
జన్మసముద్రము శుష్కించి వికసించని హృయకమలమువిచ్చినది నమ్మాళ్వార్లను
**భాస్కరోదయత్తిలే.**
బాస్కరులు ఉదయించుటచేత

వ్యా- సూర్యుడుదయించి వెలుపలనున్న అందకారమును పోగొట్టగల్గునేగాని లోననుండు అజ్ఞా నాందకారమును పోగొట్టలేడు, అట్లే రామదివాకరుడును తన శరజాలమనెడి కిరణములచే రాక్షసు లనెడి సముద్రమును శుష్కింపచేయగల్గెనేగానీ సంసారసముద్రమును శుష్కింపచేయలేకపోయెను దేవకియనెడి పూర్వసంద్యన నుదయించిన శ్రీమహావిష్ణువగు అచ్యుతబానుడు తనగీతోపదేశ మనెడు కిరణములచే యెల్లర హృదయకమలములందలి అజ్ఞానమును పోగొట్టి వికసింపచేయలేక పోయెను కానీ నమ్మాళ్వార్లనెడి బాస్కరులుదయించి తమ తిరువాయ్మొళ్ళి యనెడు వేయిపాశు రములను కిరణములద్వారా సకల జనులయొక్క హృదయకమలములయందలి అజ్ఞానాందకారమ నశింపచేసి తమ సంబందముగల వారెల్లరియొక్క సంసారసముద్రమును నశింపచేసిరి ఆదిత్య, దివాకర, బాను శబ్దములను ఉపయోగించక బాస్కరశబ్దమును ప్రయోగించుటచే తామున్న వూరును, దేశమును లోకమును పరోపదేశములచే తమవలె దిద్దుబాటొనర్చి ప్రకాశింపచేసిరని తెలి యుచున్నది

అవ- ఇట్లు పరోపకారమునకై అవతరించిన నమ్మాళ్వార్లు మొదటిమూడువర్ణములలో అవతరింపక తక్కువగు నాల్గవకులమున ఏలజన్మించిరనిన అదియును పరుల రక్షించు టకే యనుచున్నారు-

**84.** వంశ భూమికళై యుద్ధరిక్క క్కీழ్కులమ్ పుక్క వరాహ గోపాలరైప్పోలే
వంశ భూములను ఉద్ధరింప తక్కువకులమున ప్రవేశించిన వరాహ గోపాలురవలెనే
ఇవరుమ్ నిమగ్నరై యుయర్త్త తాழ విழ్న్దార్.
వీరును మునిగినవారిని ఉద్ధరింప తక్కువగ జన్మించిరి.

వ్యా- యయాతియొక్క శాపముచే రాజ్యార్హతను కోల్పోయి హీనమైనట్టి యదువంశమున శ్రీకృష్ణుడు అవతరించి యాదవకులమునుద్ధరించినట్లును, హిరణ్యాక్షుని బలమువలన నిరాధారమై పాతాళమునంటిన భూమిని వరాహరూపియై ఉద్ధరించిన సర్వేశ్వరునివలెను, అహంకారహేతువులగు ఉత్తమవర్ణములు అనర్థకరములని తోచునట్లు తక్కువకులమగు నాల్గవవర్ణమున అవతరించి ఆళ్వార్లు సంసారమగ్నులను ఉద్ధరించిరి.

**అవ-** భాగవతవైభవము నెఱిగినవారికేగదా జన్మలయొక్క హెచ్చుతగ్గులు తెలియవచ్చుననుచున్నారు-

**85.** మ్లేచ్ఛనుమ్ భక్తనానాల్ చతుర్వేదికళ్ అనువర్తిక్క అఱివుకొడుత్తు కులదైవత్తోడొక్క
ఛండాలుడైనను భక్తుడైనచో చతుర్వేదులును ఆశ్రయింప జ్ఞానమునిచ్చి కులదైవముసాటిగ
పూజైక్కొణ్డు పావనతీర్థప్రసాదనామెన్గిఱ తిరుముఖప్పడియుమ్ విశ్వామిత్ర-విష్ణుచిత్త-
పూజనుగొని పవిత్రతీర్థప్రసాదమీయనర్హులనెడి శ్రీసూక్తులవిధమును విశ్వామిత్ర-విష్ణుచిత్త-
తులశీభృత్యరోడే ఉళ్కలన్దు తొழుకులమానవన్ నిలైయార్పాదలాలే బ్రాహ్మణవేళ్వికుఱై
విప్రనారాయణులతో సాటియైన తిరుప్పాణన్ కైశికరాగముచే బ్రాహ్మణునియజ్ఞలోపము
ముడిత్తమైయుమ్, క్కీழ్మకన్ తలైమకనుక్కు సమసఖావాయ్ తమ్బిక్కు మున్పిఱన్దు
తీర్చినదియును గుహుడు శ్రీరామునికి సజాతిమిత్రుడై తమ్మునికి ముందుపుట్టి
వేలుమ్ విల్లుమ్కొణ్డు పిన్పిఱన్దారై చ్చోత్తిత్తు తమైయనుక్కు ఇళైయోన్ సద్భావమ్
బల్లెము విల్లునుగొని లక్ష్మణుని పరీక్షించి అన్నకు తమ్ముని సత్ప్రవర్తన
శొల్లుమ్పడి ఏక కులమానమైయుమ్ తూతుమొழిన్దు నడన్దువన్దవర్కళుడైయ
చెప్పునట్లు ఒకే కులమైనవిధమును దూతమాటకై నడచివచ్చినవారల
సమ్యక్ సగుణ సహభోజనముమ్, ఒరుపిఱవియిలే యిరుపిఱవియానార్ ఇరువర్క్కు
సమ్యక్ సగుణ సహభోజనమును ఒకేజన్మలో రెండుజన్మలెత్తిన ఇరువురకు
ధర్మసూను స్వామికళ్ అగ్రపూజై కొడుత్తమైయుమ్ ఐవరిల్ నాల్వరిల్
ధర్మరాజు పెరుమ్బులియూరిస్వామివారు అగ్రపూజను చేసినవిధమును ఐదుగురిలో నల్గురిలో
మూవరిల్ ముఱ్పట్టవర్కళ్ సన్దేహియామల్ సహజరోడే పురోడాశమాకచ్చెయ్త
ముగ్గురిలో మొదటివారు సందేహింపక సహోదరులతో యజ్ఞప్రసాదముగచేసిన
పుత్రకృత్యముమ్ పుష్పత్యాగభోగమణ్డపఙ్గళిల్ పణిప్పూవుమ్ ఆలవట్టముమ్
పుత్రకృత్యమును పుష్పత్యాగభోగమండపములందు పూమాలికను చామరమును

**వీణైయుమ్ కైయుమాన అంతరజ్గరై ముడిమన్ననుమ్ వైదికోత్తమరుమ్**
వీణను చేతదాల్చిన అంతరంగులను తొణ్డమాన్‌రాజును రామానుజులును
**మహామునియుమ్ అనువర్తిత్తక్రమముమ్ యాగానుయాగ ఉత్తరవీధికళిల్**
లోకసారంగమునియు అనువర్తించినవిధమును ఆరాధనప్రసాదస్వీకార ఉత్తరవీధులందు
**కాయాన్నస్థల శుద్ధిపణ్ణిన వృద్ధాచారమ్ అఱివార్క్కొ ఱే జన్మోత్కర్షఅపకర్షజ్గళ్**
శరీరాన్నప్రదేశ శుద్ధిచేసుకొన్న జ్ఞానుల ఆచారము తెల్సినవారికిగదా జన్మలఎక్కువతక్కువలు
**తెరివతు.**
తెలియును.

వ్యా- ఛండాలకులమున పుట్టినవాడైనను భగవద్భక్తులయెడలదయయు వానిని పూజించుట యందు ప్రీతియు తానే స్వయముగ పూజించుటయు వానివిషయమున దంభము(లేకుండుటకు) అతని చరిత్రను వినుటలో భక్తియు, అట్టిభక్తిమూలముగ స్వరనేత్రాంగవికారములు గల్గుటయు వానినే ఎల్లప్పుడును తలచుటయు వానివలన వేరొకప్రయోజనము నాశింపకుండుటయు, ఇట్లు ఎనిమిదివిధ ములగు భక్తిగలవాడైనచో, నాల్గువేదములు చదినవారును ఆశ్రయించి జ్ఞానముపొందదగినట్లు అతడు బ్రాహ్మణశ్రేష్ఠుడు ముని శ్రీమంతుడు యతి పండితుడును, అట్టివానికీయవచ్చును। వాని నుండీ గ్రహింపవచ్చును. అట్టివారిని కులదైవతముతో (సర్వేశ్వరునితో) సమముగ పూజించి వారి శ్రీపాదతీర్థప్రసాదాదులను స్వీకరింపవచ్చును. ఇందులకు ప్రమాణములు భగవంతుని సూక్తియు, ఆళ్వార్లపాశురములును. ఇందులకు ఉదాహరణములు:-నంబాడువాన్ అనెడు అంత్యజుడగు భగవ ద్భక్తుడు ప్రతి ఏకాదశియందును ఉపవశించి అపరరాత్రియందు పోయి తిరుక్కురుంగుడి యనెడి దివ్య క్షేత్రమునందలి ఆలయముననున్న నంబి (భగవాను)ని కైశికరాగముతో మేల్కొలుపుచుండు టచే ఆతడు, "కౌసల్యా సుప్రజా రామ" అని మేల్కొల్పిన విశ్వామిత్రునితోను, శేషశాయియై గోపకు లమున ప్రధానుడైనవాడా! నిద్రనుండి మేల్కొనుమని పాడిన పెరియాళ్వార్లతోనూ, శ్రీరంగనాథా! నిద్రనుండీ మేల్కొనుమని పాడిన తొండరడిప్పొడియాళ్వార్లతోనూ సమానవంశ్యుడై; సోమశర్మ యను బ్రాహ్మణునకు యజ్ఞలోపముచే కల్గిన బ్రహ్మరాక్షసజన్మను పోగొట్టుటకై తాను కైశికరాగ ముచే పాడిన గీతమునందలి చివరిభాగముయొక్క ఫలమునిచ్చి బ్రాహ్మణుని యజ్ఞలోపమును తీర్చెను.

**కిరాతకులమున పుట్టినగుహుడు, ఉత్తమకులజుడగు శ్రీరామునిచే తమ్ముడిగ నాదరింపబడి, నాటి రాత్రి శ్రీరామచంద్రుడు శయనించియుండగా అతనిరక్షణకై ధనుర్బాణముల ధరించి కాపలా కాసెడి లక్ష్మణుని శంకించి వాడిగల బల్లెమును ధరించి లక్ష్మణునిపై కాపలాకాచిన అతిశయమే**

గాక, భరతునితో లక్ష్మణునియొక్క సద్భావమునుచెప్పిన ఆధిక్యముకలవాడాయెను.

"దశరథపుత్రుడగు శ్రీరామచంద్రుడు శబరిచే బాగుగ పూజింపబడెను" అన్నట్లు కిరాతకులమున పుట్టిన శబరి, తాను రుచిచూచిన పండ్లలో తీయనివి శ్రీరామచంద్రునకు మిక్కిలిప్రీతితో సమర్పింపగా వానినాతడు మంచిభోజనముగ నారగించెను.

పాండవదూతగవెళ్ళిన శ్రీకృష్ణుడు భీష్మద్రోణాదులగృహములను విడిచి 'విదురుని అన్నము పరిశుద్ధమును గుణవంతమును' అనదగినట్లు శ్రీకృష్ణునకు విదురుడు గుణవంతమునగు భోజనమునిడెను.

అనన్యప్రయోజనముగ ధర్మబుద్ధితో దూతగపోయివచ్చిన ఆంజనేయులు 'సీతను చూచితిని' అని చెప్పగనే శ్రీరామచంద్రుడు మిక్కిలి ఆనందముతో ఆంజనేయులను గాఢాలింగనమొనర్చుటచే సహభోజనము చేసినవాడాయెను.

[సర్వేశ్వరుడు అవతారములందు తాను ధరించెడి దేహము ఇచ్ఛాగృహీతమును అభిమతమునగు గొప్పది. అట్టిదానిని తానెంతగనో ఆదరించును. అట్టితాను మిక్కిలి ఆదరించి అనుభవించెడి తన దేహమును ఆంజనేయులకు ఆలింగనముచే అనుభవింపజేయుటచే ఒకే కంచమున ఇరువురును కలసి భోజనము చేసినట్లైనది.]

యదువంశమునపుట్టి గోపకులమునపెరుగుటచే ఒక జన్మముననే రెండు (జన్మలు) కులములుగల శ్రీకృష్ణునకు శుద్ధక్షత్రియుడగు ధర్మరాజు రాజసూయమున అగ్రపూజగావించెను.

అట్లే, భార్గవఋషి పుత్రుడై జన్మించి మేదరకులమున పెరుగుటచే ఒకే జన్మమున రెండు కులములుగల తిరుమళ్ళిశైయాళ్వార్లను భక్తిసారులను పెరుంబులియూరడికళ్ అనుస్వాములు తమ యాగమున అగ్రపూజగావించిరి.

పాండవాగ్రజుడగు ధర్మరాజు ఆకాశవాణి వాక్కునుబట్టి శూద్రజన్ముడని సందేహింపక జ్ఞానాధిపుడగు విదురునకు పుత్రునివలె ఉత్తరక్రియలను చేసెను.

దశరథుని ప్రథమపుత్రుడును వశిష్ఠుని శిష్యుడును అగు శ్రీరామచంద్రుడు తనకై ప్రాణములను కోల్పోయిన జటాయువను పక్షికి బంధువునివలె దహనాది ఉత్తరక్రియలనొనర్చెను.

యామునాచార్యులనాశ్రయించిన ఉత్తమకులజుడగు పెరియనంబి అంత్యజులును సబ్రహ్మచారియునగు మారనూరినంబికి పురోడాశమును కుక్కలపాలుచేయవలదని కోరగా చరమక్రియలనొనర్చెను.

పుష్పమంటపమగు తిరుమలలో వేంకటేశునకు అంతరంగభక్తులలో మాలాకైంకర్యమొనర్చెడికురుంబురుత్తనంబిని, అభిషిక్తక్షత్రియాగ్రేసరులగు తొండమాన్‌చక్రవర్తి ఆశ్రయించి తరించెను.

త్యాగమంటపమగు కాంచీపురమున శ్రీవరదరాజస్వామికి అంతరంగులై చామరకైంకర్యమొ

నర్చెడి వైశ్యకులజులగు తిరుక్కచ్చినంబిని వైదికాగ్రేసరులగు శ్రీరామానుజులు ఆచార్యులనుగా భావించి ఆశ్రయించిరి.

భోగమంటపమగు శ్రీరంగమున వీణను చేతపట్టుకొని శ్రీరంగనాథునకు అంతరంగులై వర్తించెడి పంచమకులజులగు తిరుప్పాణియాళ్వారులను, శ్రీరంగనాథునకు తీర్థకైంకర్యమొనర్చెడి ఉత్తమకులజులగు లోకసారంగమునులు తనభుజములపై ఎక్కించుకొని శ్రీరంగనాథుని సన్నిధికి గర్భాలయమునకు మోసుకొనివచ్చిరి.

భగవద్రామానుజులు కావేరి యందు స్నానమాడివచ్చుచుండగా అప్పుడే సాముచేసి చెమటపట్టిన శరీరముతో వచ్చెడి ధనుర్దాసును దగ్గరకు పిలిచి వానిభుజముపై చేయవైచుకొని ఆశ్రమమువరకూ నడచివచ్చి బట్టనైన మార్చుకొనక వానిని ముట్టుకొనుటచే తమ శరీరము పవిత్రమైనట్లు భావించి తృప్తులై భగవదారాధనమొనర్చెడివారు.

నమ్పిళ్ళై అను ఆచార్యులు తమ పెద్దభార్య తమను శ్రీరంగనాథునిగ భావించునదగుటచేత భగవదారాధనమునకు వంటకములను ఆమెచే చేయించుచు, రెండవభార్య తమను భర్తగమాత్రమే తలచెడి లౌకికురాలగుటచే ఆమెచే పైపనులను చేయించెడివారు. ఇట్లుండ ఒకనాడు పెద్దభార్య వెలుపలనుండుటచే వంటపని రెండవభార్యచేయవలసివచ్చెను. అంతట నంబిళ్ళగారు భగవదారాధనమొనర్చి పిళ్ళైయేఱుతిరువుడైయార్దాసుడు అనెడి పెద్దలను తీసుకొనివచ్చి వారిచేతితో ఆ వంటపదార్థమును స్పృశింపచేసి అన్నశుద్ధియైనట్లు భావించి ఆరగించెడివారు.

నడువిల్‌తిరువీథిపిళ్ళైభట్టర్ అనువారు తమ ఇంటికి దేహబంధువులువచ్చి భోజనాదులనొనర్చిపోగా ఉత్తరవీథిలోనుండు తమగృహమున పిళ్ళైవాననూమలైదాసులనెడి పెద్దలపాదస్పర్శమొనర్పచేసి స్థలశుద్ధిచేసుకొనిరి.

ఈ పైన పేర్కొనబడిన జ్ఞానాధికుల ఆచారమును తెలుసుకొనినవారికే జన్మలయొక్క ఎక్కువతక్కువలు తెలియునేగాని సామాన్యబుద్ధులకు జన్మముల ఉత్కర్షాపకర్షములు తెలియవు. దీనిచే ఆళ్వారులయొక్క జన్మనైచ్యమును భావించినవారిని ఖండించినవారైరి.

**అవ-** భగవద్జ్ఞానములేని వర్ణాదులు హేయములనుటను సోదాహరణముగ తెల్పుచున్నారు-

**86 అజ్ఞర్ భ్రమిక్కుమ్ వర్ణాశ్రమవిద్యావృత్తజ్ఞళై గర్దభ జన్మమ్ శ్వపచాధమమ్**

అజ్ఞానులు భ్రమించెడి వర్ణాశ్రమవిద్యావృత్తములను గర్దభ జన్మము శ్వపచాధమము

**శిల్పనైపుణమ్ భస్మాహుతి శవ విధవాలంకారమెన్ఱు కళ్ళిప్పర్.**

శిల్పనైపుణ్యము భస్మాహుతి శవ విధవాలంకారములని నిషేధింతురు.

**అళ్ళకియమణవాళప్పెరుమాల్ నాయనార్ తిరువడికళే శరణమ్.**

వ్యా- భగవంతునికి దాసుడుగా నుండుటయే ఆత్మకు అంతరంగనిరూపకమనెడి భగవత్సంబంధ జ్ఞానములేనివారు తక్కువవారైయుండగా "ఉత్తమకులము ఉత్తమాశ్రమము సద్విద్యసద్వృత్తి" అని ఇట్లు గొప్పవిగ భ్రమించు వర్ణాదులును, నాలుగువేదములు చదివియున్నను సకలవేదప్రతిపాద్యుడగు సర్వేశ్వరునెరుగనివాడు కుంకుమపువ్వును మోయునట్టి గాడిదకు పరిమళమంటనట్లు బ్రాహ్మణరూపమున ఉన్న గర్దభమనియు; యతియైనను భగవద్భక్తిలేనిచో ఛండాలునికంటె తక్కువవాడనియు; భగవంతుని తెల్పుటచే మోక్షముకొరకైన విద్యే విద్యయనియు తక్కినదంతయును చెప్పులు కుట్టుటకు ఉపయోగపడు విద్యవంటివేయగుననియు; భగవంతుని స్మరణలేని కర్మానుష్ఠానము బూడిదలో హోమము నొనర్చుటవలె వ్యర్థమనియు ఇట్లు భగవత్సంబంధములేని వార్తలును, భగవద్భక్తిలేని విద్యావృత్తములును శవమునకును విధవకును చేయు అలంకారసమములని జ్ఞానులు నిషేధింతురుగావున హేయములు.

ఆచార్యహృదయమున ప్రథమప్రకరణము సమాప్తము.

పెరియజీయర్‌తిరువడికళే శరణమ్||

# ద్వితీయ ప్రకరణము

**అవ** - ఆత్మనిరూపకమగు శేషత్వమునకు అనుకూలమగు జన్మమే ఉత్కృష్టజన్మమని సంసారసంపర్కము లేనివారును ముముక్షువులునగు మహాత్ములు ఆదరముతో ప్రకాశింపజేసిరనుచున్నారు.

**1. అణైయ వూర పునైయ అడియుమ్ పొడియుమ్ పద పర్వత**
శేషశయ్యగను (గరుడ) వాహనముగను తులశిగను పాదములును పాదధూళియు పడునట్లు పర్వత
**భవనఙ్గళిలే ఏతేనుమాక జనిక్కప్పెఱుకిఱ తిర్యక్‌స్థావరజన్మఙ్గళై పెరుమక్కళుమ్**
భవనములలో ఏదోయొకటిగ పుట్టగోరెడి తిర్యక్‌స్థావరజన్మలను నిత్యసూరులును
**పెరియోరుమ్ పరిగ్రహిత్తు ప్రార్థిప్పర్‌కళ్.**
ముముక్షువులును స్వీకరించి ప్రార్థింతురు.

**వ్యా** - ఆదిశేషుడు శయ్యగను గరుడుడు వాహనముగను, తులసిధరింపదగినట్లును తిర్యక్‌స్థావరజన్మముల నెత్తిన నిత్యసూరులు భగవత్కైంకర్యమును ప్రీతితో స్వీకరించిరి. సర్వేశ్వరుని శ్రీపాదములను వాని భక్తుల శ్రీపాదధూళిని, వాడును వారును ప్రేమించిన దివ్యదేశములందు వారికనుకూలముగ కైంకర్యమొనర్చుటకు తగిన తిర్యక్‌స్థావరజన్మములగోరిన పెద్దలగు శ్రీశుకులు ఉద్ధవుడు కులశేఖరులు పెరియముతలియార్ మొదలగు ముముక్షువులు ప్రార్థించిరి.

వాచికములగు పాపములవలన పక్షిమృగజన్మలును మానసికములగు పాపములవలన అంత్యజాతిలో పుట్టుటయును, కాయికములగు పాపములవలన స్థావరములుగ పుట్టుటయు గల్గునని శాస్త్రములు తెలుపుచుండ, అట్లుగాక భగవద్భాగవతకైంకర్యములకు ఉపయోగపడు తిర్యక్‌స్థావరజన్మలైనను శ్రేష్ఠమేయని ఏర్పడినది.

**అవ** - శాస్త్రప్రసిద్ధమగు ఉత్కృష్టవర్ణమును నిషేధించుట తగునా?యన తెల్పుచున్నారు-

**2. శేషత్వబహిర్భూత జ్ఞానానన్దమయనైయుమ్ సహియాతార్ త్యాజ్యోపాధియై**
శేషత్వములేని జ్ఞానానందమయమగుఆత్మనున్ను సహింపనివారు త్యాజ్యమగువర్ణమున్ను
**యాదరియార్‌కళే.**
ఆదరింపరుగదా.

**వ్యా** - క్షత్రియుడగు విశ్వామిత్రుడు తన తపోమహిమచే ఒకే జన్మలో బ్రహ్మర్షియగుటచేతను,

క్షత్రియుడగు త్రిశంకువు తన దుష్కృత్యముచే ఆ శరీరముతోనే చెండాలుడగుటచేతనుజ్ఞానానంద మయమైనను శేషత్వములేని ఆత్మనే ఆదరింపనివారు వర్ణము కర్మమునుబట్టి ఉండినదగుటచేత ఔపాధికము. ఇట్టి ఔపాధికమగుటచే త్యాజ్యమగు వర్ణమును ఆదరింతురా అనిరి.

**అవ** - వర్ణము ఔపాధికమగు విషయమును సోదాహరణముగ తెల్పుచున్నారు-

**3. ఇతిన్ ఔపాధికత్వమ్ ఒరురాజా తన్నై మత్తైమునివనాక్కినవన్ నీశనాక్కివిత్త**
దీని ఔపాధికత్వము ఒకరాజు తనను బ్రహ్మర్షిగచేసినవాడు చండాలుడైన
**రాజావై వారేయుఋప్పాక యజిప్పిత్తు స్వర్గమేత్తినపోతే తెరియుమ్.**
రాజును తోలేజందెముగ యజ్ఞముచేయించి స్వర్గమెక్కించినపుడే తెలియును.

**వ్యా** - కుశికవంశజుడగు రాజగు విశ్వామిత్రుడు తానొనర్చిన తపోబలిమిచే వశిష్ఠునివాక్యముచే ఆ శరీరముననే బ్రహ్మర్షియగుటచేతను, వశిష్ఠుని అవమానపఱచినది యెఱిగి వాని పుత్రులిచ్చిన శాప వశమున ఇక్ష్వాకువంశ్యుడగు త్రిశంకువనురాజు వక్షస్థలముననున్న యజ్ఞోపవీతము తోలై ఛండాలుడుకాగా ఆ తోలునే యజ్ఞాంగముగగొని తన తపోబలముచే యజ్ఞముచేయించి విశ్వామిత్రుడు అతనిని స్వర్గమునకు పంపుటవలనను వర్ణము కర్మమునుబట్టి ఉండునదియని సుస్పష్టము.

**అవ** - ప్రమాణప్రమేయప్రమాతృవైభవములందలి త్యాజ్యోపాదేయములవిభజించి వీనిని స్పష్టముగ నెఱిగిన భగవద్భక్తుల జన్మనిరూపణమొనర్చినవారు అధఃపతితులగుదురని తెల్పుచున్నారు-

**4. మాప్పురువిల్ కళ్ళవేదమ్ తిరున్దవేదమలమాన మానిడమ్పాడల్ సర్వవర్ణ**
భగవదవతారములలో బుద్ధరూపమును పవిత్రవేదమునమలినమగు మనుజులపాడుట అన్నివర్ణముల
**శూద్రత్వమ్, కాడువాళ్గ్ శాతియిల్ కడల్వణ్ణన్వేడమ్ తెన్నురైయిల్ హరికీర్తి**
శూద్రులగుటయు అడవినుండుగొల్లజాతిలో సముద్రవర్ణునివేషమును ద్రవిడభాషలందు హరికీర్తనము
**శ్వపచరిల్ పత్తి పాశనముమ్ అఱివార్ ఆరార్ అమరరెన్న ఏఱ అఱియాతార్**
ఛండాలులందు భక్తి సంపదను తెల్సినవారు ఎవరైనను నిత్యులనబడి వైకుంఠమేగ తెలియనివారు
**శాతియన్దణర్కళేలుమ్ తకరవిఝువర్.**
జాతియందున్నతులేయైనను అధఃపతితులగుదురు.

**వ్యా** - భగవదవతారములలో తామసమోహనార్థము వేదమున అప్రామాణ్యమునుపపాదించి వేదోక్త కర్మలయందు రుచినిపోగొట్టుటకేర్పడిన బుద్ధరూపమును భగవత్స్వరూపాదుల యదార్థముగ ప్రతిపాదించుటయను నిర్బంధము గలిగియున్న వేదమున మాలిన్యమనబడు మనుష్యుని స్తుతించు

టయు భగవద్భక్తులుకానివారు అన్నివర్ణములందును శూద్రులనబడుటయును, అడవులలో తిరుగు జాతియనబడు గోపకులమున అవతరించిన శ్రీకృష్ణుని యవతారమును; దక్షిణపు శాస్త్రమనబడు ద్రావిడభాషలో హరికీర్తనమునకన్న వేరులేనివిధమును, ఛండాలుడైనను భగవద్భక్తుడగువాడు బ్రాహ్మణునికంటె గొప్పవాడనెడి విభాగమును గుర్తెఱిగినవారు, వారేజన్మమెత్తి ఏవృత్తినాచరించి నను నిత్యసూరులనబడి పరమపదమును పొందగా; పైనచెప్పబడిన ప్రమేయాదుల మూడింటి యొక్క భేదముతెలియక భాగవతుల జన్మను నిరూపించువారు ఎంతటిశ్రోత్రియులైనను అప్పటిక ప్పుడే ఛండాలులై అధఃపతితులగుదురని శాస్త్రప్రసిద్ధము.

అవ - భాగవతవైభవమును ఆళ్వార్లయందు మూడుసూత్రములచే తెలుపుచున్నారు-

**5. తమిఙ్గ్‌మామునిదిక్కు శరణ్యామ్ ఎన్డవర్‌కళాలే "క్వచిత్క్వచిత్"ఎన్ఱు ఇవరావిర్భావమ్**

అగస్త్యునిదిక్కు (దక్షిణం) రక్షకము అన్నమహర్షులచే అచ్చటచ్చట అని వీరియవతారము

**"కలియుమ్‌కెడుమ్" పోలే సూచితమ్.**

కలియునునశించును పలె సూచింపబడెను.

వ్యా - ద్రావిడశాస్త్రమును ప్రవర్తింపచేసిన అగస్త్యమహర్షి నివసించునట్టి దిక్కగు దక్షిణము, అంద రిచేతను రక్షకముగ ఆశ్రయింపదగినదియని మహర్షులచేత చెప్పబడెను. ఒకద్రావిడశాస్త్రజ్ఞునిబట్టి దక్షిణదిక్కునకు ఆధిక్యముకలుగగా ద్రావిడప్రబంధము మూలమున లోకోజ్జీవనమును కల్గజేసిన ఆళ్వార్లఆధిక్యమును పేర్కొనుటలో బాధకములేదు. ఇట్టివీరు అచ్చటచ్చటను విశేషముగ ద్రావిడ దేశమున అనగా తామ్రపర్ణి మహానది కావేరి మొదలగు మహానదులు ప్రవహించునట్టి ప్రదేశముల నవతరించుటచే కలియుగముయొక్క స్వభావము నశించునని త్రికాలజ్ఞులగు శ్రీశుకాదిమహర్షులచే సూచింప బడుటచే తామ్రపర్ణి ఒడ్డునగల కురుకాపురమున అవతరించిన నమ్మాళ్వార్ల ఆవిర్భావ మున్ను భగవదవతారములవలె ఒకటియేయని చెప్పబడినది.

అవ - గొప్పజ్ఞానులును ఆళ్వార్లయవతారమిట్టిదని యెరుగకుండుటను తెల్పుచున్నారు-

**6. అత్రి-జమదగ్ని-పంక్తిరథ- వసు నన్ద సూనువానవనుడైయ యుగ వర్ణ**

అత్రి-జమదగ్ని- దశరథ- వసుదేవ నందుల కుమారుడైనవానియొక్క యుగముల వర్ణముల

**క్రమావతారమో వ్యాసాదివదావేశమో ? మూతువర్ కరైకణ్డోర్ శీరియరిలే**

క్రమముగుఅవతారమా వ్యాసాదులవలె ఆవేశావతారమా నిత్యులు ముక్తులు శ్వేతద్వీపవాసులలో

**యొరువరో మున్నమ్ నోత్త అనన్దన్‌మేల్ పుణ్ణియఙ్గళ్-ఫలిత్తవరో ఎన్ఱు శఙ్కిప్పర్‌కళ్.**

నొకరా పూర్వజన్మపుణ్యులా శేషశాయిపై పుణ్యములు ఫలించినవారా అని(జ్ఞానులు)శంకింతురు.
**వ్యా** - సర్వేశ్వరుడు కృతయుగమున అత్రి జమదగ్ని యనబడు బ్రాహ్మణోత్తములకు దత్తాత్రేయుడు పరశురాముడుగ పుత్రుడై అవతరించినట్లును, త్రేతాయుగమున క్షత్రియుడగు దశరథునకు శ్రీరాముడుగ కుమారుడైనట్లును, ద్వాపరయుగమున యయాతిశాపముచే పట్టాభిషేకార్హతను కోల్పోయి యదుకులమున బుట్టి కృషి గోరక్ష, వాణిజ్యములచే జీవించుటచే వైశ్యసములగు వసుదేవ నందులకు పుత్రుడగు శ్రీకృష్ణునివలె, కలియుగమున భక్తుడుగ అవతరించునని ఋషులు చెప్పియుండుటచేత ఆళ్వార్ల వైభవమును గుర్తెరిగినవారికి వీరియవతారవిషయమున అనుమానించుటకు అవకాశముకలదు.

వ్యాసాదులవలె అనుటచే వేదముల విభజించి చక్కబఱచుటకు వ్యాసులయందావేశించినట్లు నమ్మాళ్వార్లయందు ద్రావిడవేదమును ప్రవర్తింపచేసి వీరిమూలముగ లోకమును దిద్దుబాటొనర్చుటకు భగవానుడు ఆవేశించెనని ఊహించుటకు అవకాశము కలదు.

నిత్యులలోనో ముక్తులలోనో శ్వేతద్వీపవాసులలోనో నొకరు లోకమును దిద్దుబాటొనర్చుటకై సర్వేశ్వరుని ఇచ్ఛచే ఆళ్వార్లుగ అవతరించిరాయనియు జ్ఞానులు శంకింతురు.

మరియు వెనుకచెప్పినవారిలో నొకరునుగాక సంసారులలోనే వేలాదిజన్మలలో సంపాదించిన సుకృతఫలముగ ఇట్లుదిద్దుబాటయినవారా లేక సనాతనపుణ్యమగు అనంతశాయి సంపూర్ణకటాక్షము ఫలించి ఇట్లు దిద్దుబాటైనవారాయని అనేకవిధముల వీరియవతారమును నిశ్చయింపలేక జ్ఞానులును సంశయించు చుందురనుట.

**అవ** - జ్ఞానులును శంకించుటకు హేతువు వీరిప్రభావమే యనుచున్నారు-

7. **ఇతుక్కుమూలమ్ యాన్-నీ-యెన్రు మఱుతలైత్తు వానత్తు మణ్మిశై**
దీనికి కారణము నేనా నీవా యని వాదించి వైకుంఠమున భూమిమీద
**మాఱుమ్ నికరుమిన్ఱి నిలైయిడమ్ తెరియాతే తెయ్వత్తినమ్ ఒరువకైక్కొప్పాక**
అధికులు సాటియులేక ఉనికిపట్టు తెలియక నిత్యసూరిగోష్ఠి ఒకవిధముగ తగునట్లు
**ఇనత్తలైవన్ అన్దామత్తు అన్బుశెయ్య శేర్న్దమైక్కు అడైయాళముళవాక ఉకన్దుకన్దు**
నిత్యసూరిశ్రేష్ఠుడు పరమపద వ్యామోహముచేయ కృపకు చిహ్నములుగ సంతసించుట
**తిమిర్కొణ్డాలొత్తు నాట్టియల్వొళిన్దు శఠరైయోట్టి మదావలిప్తర్క్కు అఙ్కుశమిట్టు**
స్తబ్ధురాలగుట లోకులసంబంధమువీడి శఠులనుపారద్రోలి మదోన్మత్తులకు అంకుశముపెట్టి
**నడావియ కూత్తమాయ్ తీయన మరుఙ్గు వారామల్ కలియుకమ్ నీఙ్గి కితయుకమ్**
శాసించెడి మృత్యువై, దోషములు పాపములు రాకుండ కలియుగము నశించి కృతయుగము
**పత్తి పట్టై ప్పోతు అఱియాతిరున్ద ప్రభావమ్.**
వచ్చి రాత్రిపగలు తెలియకుండునట్టి వైభవము.

వ్యా - జ్ఞానాధికులును, ఆళ్వార్లను చూచి ఫలానివారనినిర్ణయింపలేకపోవుటకు హేతువులు:

ఆళ్వార్లు సర్వేశ్వరునితో యెదిరించి ఉభయవిభూతినాయకుడవగు నీవు నాలో ప్రవేశించి )డతెగక నెలకొనియుండుటచే నీకన్న నిన్ను ధరించియున్న నేనే అధికుడనని వాదించుటచేతను,

అవాప్తసమస్తకాముడగు సర్వేశ్వరుడును ఆళ్వార్ల శ్రీసూక్తులవినుటచేత ఉప్పొంగునట్టి వాక్పటిమ గలవారై ఉభయ విభూతులయందును తమతో సాటిలేనివారై ఉండుటచేతను,

భగవత్సంశ్లేషానందమున నిత్యసూరులకన్న అధికులగుటచేతను,

అన్నపానాదులచే ప్రాణములు ధరించి ఉండునట్టి లోకులవలె గాక భగవద్గుణములచేతనే ప్రాణముల ధరించియుండుటచేతను ఉభయవిభూతులలోని వారివలెగాక వారి వాసస్థానము శ్రీవై కుంఠమా లీలావిభూతియా అని తెలియజాలనట్లుండుటచేతను;

నిత్యసూరులందరు గూడినను తమతో నొకవైపునకు సమానులగునట్లౌటచేతను,

నిత్యసూరినిర్వాహకుడగు సర్వేశ్వరుడు పరమపదమునకంటెను ఆదేశవాసులెల్లరికంటెను మిక్కిలిగ వీరియందు వ్యామోహుడగుటచేతను;

భగవదనుగ్రహము వీరియందు కలిగినదనదగినట్లు, అనురాగము వీరి పెదిమలయందు తెలి యవచ్చుట;

స్పష్టమగు సంభోగ చిహ్నములు శరీరమునందు కనవచ్చుటలచేతను;

సర్వేశ్వరుని సౌందర్యశీలాదులను తలచుకొనుటచే ఆనందము వెల్లువయై బ్రహ్మసాక్షా త్కారము పొందినవారివలెనే స్తబ్ధులగుటచేతను;

అన్నవస్త్రములకై పరుగిడునట్టి అహంకార మమకారవశ్యులగు లోకులతో సంబంధమును వీడుటచేతను;

వేదాంతసారార్థములగు తమ వచనములచే వేదబాహ్యులను కుదృష్టులను తమయెదుట నిలువజాలనట్లు వాదించుటచేతను;

విద్యా ధన అభిజన మదత్రయముతోగూడిన వారలను నమ్రతగలవార గునట్లు శాస్త్రమను అంకుశముతో లోబఱచుకొనుటచేతను;

వేదమయుడగు గరుత్మంతుని వాహనముగా గల సర్వేశ్వరునియందు ఎల్లఱకును భక్తినిగ ల్గించుచు సంసారమునకు మృత్యువై ఆజ్ఞను నడిపించుటచేతను;

శరీరగతములగు వ్యాధులు ద్వేషము, ఆకలి, శత్రుభయము మొదలగు దోషములును, సంసారసంబంధమగు సకలదు:ఖములకు కారణమగు పాపములును సమీపింపనట్లు కలియుగము పోయి కేవలము వైష్ణవధర్మమే నడిచెడి కృతయుగము ప్రవేశించినట్లొనర్చుటచేతను;

లౌకికులకు అనుకూలమగు దివారాత్రవిభాగము తెలియనట్లు కాలవిభాగములేనట్టి పరమప

దమునందువలెనే భగవదనుభవముతోనుండునట్టి ప్రభావులగుటచేతను;

ఇట్టి కారణములచే ఆళ్వార్లు ఇట్టివారని జ్ఞానులును నిశ్చయించలేకపోవుచుందురు.

**అవ** - ఆళ్వార్లకిట్టి ప్రభావము కల్గుటకు కారణము వీరిద్వారా లోకులను దిద్దుబాటొనర్ప చేయవలెననెడి భగవత్సంకల్పము నిర్హేతుకముగ వీరియందు ప్రసరించుటయే అనుచున్నారు-

**8. ఇతుక్కు హేతు ఊర్లితోఱుమ్ శోమ్బాతు ఒన్ఱి ప్పోరుళ్ళన్ఱు అళిమక్కిళ్ ఱ్న్ద**
దీనికికారణము ప్రతికల్పమున వెనుదీయక ఒకప్పుడు ఉపయోగించునని కృషిసల్పి

**ముత్తుమాయ్‌నిన్ఱు నూలురైత్తు యోకుపుణర్‌న్దు కణ్‌కాణవన్దు ఆళ్**
అంతరాత్మయైయుండి శాస్త్రమునుచెప్పి యోగనిద్రనుపొంది కన్నులకుకానవచ్చి మనుజుల

**పార్క్కుఱవన్ ఉలకినతు ఇయల్వై నల్‌వీడుశెయ్య ఇణక్కు ప్పారైవ్తేడి**
వెదకువాడు లోకులయొక్క స్వభావమును బాగుగవిడిపింప ఉంచుటకు సజాతీయమునువెతికి

**కళఅల ఞానమ్ ఉరువిన ముఱుతుమ్ ఓట్టిన పెరుజ్గణ్ ఎజ్గుమ్ ఇలక్కత్తు**
శ్రీపాదము జ్ఞానము వ్యాపించిన అంతటను వ్యాపించిన పెద్దకనులు ఎచటను లక్ష్యములేక

**అన్బొడునోక్కిన తిశైయిలే ఆక్కైయిల్ పుక్కు ఉళన్ఱు మాఱిప్పుడిన్ఱు**
ప్రీతియుక్తకటాక్షపు దిక్కునందు దేహమున జేరి అనుకూలించి మారిప్రవేశించి

**తుళజ్గుకిఱ ఇవర్‌మేలేపడ ప్పక్కనోక్కఱప్పణ్ణిన విశేషకటాక్షమ్.**
కష్టపడుచున్న వీరిపైపడగా ప్రక్కకుచూడనట్లుజేసిన విశేషకటాక్షము.

**వ్యా** - ఈ ప్రభావమునకు కారణము ప్రతికల్పమునను శ్రమకు వెనుదీయక లోకములను దేవమనుష్యాదిరూపములను సృజించి వీనియందంతరాత్మయైయుండి హంసాదిరూపములనెత్తి తెలియదగిన ధర్మముల తెల్పునట్టి శాస్త్రమునుపదేశించి క్షీరాబ్ధియందు ఆదిశేషునిపై నిద్రించువానివలె జగద్రక్షణచింతనమొనర్చుచు, అవాఙ్మానసగోచరుడగు తాను చర్మచక్షువులకు గోచరించునట్లు మనుష్యుడుగ అవతరించి తనకు దాస్యమొనర్చువారెవరైన కలరా? యని వెదకుచు తిరుగువాడు, లోకులెల్లరును తనను విడిచి శబ్దాదివిషయములందాసక్తులై క్షుద్రదేవతలనాశ్రయించియు వారియభిమానమునకై బలులనొనర్చుచు నిషిద్ధపదార్థములను నివేదనమొనర్చుచు దు:ఖమిశ్రిత అల్పసుఖములకై మనుష్యజన్మను వ్యర్థపరచుకొనెడి వారిని చూచి వారి పట్టుదలను పోగొట్టుటకై సజాతీయులెవ్వరైన గలరాయని శ్రీపాదమును వ్యాపింపచేసిన ప్రదేశమంతయును విశాలమగు నేత్రములతో చూచినను నొక్కరును గన్పింపకపోవుటచే ఎవరినైన అట్టివారినిచేయుటకై ప్రీతితో దక్షిణదిక్కునకు చూడగా కర్మానుగుణముగ శరీరముల ధరించుచు విడుచుచు జాతికులనియమములులేక సంసారసాగరమున మునిగి తొట్రుపడుచున్న నమ్మాళ్వార్లు గన్పింప లక్ష్మీదేవినిగూడ ననాదరించునట్లు వారియందు ప్రసరింపజేసిన సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షము.

అవ - నిత్యసంసారులనుకూడ ప్రతిభావంతులుగ చేయగలట్టి భగవత్కటాక్ష వైభవమును తెల్పుచున్నారు-

**9. శ్రమణి విదుర ఋషిపత్నికళై పూన్తరాక్కిన పుణ్డరీకాక్షన్ నెడునోక్కు శాపమిళ్ళి నైన్న**
శబరిని విదురుని ఋషిపత్నులను పవిత్రులనొనర్చిన సర్వేశ్వరుని విశేషకటాక్షముశాపమునశించినదన
**ప్పణ్ణుమితే**
చేయునుగదా.

వ్యా - శ్రీరామచంద్రుడు శబరి యొద్దకు బోయెనన్నట్లును, విదురుని యన్నము శుచికరము రుచికరము యన్నట్లును, ఋషిపత్నులనుంచి తెప్పించిన ప్రసాదమును ఆరగించెను అన్నట్లును, వారియందు భగవత్కటాక్షము పడుటచే అనుభవించిననే గానీ తీరని శాపములవంటి పాపములు నశించి పవిత్రులగునట్లు చేయును గదా.

అవ- సర్వేశ్వరుడేల వీరినిట్లు కటాక్షించెను, విశేషకటాక్షస్వరూపమేమి వీరు తక్కువ గుటెట్లన తెల్పుచున్నారు.

**10. గోవృద్ధిక్కు నెరిఞ్జియై పుల్లాక్కినవన్ జగద్ధితార్థమాక "ఎనక్కే నల్లవరుళ్‌కళ్"**
గోవృద్ధికి పల్లేరును పచ్చికచేసినవాడును జగత్తుహితమునకై నాకే మంచి దయను
**ఎన్నుమ్పడి సర్వసౌహార్ద్రప్రసాదత్తై ఒరుమడైశెయ్‌తు ఇవరై త్తన్నాక్క లోకమాక**
అనునట్లు అందరియందలిస్నేహానుగ్రహమును ఒకమడిగచేసి వీరిని తనవలెచేయగా లోకమెల్ల
**తమ్మైప్పోల ఆక్కుమ్పడియానార్.**
తమవలె చేయునట్టివారైరి.

వ్యా - పరమపదమునకంటెను పశువులను మేపుటయే మిక్కిలిగ ప్రేమించునట్టి శ్రీకృష్ణుడు గోవృద్ధికై పల్లేరువనమును మంచిలేతగడ్డితోనిండునట్లు సంకల్పించినట్లే జగద్రక్షకుడగు తానే జగత్తును బాగుచేయుటకై సకల జీవులయందును తనకున్న ప్రీతివి ఒకే విధముగ ఆళ్వార్లయందు ప్రసరింపచేసి తనతో సమానముగా జ్ఞానశక్తులుగలవారినిగ చేయ, ఆళ్వార్లును తనతో సంబంధించిన లోకులనెల్లఱను తమవలెనే భగవదనుభవపరులనుగ చేసినవారైరి.

అవ - తననుగాచేయుట అననేమి? యనిన తెల్పుచున్నారు-

**1. అతావతు మయర్వఱ మతినలమ్ అరుళుకై.**
అనగా అజ్ఞానములేని భక్తిరూపజ్ఞానమును అనుగ్రహించుట.

వ్యా-తనవలెచేయుటఅనగా యించుకైనను అజ్ఞానములేనట్టి భక్తిరూపాపన్నమగు జ్ఞానమునొసగుట.

**అవ** - దానినే విశదముగ తెల్పుచున్నారు

**12. "ఇరుళ్ తుయక్కు మయక్కు మఱప్పు" ఎన్గిఱ అనుదయ-సంశయ-**
ఇరుళ్ తుయక్కు మయక్కు మఱప్పు అనబడు అజ్ఞానము సంశయము
**విపర్యయ- విస్మృతికళ్ అత్తు, మలర్మిశై యెళ్గుకిఱ ఞానత్తై కాతల్**
విపర్యయము విస్మృతులు లేక, విచ్చిపైగా వృద్ధిపొందు జ్ఞానమును కాతల్
**అన్బు వేట్కై అవా ఎన్గుమ్ సఙ్గ కామ అనురాగ స్నేహాది అవస్థానామఙ్గళోడే**
అన్బు వేట్కై అవా అనబడు సంగ కామ అనురాగ స్నేహాది అవస్థలకుతగిననామములతో
**పరభక్తిదశై యాక్కుకై.**
పరభక్తిదశను కల్గించుట.

**వ్యా** - ఇరుళ్ అను శబ్దముచే తెలుపబడిన అజ్ఞానము (జ్ఞానముకలుగకపోవుట) తుయక్కు అను శబ్దముచే తెలుపబడిన నిశ్చయజ్ఞానములేని సంశయమును మయక్కు అను శబ్దముచే తెలుపబడిన రజ్జుసర్పభ్రాంతిమొదలగు విపర్యయమును, మఱపు అను శబ్దముచే తెల్పబడిన విస్మృతియు (మఱపు) అను నీ నాల్గు విధములగు సంకోచావస్థలును లేకుండపోయి,

మనోదోషములగు రాగద్వేషాది దోషములుపోగా మనస్సు పరిశుద్ధమగుటచే వికసితమై ప్రాప్తవిషయమగు సర్వేశ్వరునియందు వృద్ధిబొందెడి జ్ఞానమును అనేకతావుల కాతల్ అన్బు వేట్కై అవా అనియును చెప్పబడు స్నేహాంకురమగు సంగము ప్రీతి అపేక్ష ఆర్తియను నాల్గు అవస్థలకు తగిన నామములు గలిగి పరమభక్తిదశ వరకు వచ్చుట. ఈ అవస్థలన్నియును ఆళ్వార్లకు కల్గినవే.

**అవ** - ఆళ్వార్లభక్తి ఉపాసకుల యొక్క సాధనభక్తి కన్నను, ప్రపన్నుల సాధ్యభక్తికన్నను విలక్షణమని తెల్పుటకై మొదట సాధనభక్తి స్వరూపమును తెలుపుచున్నారు.

**13.** **జన్మాన్తరసహస్ర సత్తవఙ్గళాలే ఖ్యాతకులఙ్గళిలే పిఱన్దు ఎళ్గుతి వాశిత్తు తత్త్వజ్ఞరాయ్,**
వేలాదిజన్మల సత్కర్మలచే ప్రసిద్ధకులములందు జన్మించి, వ్రాసి చదివి తత్త్వజ్ఞులై
**కుళిత్తు ఓతి ఉరువెణ్ణుమ్ అన్ది ఐవేళ్వి, అఱుతొళ్గిల్కళాల్**
స్నానమాడి వేదముచదివి గాయత్రిజపము సంధ్యావందనము 5 మహాయజ్ఞములు షట్కర్మలచేత
**మిక్కు, ఊన్ వాడ ప్పొరుప్పిడై త్తామ్ వరున్ది త్తున్బవినైకళై విడుత్తు,**
పూర్ణులై తనువు శుష్కింప పర్వతాగ్రముల తాము శ్రమించి దుఃఖహేతుపాపములపోగొట్టి
**వివేక-శమాదికళ్ వళర ఎట్టు నీక్కి ఎట్టుమ్ ఇట్టు, ఎట్టినాయపేత పూవిల్**
వివేక-శమాదులు పెరుగ 8 నశింపించి 8 ఆచరించి సాష్టాంగమొనర్చి పూలతోను
**శాన్దొడు తేవకారియమ్ శెయ్తు, ఉళ్ళమ్ తూయరాయ్, వారి ప్పున్బుల**
గంధముతోను దైవారాధనము చేసి మనస్సును శుద్ధిజేసి విషయేంద్రియ సంచారమడ్డి

**అకత్తినుళ్ ఇళైప్పినై అడైవే విళక్కినైక్కణ్డు యోకనీతి నణ్ణి**
లోనిఅవిద్యాదుల సంచారమడ్గి క్రమముగ ఆత్మప్రకాశము దర్శించి యోగమార్గమును సమీపించి
**అఱన్దికళు మఱైయోర్ మనన్దన్నుళ్ అమర్న్దుఱైయుమ్ అరుమ్బెరుమ్ శుడరై**
ధర్మమాచరించు వైదికుల మనసుల అమరి నివసించు లభింపరాని సర్వేశ్వరుని
**కణ్ణళ్శివన్దిల్ పడియే మనవుట్కొణ్డు నిరన్దరమ్ మఱవామై తుడక్కఱా**
కణ్ణళ్శివన్దిల్ విధమున మనసున ధ్యానించి, నిరంతరము మరవక ఎడతెగని
**స్మృతియాయ్, కనవిల్మిక్క దర్శనసమమాయ్, ఆకత్తుప్పల్కుమ్ అత్యర్థ ప్రియమాయ్**
తలంపై కలకంటె మిక్కిలి చూడదగినట్లై మనసున నుంచుకొన మిక్కిలి ప్రీతియై
**వైకుమ్ శిఱప్పు విట్టు కుత్తేవల్ ఎన్నాత అనన్యప్రయోజనమాయ్**
ఎల్లప్పుడు లాభము విడిచి కైంకర్యమున్ను కోరనట్లు అనన్య ప్రయోజనమై
**వేదనోపాసనసేవాధ్యానాదికళెన్ఱు శొల్లుమతు సాధ్యసాధనభక్తియాక శాస్త్రసిద్ధమ్.**
వేదన, ఉపాసన, సేవ, ధ్యానములని చెప్పెడిది సాధ్యసాధనభక్తిగా శాస్త్రప్రసిద్ధము.

వ్యా - వేలకొలది జన్మలందు సంపాదింపబడిన తపస్సు జ్ఞానము సమాధియను వానివలన క్షీణించిన పాపముగల నరులకు శ్రీకృష్ణునియందు భక్తి గల్గుచున్నదనినట్లు, వేలకొలది జన్మములుగ ఈషణత్రయమనబడు దారేషణ, ధనేషణ పుత్రేషణములను పూర్తిగవిడిచి భగవత్సమారాధన రూపముగ చేయునట్టి సత్కర్మల చేత, యోగభ్రష్టుడు, పరిశుద్ధులగునట్టి శ్రీమంతుల గృహములగాని ధీమంతులగు యోగుల వంశమునగాని జన్మించును అనినట్లు భగవంతుని అనుసంధించియు వానిని తెలుపునట్టి శబ్దములను వ్రాసియు చదివియు పెద్దలచే వినియు నిట్లు శాస్త్రాభ్యాసముచే గల్గిన జ్ఞానముగలవారై, ఉపాసనాంగముగ నిత్యకర్మానుష్ఠానమున కనుకూలమగు శరీరశుద్ధి కొఱకై స్నానమొనర్చి, వేదాధ్యయనము సంధ్యావందన గాయత్రీ జపములను దేవయజ్ఞ పితృయజ్ఞ భూతయజ్ఞ మనుష్యయజ్ఞ బ్రహ్మయజ్ఞములనబడు పంచమహాయజ్ఞములతోను అధ్యయన అధ్యాపన యజన యాజన దాన ప్రతిగ్రహములనబడు షట్కర్మలతోను పరిపూర్ణులై, పర్వతాగ్రముల వసించియు పంచాగ్నుల మధ్యనుండియు నదీతటాకజలముల మునిగియుండియు, శరీరము శుష్కించుటకును ప్రాణముల గాపాడుకొనుటకును ఎండిన ఆకులను రాలిన ఫలములను భక్షించుచు, ఆత్మతో వేరుచేయరాని దుఃఖహేతువులగు పాపములను ధర్మానుష్ఠానముచే బోగొట్టుకొని, వివేక విమోక అభ్యాస క్రియా కల్యాణ అనవసాద అనుద్ధర్షలనబడు సాధనసప్తకమును శమదమాదులును[వివేక మనగా - జాతి ఆశ్రయ నిమిత్త దుష్ట పదార్థములు కానివానిని ఆహారముగా తీసుకొనుటచే గలిగిన కాయ (శరీర) శుద్ధి, ఉల్లిమొదలగునవి జాతిదుష్టములు, అనగా పుట్టుకచేతనే చెడ్డవి, పతితఛండాలాదులయొక్క ద్రవ్యముగాని, ఆద్రవ్యమున్న ప్రదేశము దోషమున్నదైనగాని నగుచో నది ఆశ్రయదూషితమనబడును, ఉచ్ఛిష్టము (ఎంగిలి) వెంట్రుకలు మొదలగువానిచే పదార్థము చెడుచో నది నిమిత్త దుష్టమనబడును. ఇదంతయు వివేకమనబడును.

విమోకమనగా - కామము విషయమున ఆతురత లేకపోవుటయు, క్రోధాదులు లేకుండుటయును.
అభ్యాసమనగా - ధ్యానమున కాధారమైన వస్తువు నందు అనేకమార్లు పరిశీలనము జేయుట.
క్రియయనగా - పంచమహాయజ్ఞాది నిత్యకర్మలను యథాశక్తి అనుష్ఠించుట, దేవ , పితృ భూత మనుష్య బ్రహ్మయజ్ఞములును యజన యాజన అధ్యయన అధ్యాపక దాన ప్రతిగ్రహములను షట్కర్మలును .
కల్యాణమనగా - సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస అనభిధ్యలు.వీనిలో సత్యమనగా భూతహితము. ఆర్జవ మనగా త్రికరణశుద్ధి. దయయనగా , నిస్స్వార్థముగ పరుల దుఃఖములజూచి సహింపజాలకుండుట. దానమనగా , లోభము లేకుండుట, అహింసయనగా త్రికరణములతోను పరులను పీడించకుండుట, అనభిధ్య యనగా, ఇతరుల వస్తువులను తనవని భావింపకుండుట లేక వ్యర్థమగు నాలోచన జేయుట లేక ఇతరులొనర్చిన అపకారమునుచింతియకుండుట.
అనవసాదమనగా - దేశకాలములు విషమించుటవలనను శోకభయ హేతువులగు వస్తువులను తల చుటవలనను గలుగునట్టి మనోదైన్యము లేకపోవుట . శోకము, జరిగిపోయిన విషయముల, పుత్ర మరణాదుల గూర్చినదియు, భయము- రాబోవు విషయముల గూర్చినదియును.
అనుద్ధర్షమనగా - దేశకాలములు బాగుండుటచేతను ఇష్టవస్తువులు తలచుకొనుటచేతను కలుగు సంతోషము మితిమించకుండుట .
శమదమాదులనగా - అంతరింద్రియమగు మనస్సును, బాహేంద్రియములగు కర్మజ్ఞానేంద్రియము లను అనర్థమగు విషయములనుండి మరల్చుట.]

ఇట్టి యెనిమిదియు వృద్ధిబొందుచురాగా, ఆత్మకు చెడుపుచేయునట్టివగు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు, అజ్ఞాన అసూయలునగు ఎనిమిదింటిని నశింపజేసి .
[కామమనగా కోరిన వస్తువు చేజిక్కువరకును నిలువలేకుండుట, క్రోధమనగా కోరిన వస్తువు లభింప నప్పుడు కల్గు కోపము, లోభమనగా, తనవద్దగల వస్తువుపై మిక్కిలి ప్రీతి, మోహమనగా, చేయదగి నది తగనిది వివేచింపలేకపోవుట, మదమనగా, ద్రవ్యాదులు లభించుటవలన గలుగు గర్వము, మాత్సర్యమనగా, నితరుల యతిశయమును సహింపలేకపోవుటను ఆచరణపర్యంతము జూపుట, అజ్ఞానమనగా, నర్థములను గుర్తెఱుగక పోవుట, అసూయయనగా, సద్గుణములను దోషములనుగా నారోపించుట]

ఎనిమిదింటిని ఆచరించి అనగా, అష్టాక్షరీమహామంత్రమునందలి యెనిమిది యక్షరములను ఎనిమిది పుష్పములుగా సమర్పించుట యనియు లేక అహింస ఇంద్రియనిగ్రహము సర్వభూత దయ క్షమ జ్ఞానము తపము ధ్యానము సత్యములనెడి ఎనిమిదియు విష్ణువున కత్యంత ప్రీతికరము లగుటచేత వీని నాచరించి అభిమానమును వదలి మనస్సుతోను బుద్ధితోను సర్వేశ్వరుని ధ్యానిం చుచు, రెండు పాదములును రెండు హస్తములును, శిరస్సును భూమికి తగులునట్లు నమస్కరించి పుష్ప ధూప దీప చందన తీర్థముల సంపాదించి, ఫల సంగ కర్తృత్వముల విడిచి, దుమ్ము వెంట్రు కలు పురుగులు లేకుండ పరిశోధించి భగవదారాధనమొనర్చి,

నిత్య కర్మానుష్ఠానము మొదలు భగవదారాధనవరకు జేయునట్టి కర్మలు, ఈషణత్రయ పరిత్యాగ పూర్వక మగుటచే జ్ఞానయోగమునకు దగినట్లు పరిశుద్ధమగు అంతఃకరణము గలవారై,

విషయములనెడి అరణ్యమున సంచరించెడి ఇంద్రియరూపమగు ఏనుగను వివేకమను పంకుశముతో వశపఱచుకొని లోనకు అనగా ప్రత్యగాత్మయందు మరల్చి అవిద్య స్మితము అనురాగము ద్వేషము అభినివేశములనెడి క్లేశములను బోగొట్టి నాసికాగ్రమునుండి హృదయమునందలి ప్రత్యగాత్మను జూచుచు స్వయంప్రకాశమగు నాత్మస్వరూపమును సాక్షాత్కరించి, యిట్లు యోగరూపమగు నుపాయముచే సమీపించి.

పరమవైదికోత్తముల హృదయములందు నిత్యవాసమొనర్చెడి తేజోమయుడగు సర్వేశ్వరుని, మనోమాలిన్యములగు హింస క్రోధము క్రౌర్యము మొదలగువానికి సవాసనగ విడిచి త్రికాలముల యందును స్తుతించి వాని అవయవ ఆభరణ ఆయుధ శోభలను దివ్యమంగళ విగ్రహముతో ధ్యానించి అట్టి ధ్యానము విచ్ఛిత్తిలేనట్టి ధృవానుస్మృతియై, కలకంటెను నెక్కుడుగ ప్రత్యక్షముగ జూచుటవంటిదై, అంతము లేని ఆనందముగల సర్వేశ్వరుని యనుభవము, ప్రియురాలి ఆలింగనముకంటె నత్యంత ప్రియమై, వాని కళ్యాణ గుణానుభవమునకంటె పరమపదమునుగూడ నధికముగ తలచక యుండుట వేదనమనియు ఉపాసనమనియు సేవయనియు ధ్యానమనియు జెప్పబడెడి సాధ్యసాధన భక్తిగ వేదాన్త శాస్త్రములయందు ప్రసిద్ధమైయున్నది.

అవ - ఇట్టి ఉపాసనాత్మకముగాక ఉపేయమగు కైంకర్యమునకు సాధనముగ భగవదనుగ్రహముచే ప్రపన్నులు లభింపగోరు భక్తి విశేషమును దెల్పుచున్నారు.

**14. స్వీకృత సిద్ధసాధనర్, ఇత్తై సాధ్యమాక ఇరక్క ప్రాప్తిక్కు మున్నే సిద్ధిక్కుమ్.**

స్వీకరించిన ప్రపన్నులు దీనిని ఫలముగ ప్రార్థింప భగవత్ప్రాప్తికి ముందుగనే సిద్ధించును.

వ్యా - సర్వేశ్వరునే ఉపాయముగ స్వీకరించిన ప్రపన్నులు, ఈభక్తిని భోజనమునకు ముందు కావలసిన ఆకలివలె, కైంకర్యమునకు సాధనమగుటచేత సాధ్యమగు కైంకర్యమువలెనే, ప్రాప్యమని తలచి, పరభక్తి పరజ్ఞాన పరమభక్తులుగల వానినిగ జేయుమని భగవానుని ప్రార్థించుటచే శరీరము వీడిన వెంటనే భగవానుని పొందుటకు ముందుగనే కలుగు ననుట.

అవ - ఇక ఆళ్వారులయొక్క భక్తి స్థితిని తెల్పుచున్నారు.

**15. ఇతు ఉభయముమిన్ఱిక్కే అఱియాక్కాలత్తిలే ఒక్కప్పిఱన్దు తఴువినిన్ఱు కట్టమే**

ఇది రెండునుగాక అజ్ఞానదశయందే కూడ జనించి అంటిపెట్టుకుని కష్టమే

**నోయాయ్ ఉలర్త్తి వీఴ్గ్ దలప్పాయ్ త్యాగ స్వీకార నిష్ఠా హానికళాక్కి సత్తా**

వ్యాధియై శుష్కింపజేసి ముంచితల్లడిల్లజేసి త్యాగస్వీకారనిష్ఠాహానులగల్గించి సత్తువకు

**భోగవృత్త్యుపకరణమామతొన్ఱు.**

భోగవృత్తులకుసాధనమైనట్టిది.

వ్యా - ఆళ్వార్ల యొక్క భక్తి సాధ్యసిద్ధసాధనుల భక్తులు రెంటివంటిదియుగాక జ్ఞానమును తెలుసుకొనుట కవకాశములేని బాల్యమునుండియే తులశికి పరిమళమువలె సహజముగ పుట్టినదై విడువదలచినను విడువరానిదై అంటిపెట్టుకొనియుండి పొందదలచిన వస్తువు లభింపనప్పుడు ఆశయనెడి వ్యాధి అధికమై ప్రాణమును లోన శుష్కింపజేసినట్లు ఆర్తియను సముద్రమున ముంచి తల్లడిల్లజేసి ఉపాయాంతరములను వీడిన వీరిని, సిగ్గు లేక మడలను సాహసకార్యమున దిగునట్లుజేసి త్యాగనిష్ఠకు హానిగల్గించి, ప్రపత్తి ఒక్క పర్యాయమే చేయదగినదనెడి నిష్ఠనుచెడగొట్టి అనేకమార్లు శరణాగతి యొనర్చునట్లుజేసి, నిరంతరము భగవానునే తలచుకొనుటచే సత్తువకును, అనుసంధించుటచే కలుగు ప్రీతిచే భోగమునకును, విచ్ఛిత్తిలేక కైంకర్యము జేయనాశపడుటచే శేషత్వవృత్తికిని సాధనమైనట్టిదాయెను. అనగా స్వయత్నముచేత లభించినదియుగాక, అపేక్షించి లభించినట్టిదియుగాక స్వభావసిద్ధమై సత్తువమొదలగువానికి ఉపకరణముగా నుండునట్టిదని తెలియదగును.

అవ- ఇట్టి భక్తి వీరికి వెనుకటి జన్మయనుష్ఠానముచేతగాని యీజన్మయనుష్ఠానముచేత గాని లభించినది కాగూడదా? యనిన కాదని వారి మాటలచేతనే తెలియుచున్నదనుచున్నారు.

**16.** ఇడకిలేన్ నోన్బుఱివిలేన్ కిఱ్పన్ కీఴ్ నాళ్కళ్ ఎన్నైయాలే
అన్నమిడలేదు కర్మజ్ఞానములెఱుగను చేసితిని వెనుకకాలము(వ్యర్థము) అనుటచేత
సాధనత్రయ పూర్వాభ్యాసజమల్ల.
సాధనత్రయమును వెనుక అనుష్ఠించుటచే కల్గినదికాదు.

వ్యా - ఆకలిదప్పికలు గలవారికి అన్నము నీరు ఇచ్చినదిలేదనియు, ఇంద్రియ నిగ్రహమొనర్చి ఆత్మజ్ఞానము సంపాదించినది లేదనియు, పుష్పాద్యుపకరణములతో భగవదారాధన మొనర్చి భక్తిని సంపాదించినది లేదనియు, గడచిన కాలమెల్ల వ్యర్థపఱచితి నని యనుటచేత ఈ జన్మలో కర్మజ్ఞాన భక్తులనెడి సాధనత్రయము నాచరించినది లేదనియు వెనుకటి జన్మలలో సంపాదించినది లేదనియు ఆళ్వార్ల మాటలవలననే తెలియవచ్చుచున్నది.

అవ - ఇంకను వీరి మాటలచేత నీ విషయమును స్పష్టపఱచుచున్నారు.

**17.** ఇప్పిఱప్పే శిలనాళిల్ ఎస్టపోతే ఇరణ్డుమ్ కళ్ళియుమ్.
ఈజన్మలోనే కొద్దికాలమున అన్నప్పుడే రెండును నివర్తించెను.

వ్యా - కర్మానుష్ఠానముచే జ్ఞానముగల్గి తద్ద్వారా భక్తియోగరూప ఫలమిచ్చుట, నా ప్రయత్నమేమియు లేకనే భగవానుని వలన యీ జన్మలోనే స్వల్పకాలముననే పొందితినని చెప్పుటచేత, వీరి భక్తి జన్మాంతర అభ్యాసము వలన కల్గినదనుటయు, లేక యీ జన్మయందే కర్మజ్ఞానభక్తులనబడు సాధనత్రయ అనుష్ఠానమువలన పొందబడినదనుటయు కూడదు.

- వీరికిట్టి భక్తిగల్గుటకు కారణము, ఫలభోక్తయగు సర్వేశ్వరుని కృషి ఫలమనుచు రు.

**పెరుమ్బ్యాళిల్ క్షేత్రజ్ఞన్ పెరుఙ్జేయ్ కలియార్ఏవ ఆళుమ్ వన్కుఋమ్బర్,**
ప్రకృతిన జీవుని మనస్సు కలిగారు శాసింప ఏలెడి క్రూర ఇంద్రియదుష్టులు
**కుడియేఱి పెరుఙ్గుడియుమ్ తఙ్గళ్ కరుత్తుళ్ళేయాక్కి ప్పడిన్దుణ్డుమ్ పోకత్తే**
కాపురముండి (గొప్పయిల్లగు) మనస్సును తమ వశముజేసుకొని, మునిగిఅనుభవించు భోగమున
**తూరాతే పొఋక్కొణా పోకత్తుక్కు క్కావల్శెయ్తు కుమైత్తు త్తిరిత్తు వీఴ్త్తు**
తృప్తిలేక సహింపజాలని భోగమునకై చెఱబెట్టి నలిపి త్రిప్పి పడవేసి
**వలిత్తెత్తి అరువి అఋత్తు క్కడనాయిన ఇఋప్పిక్క పాఴ్త్త విఱియానవాఱే**
బాధించి నమిలి కోసి అప్పులవారివలె బాధింపగా చెడిన గతికిరాగా
**తన్పాల్ మనమ్ వైప్పిప్పతాక త్తేయ్న్దఱ మన్ని ఒళ్ వాళ్ ఉరువి**
తనయందు మనసు ఉంచునట్లొనర్చుటకై ఇంద్రియములచంపి స్థిరముగ వాడి కత్తిని విసిరి
**విన్నై త్తూత్తె వేర్ అఱివిత్తు తీక్కొళీ క్కవ్వైయెరువిట్టు అముతవాఋ**
పాపపు తుప్పలను వేళ్ళతో నరికి నిప్పుపెట్టి నిందను యెరువువేసి అమృతపునదిని
**తలైప్పత్తి ఈరియాయ్ క్కశిన్దతిలే ఈరనెల్ విత్తి ఎఋనాత్తు క్కళైయైయుమ్**
పొర్లజేసి తడిసి పదునైనదానిలో తడివడ్లనుజల్లి బాగాపెరిగిన కలుపును
**వేర్ ముతల్ మాయ్త్తు పట్టిచ్చేవతక్కి మీతుకొళ్ళామల్ కుఋక్కొళ్వైత్తు**
తల్లివేరుతో పీకివైచి పశువులగర్వమడచి దొంగిలింపనట్లు కావలిపెట్టి
**కడల్ప్పఱైయ విళైన్దు తలైవణక్కినవాఱే నాళ్ నాళ్ కోట్కుఱైయాక నిన్గార్**
సమృద్ధముగ పండి తలవంచినవెంటనే నిత్యానుభవమున కొంచెముకొఱతగ ప్రక్కవారు
**అఱియామల్ కున్దఙ్గొణ్డు ఆరామైయుణ్డు కాలక్కఴివాలే నిలత్తుకామల్ పత్తఋత్తు**
ఎరుగనట్లు ఆర్తిచే పైబడి అనుభవించి ఆలస్యమగుచో నేలపాలుకాకుండ కోసి
**త్తణ్డాలడిత్తు పతర్ అఋత్తు పోర్ త్తతోల్ విడుత్తు సూక్ష్మ వొట్టుమ్ నీరిలే కఋవి**
కర్రతో కొట్టి తాలునుపోగొట్టి పొట్టును తీసివేసి తవుడును నీటిలో కడిగి
**వేఱోర్ కలత్తిట్టు పైన్దొడి మడన్దైయరైక్కొణ్డు షడ్గుణరసాన్నమాక్కి వానోర్ క్కు**
వేరొకపాత్రలోనుంచి ఎదురువచ్చు స్త్రీలతో షడ్రసాన్నమొనర్చి నిత్యులకు
**ఆరావముతానవాఱే ముత్తుముణ్ణ మున్నమ్ పారిత్తు ఉఋవతోర్ నాఞ్జిల్కొణ్డు**
పరమభోగ్యముకాగానే మొత్తముతినుటకు ముందుగనే యోజించి దున్నెడి నాగలినిగొని
**పెరుక ముయలుమ్ పత్తియుఋవన్ కృషిఫలమిఱే**
మిక్కిలి యత్నించు భక్తి కృషీవలుని ప్రయత్న ఫలముగదా.

వ్యా - నిత్యమును అపరిచ్ఛేద్యమును చేతనుల భోగమోక్షములను వృద్ధిబొందించునట్టి ప్రకృతితత్త్వమున క్షేత్రజ్ఞుడనబడు బద్ధచేతనుని మనస్సనెడి గొప్పపొలమును హింసింపుడని కలియుగమనెడి వంచకుడు ఆజ్ఞాపించగా క్రూరములగు ఇంద్రియములనెడి దుష్టులు చేతనుని శరీరములోనే కాపురముండి మనస్సును లోబఱచుకొని తాము పోయెడి విషయముల మార్గముననే పోవునట్లుజేసి యెంత యనుభవించినను తృప్తినొందక సహింపరాని భోగమునకై చెఱపెట్టి శరీరమను గానుగలో త్రిప్పి క్రూరమైన విషయములనెడి పాడుగుంటలో పడద్రోసినాల్గువైపులకు నీడ్చి బాధించి నవిలి తినునట్లును కోసి తినునట్లును పైబడి యనేకవిధముల దండించి అప్పులవారివలె బాధించగా, మనసు చెడిపోవుటను జూచిన సర్వేశ్వరుడు, దానిని తనవైపునకు త్రిప్పుకొనుటకై కావలసిన సుకృతమెద్దియును దానియందు లేకపోవుటచే ఆసనబలమువలన దుష్టులను దండించు రాజువలెనే స్థిర ప్రతిష్ఠగా హృదయమున నంతర్యామిగా నుండి ఇంద్రియములనెడి ఐదుగురు దుష్టులను క్షీణించిపోవునట్లు కృపయనెడు పదునుగల కత్తిని తీసి పాపరూపమగు పొదను వాసనారుచులనబడు తల్లిపిల్ల వేళ్లతో సహా (కృపచే) కోయించి నరికిన అడవిని కాల్చి వేయునట్లు సంకల్పమనెడి అగ్నిచే దహింపజేసి ఊరివారి అపవాదమును యెరువుగజేసి జ్ఞానరూపమగు అమృతనదిని తలమునుకలుగ ప్రవహింపజేసి తనను తలచుటచే ఆర్ద్రమగు మనస్సును పదునొనర్చి సంగమనెడు తడివడ్లను చల్లి కర్తృత్వభోక్తృత్వరూపమగు నహంకారమమకారము లనెడి కలుపును వేరుతో పీకివేసి యింద్రియములనెడు పశువుల గర్వమడచి ఆసురస్వభావులగు అభాగవతులు మాది యని అభిమానింపనట్లు కావలిపెట్టి కాలమేఘశ్యామమగు తన శరీరకాంతిని వర్షింపగా భక్తి రూపమగు పైరు సముద్రమువలె అంతులేనట్లు ఫలించి పరిపక్వమై యార్తివలన గలుగు పారవశ్యముతో తలవంచగనే ప్రతిరోజును అనుభవించుచున్నను తృప్తితీరనట్లు (ఇంకను అనుభవించవలసినది మిగిలియున్నట్లు) ప్రక్కన నున్న లక్ష్మీదేవి ఆదిశేషుడు గరుత్మంతుడు మొదలగువారును తెలిసికొననట్లు మిక్కిలి ఆర్తితో నను భవించి ఆలస్యమువలన నేలపైపడిపోకుండునట్లు (ప్రాప్తి విరోధులగు కర్మలను పోగొట్టి ) కోసి కోసిన వడ్లవెన్నులను కృపయనెడు కర్రతో కొట్టి తాలును గింజలను వేరుచేయునట్లు కైవల్యము నందలి రుచిని పోగొట్టి, ఆ వడ్లతో నుండు పొట్టును తీసివేయునట్లు ఆత్మను చుట్టుకొనియుండి బాధించెడి జన్మ జరా మరణరూపములగు షడ్భావవికారములకు కారణమగు స్థూలదేహమును పోగొట్టి, బియ్యమును నీళ్ళలో పోసి సూక్ష్మమగు తవుడును కడుగునట్లు సూక్ష్మశరీరము నంటియున్న వాసనారేణువులను విరజానదీ జలమున కడిగివేసి, చిలికిన పెరుగు నుండి వెన్నను వేరొక పాత్రలో నుంచినట్లు స్థూలసూక్ష్మరూపమగు ప్రకృతి నుండి విడదీసిన ఆత్మను అమానవ పురుషుని కరస్పర్శచే అప్రాకృత దివ్య దేహమున ప్రవేశింపజేసి, సత్కారపదార్థములతో గూడ నెదురుగవచ్చు అప్సరసలతో తన భోగమునకు తగినట్లు బ్రహ్మాలంకారమొనర్పజేసి జ్ఞానాది షడ్గుణములతో ప్రకాశించునట్లొనర్చుటచే షడ్రసములతో గూడునట్లొనర్చి అహమన్నమనునట్లు మధురప్రసాదముగ జేసి నిత్యసూరులకు భోగ్యమైనదికాగానే యీ యాత్మవస్తువునకు రుచిగల్గుటకు ముందుగనే పూర్ణభోజన మొనర్చుట కాశపడెడి సర్వేశ్వరుడు, వ్యవసాయసాధనమగు నాగటిని చేతధరించి మిక్కిలి

యత్నించు వ్యవసాయదారునివలెనే యీ యాత్మకు తన విషయమున భక్తిని గలుగజేయుటకై యత్నించెడి కృషీవలుడేకదా. కావున నమ్మాళ్వార్ల కింతటి భక్తి గలుగుటకు కారణము భగవంతుని కృషియేయని తెలియబడుచున్నది.

**అవ** - ఎట్టి యోగ్యతయును లేకున్నను సర్వేశ్వరుని కృషి ఫలించినవారుకలరా యనిన తెలుపుచున్నారు.

**19. కోసల గోకుల చరాచరమ్ శెయ్యుమ్ కుణమొన్ఱిన్ఱియే అఱ్పుతమెన్ఱ క్కణ్డోమ్**

కోసల గోకుల చరాచరములు జేసిన సుకృతమేమియులేకున్నను ఆశ్చర్యమన వింటిమి.

**వ్యా** - కోసల (అయోధ్య) దేశముననుండు స్థావరజంగమ పదార్థములన్నియు రామానుగ్రహమున కును, గోకులమున వసించు స్థావరజంగమ పదార్థములన్నియును శ్రీకృష్ణానుగ్రహమునకును, నిర్హే తుకముగనే పాత్రమైనట్లును నమ్మాళ్వార్ల భక్తియును సర్వేశ్వరుని నిర్హేతుకకృపవలననే గలిగినదను టలో సందియము లేదు.

**అవ** - ఐనచో భగవన్నిర్హేతుకానుగ్రహము ఎల్లరియందును ప్రసరింపవలసి యుండగా వారొక్కరియందు మాత్రమే గల్గుటకు కారణమేమి? యన, నిరంకుశస్వతంత్రుడగుటచేత తెలిసికొనుట దుర్లభమని లౌకికదృష్టాంతముచే తెల్పుచున్నారు.

**20. పట్టత్తుక్కురియ ఆనైయుమ్ అరశుమ్ శెయ్యుమవై అరాయాతు.**

పట్టపు ఏనుగును రాజును చేయునవి తెలియరాదు.

**వ్యా** - రాజులేని దేశమున పట్టపుయేనుగు కండ్లకు గంతలుకట్టి వదిలినచో నది యెవనిని తనపై నెక్కించుకొనునో యాతడే రాజగును, ఒకరాజు తన అతిశయమువలన నేదో యొక స్త్రీని తనకు భార్యగా వరించినచో తగినవారెందరో యుండగా నాతడీమెనే యేల వరించెనను విషయమును తెలియువారుండరు. అట్లే సర్వేశ్వరుడు తనవగు నాత్మలలో నేదోయొక ఆత్మయందు ఈశ్వరత్వాతి శయముచే తన కటాక్షమును ప్రసరింపజేసి దానిని స్వీకరించినచో తక్కిన యాత్మలెన్నియో యుండగా నీయాత్మనే యేల స్వీకరించెననుట తెలియరానిది.

**అవ** - ఇట్లేల చెప్పవలెను వీటి జ్ఞాతసుకృతములు లేకపోయినను యాదృచ్ఛికము మొదలగు అజ్ఞాత (తెలియని) సుకృతముల మూలమున వీరిని సర్వేశ్వరుడు స్వీకరించె ననవచ్చునుకదా యనిన దెల్పుచున్నారు.

**21. మున్నీర్ వాఴ్న్దార్ శూట్టుమ్ కోవై ఆఴ్వి ఎన్గిఱ సాక్షాత్కృత స్వపర**

మున్నీర్ వాఴ్న్దార్ శూట్టుమ్ కోవై ఆఴ్వి అను పా.ల చెప్పినట్లు సాక్షాత్కరించిన స్వపర

**వృత్తాన్తర్క్కు యాదృచ్ఛికాదికళ్ ఉణ్డాకిల్ తోన్డుమ్.**
వృత్తాన్తులకు యాదృచ్ఛికాదులు వున్నచో తెలియును.

**వ్యా** - మున్నీర్ (తివా 3-2-1) అను పాశురమున సముద్రము భూమి ఇంద్రియములు మొ.వానినీ యాత్మనుజ్జీవింపజేయ సర్వేశ్వరుడు సృజించగా వానినిగొని జన్మమరణ మార్గమున పోతిననుటచే తను, వాళ్న్దార్ (తివాయ్ 4-1-7) అను పా. న గొప్పసుఖము ననుభవించినవారు నీటిబుడగలవలె నశించిరే గాని నిలిచినది లేదనుటచేతను, శూట్టునన్మాలై (తిరువి 21) అను పా. న వైకుంఠమున నిత్యసూరులు మాలలు సమర్పించ బారులుతీర్చియుండ ఉపేక్షించి గొల్లపల్లెలో వెన్నకాశబడి కృష్ణుడుగ నవతరించెననుట చేతను, కోవైవాయాళ్ పొరుట్టు (తివాయ్ 4-3-1) పా. న దేశకాల దూరములగు అవతారములందు నీకు సేవజేయకున్నను నాయందు ప్రీతిచేసితి వనుటచేతను, ఆళ్లి యెళ్ల (తివాయ్ 7-4-1) పా. న ఆశ్చర్యచేష్టల ననుభవింపజేసెనని చెప్పుటచేతను, నిర్హేతుకము గనే భగవానుడనుగ్రహించె ననిన శ్రీనమ్మాళ్వార్లకు యాదృచ్ఛికాది సుకృతములున్నచో చెప్పి యుండెడి వారే. కావున లేవని తెలియుచున్నది.

**అవ** - వీరికిగల అద్వేష ఆభిముఖ్యములు సుకృతమూలకములు కాగూడదా, యనిన తెల్పుచున్నారు.

**22. శెయ్త నన్టి తేడి క్కాణాతే కెడుత్తాయ్ తన్దాయ్ ఎన్ఱ అద్వేషాభిముఖ్యఙ్గళుమ్**
చేసిన మంచిని వెదికి కానక పోగొట్టితివి ఇచ్చితివి అనిన అద్వేషాభిముఖ్యములును
**సత్కర్మత్తాల్ అల్ల.**
సత్కర్మచేత కాదు.

**వ్యా** - సర్వేశ్వరుడు తమను అంగీకరించుటకు కారణమైన సుకృతములు తమయందు వెదకినను లేవనియు నా చెడ్డమనస్సును పోగొట్టితివనియు శ్రద్ధతో నమస్కరించు మనసునిచ్చితివనియు తామే చెప్పియుండుటచే అద్వేషాభిముఖ్యములును వానివల్లనే కల్గినవని తెల్పిరి.

**అవ** - ఐనను సర్వేశ్వరుడు పరభక్తి కలవారికి కన్పించినట్లే పరిగణన కలవారికినీ కన్పించునని వీరేతెల్పియుండుటచే అట్టి పరిగణన వీరికుండవచ్చునుకదా? యనిన తెల్పుచున్నారు.

**23. ఎణ్ణిలుమ్ వరుమ్ గణనైక్కు ఎణ్ణానుమిల్లై.**
లెక్కించిన వచ్చును (అను)లెక్కకు (వీరి) తలంపులేదు.

**వ్యా** - ఒకటి రెండు మూడు అని లెక్కించుచు ఇరువదియారువరకు లెక్కించినచో ఇరువదినాల్గు తత్వములు ప్రకృతియు, ఇరువదియైదవ తత్వము జీవుడును, ఇరువదియారవ తత్త్వము సర్వేశ్వ రుడునగుటచే ఇరువదియారనగనే నన్నేపిలిచెనని సర్వేశ్వరుడు వచ్చి వీరికి కన్పించి యుండవ

చ్చును కదా యని శంకించగా ఓ మనసా ! కర్మలు ఫలించునప్పుడు ముందుతలంపుగూడ లేకయే వచ్చి ఫలించువిధమును జూచితివికదా యని మనస్సునుగూర్చి తెల్పియుండుటచే పరిగణన భావన వీరికి లేదని సిద్ధమగుచున్నది.

**అవ** - అదిలేకున్నను, తమకు అనుమతియును ఇచ్ఛయును నున్నట్లు తెల్పియుండుటచే నవి హేతువులు కావచ్చునే ? యనిన నవియును సర్వేశ్వరునివలననే కల్గినవనుచున్నారు.

**24. మఱియాల్ ఇశైన్దోమెన్ఱుమ్ అనుమతి ఇచ్చైకళ్, ఇరుత్తువమెన్నాత ఎన్నై ఇశైవిత్త**
అనుమతిచే ఒప్పుకొంటిననెడి అనుమతి ఇచ్ఛలు ఉంచుకొందునననట్టి నన్ను ఒప్పించిన
**ఎన్నిశైవిన్ అతు.**
నాసమ్మతి వానిదే.

**వ్యా** - నాహృదయమున అనుమతిచే మఱచితిననియు నేనును నా మనస్సును ఒప్పు కొంటిమనియు చెప్పిన మాటలు నా హృదయమున సర్వేశ్వరుని స్థాపించెదననెడి **తలపులేనినన్ను** నిర్బంధించి ఒప్పుకొనునట్లు చేసి నేను కాదని తప్పించుకొనకుండునట్లు నా అంగీకారము **తానేయై** నా హృదయమున ప్రవేశించినాడని చెప్పియుండుటచే నా అనుమతి యిచ్ఛలును సర్వేశ్వరుని కృపి ఫలములే.అట్లు కాకున్నచో ఇశై విత్తెన్నై నన్ను తానే ఒప్పించినాడు అని చెప్పియుండకూడదుకదా.

**అవ** - ఇవేవియు కానున్నను, సర్వేశ్వరున కిష్టమగు మాటలనుటచేతను చేతలొనర్చుట చేతను నాకారణముగ వీరి నంగీకరించెననరాదా యనిన అవి ఫలమునకు హేతువులు కాదనుటకై మరికొన్ని శ్రీసూక్తుల చేర్చి తెల్పుచున్నారు.

**25. మాతవన్ మలై నీర్ నిళల్ ఎన్ఱు ఏఱిడుమతు, వ్యావృత్తిఉక్తి అన్యార్థమ్, అబుద్ధిపూర్వమ్**
మాధవుడు కొండ నీరు నీడ అని ఆరోపించుట వేరనిచెప్పుమాటఅన్యార్థము, అనుద్దేశ్యము,
**అవిహితమ్, ఫలవిసదృశమ్, ఫలాన్తరహేతు.**
అశాస్త్రీయము ఫలమునకుతగవు ఇతరఫలహేతువులు.

**వ్యా** - అంతఃపురములో నుండువారు చెప్పెడి మాధవుడు అనెడి నామమును తారతమ్యము నెఱుగని నేను ఊరికే అన్నమాత్రముననే నన్నంగీకరించి నా హృదయమున ప్రవేశించి సర్వవిధకర్మములను బోగొట్టినాడనియు, పర్వతములపేర్లను జెప్పుచు యాదృచ్ఛికముగ తిరుమాలిరుంశోలై పర్వతమన్న మాత్రముననే తానుండెడి పర్వతమను ప్రీతితో చెప్పినాననుకొని పిరాట్టితో గూడ నాలో ప్రవేశించినాడనియు చెప్పుటచేత నివి అబుద్ధి పూర్వకములు, ఫలహేతువులుగ నివి శాస్త్రమున చెప్పియుండలేదు, భగవదనుగ్రహరూప ఫలమునకు సాటిగావు, అల్పఫలములకు హేతువులగునంతియే.

**అవ** - అగుచో సర్వేశ్వరుడు వీరినిట్లు నిర్హేతుకముగ నంగీకరింపగోరుటకు హేతువేమ నిన తెల్పుచున్నారు.

**26.** ఇవన్ నడువే **అడియానెన్లు ఓలైప్పడా ప్రమాణమ్ పక్షపాతి సాక్షి**
సర్వేశ్వరుడు మధ్యనువచ్చి దాసుడవని వ్రాతలేని ప్రమాణమును పక్షపాతియగుసాక్షిని
**వన్‌కళవిల్ అనుభవమాకిఱ ఇన్దిఱజాలజ్ఞళ్ కాట్టిక్కొళ్ళ, కాఱ్పారత్తు విశిఱ్ష్హ్త్‌.**
వన్‌కళ్వన్‌లోని అనుభవరూపమగు ఇంద్రజాలములను చూపగా అడ్డులేక కృప వృద్ధిపొందినది.

**వ్యా** - ఏదో యొకటి ఆరోపించి అంగీకరించునట్టి సర్వేశ్వరుడు నాధుడగుటచే నిర్హేతుకముగ వేంచేసి నీవు నా దాసుడవని ఆళ్వారులను పట్టుకొనగా వీరు దానికి ఒప్పుకొనక, నేను స్వతంత్రు డననియు, నేను నీకు దాసుడనని యేల చెప్పితివనియు నడుగగా సర్వేశ్వరుడు చేతనా చేతన ములు తనకు శేషభూతమని ప్రతిపాదించు వేదప్రమాణమును జూపగా నది వ్రాతలేని ప్రమాణమని వీరు ఆక్షేపించి తమకు అనాదిగనున్న అనుభవమును దెల్ప, నాతడు దూరముగ నుండి పాలించు టకంటెను దగ్గరగనుండి నిర్బంధించుట మేలని నిర్బంధింప, దానికి సాక్షి యెవ్వరని వీరడుగ, సుధీ స్యాత్ అన్నట్లు తత్త్వవేత్తలను సాక్షులుగ నాతడు జూప, వారు నీయందు పక్షపాతులని వీరనగా, నాతడు వన్ కళ్వన్ అను పాశురమున అనుగ్రహానంతరము తాము స్వతంత్రులమని తలచెడి అను భవమంతయు ఆత్మాపహార రూపమగు క్రూరమగు అజ్ఞానమువలన కల్గినదని వీరు పశ్చాత్తాపపడు నట్లు ఇంద్రజాలము వలె దృష్టిచిత్తాపహారియగు దివ్యమంగళవిగ్రహ సౌందర్యమును సౌశీల్యాది చేష్టలనుజూపి నోరుమూయించి వీరు తనదియనుకొనిన యాత్మను సర్వేశ్వరుడు తనదిగ జేసికొ నగా భగవత్కృప ఫలించునప్పుడు అడ్డుపెట్టగలవారెవ్వరని ఆళ్వారులాశ్చర్యపడునట్లు వృద్ధి పొందినదాయెను.

**అవ** - ఇట్టికృప అనాదిగ నీ యాత్మయందు కలుగక ఈరోజున బయల్పడుటకు హేతు వగు సుకృతము లేదా । యనిన దెల్పుచున్నారు.

**27.** వరవాఱిల్లై, **వెఱితే యెన్న ఱితి యిట్టపిన్ వాఁఱ్ముతలెన్గిఱ సుకృతమొఱ్ఱియ**
వచ్చినదారితెలియదు నిర్హేతుకముగనని తెల్పిన తరువాత సుఖమూలమనెడి భగవత్కృపతప్ప
**క్కఱిప్పిక్కలావతు ఇల్లై.**
కల్పింపదగినది లేదు.

**వ్యా** - ఉపాయము లభించిన మార్గము నొక్కవిధమునను ఎఱుగను, ఫలమోయెక్కువ భోగ్యముగ నున్నదనియు, సంసారమున నించుకయు నాశలేకుండునట్టి నాయనుభవమునకు మొట్టమొదటి సుకృతమైన వాడా యని వీరే తెల్పియుండుటచే సర్వేశ్వరుడే తప్ప వేరుగ కల్పింపదగిన సుకృత మెద్దియును లేదు.

అవ - ఉపాసకునికి కర్మ జ్ఞానముల మూలమున గలుగుభక్తివలెనే వీరి భక్తియును భగవత్ప్రాప్తికి సాధనమా? యనిన తెల్పుచున్నారు.

**28. నలమరుళినన్, ఎన్గొలెన్డు ఆమూలచూడమ్ అరుళాల్ మన్నుమివర్కు**
భక్తినికల్గించెను దేనిగొనియని మొదటినుండితుదివరకు కృపచే నిల్చినవీరికి
**అన్బుక్కడియానతువే అడిశేరుకైక్కు సాధనమ్.**
భక్తికి సాధనమైనదే పాదములజేరుటకు సాధనము.

వ్యా - జ్ఞానానందములను కృపజేసినాడని తమకు భక్తిగల్గుటకు కారణము భగవత్కృపయే యని ప్రారంభించి, జ్ఞాన,వరణ (ఉపాయ), ప్రాప్తి (మోక్ష) దశలయందును మొదటినుండి తుదివరకును సర్వేశ్వరుని కృపవలన స్వస్థచిత్తులైనట్లు తిరునగరి నిర్వాహకులగు శ్రీ శఠకోపులు చెప్పియుండుటచే, వీరి భక్తికి కారణమగు వానికృపయే వానిపాదములను జేరుటయనెడి ప్రాప్తికిన్ని సాధనమైనది.

అవ - ఇట్లు ప్రాప్తికి కృపయే సాధనమగుచో, వీరి మొదటిగ్రన్థమగు తిరువిరుత్తము నందలి మొదటిపాశురమగు ఇన్నిన్ఱనీర్మై యందు శరీరాదుల యందు రుచివాసనాదులు లేకుండజేసెనని చెప్పినప్పుడే వీరి కోర్కెను తీర్చవలసియుండగా, సంశ్లేషవిశ్లేషల వలన జ్ఞానభక్తులను వృద్ధి పొందించినది యెందులకనిన తెల్పుచున్నారు.

**29. పుణర్ తొఱుమ్ ఎన్న క్కలన్డు పిరిన్డు జ్ఞానభక్తికళ్లై వళర్తదు కనజ్గుళైయిడ**
పుణర్తొఱుమ్ అన్నట్లు సంశ్లేష విశ్లేషలచే జ్ఞానభక్తులను పెంచినది పెద్దకమ్మలను ధరింప
**క్కాతు పెరుక్కుతలుమ్, మాసోపవాసి భోజనప్పుఱ పూచ్చుమ్బాలే**
చెవినిపెంచునట్లును మాసోపవాసికి అన్నమునూరి ఒంటినిండ పూయునట్లు
**ఆత్త నల్ల మాపోక చ్చిరమ మాక.**
విలక్షణభోగమునుసహింపజేయ శ్రమపడుటవంటిది.

వ్యా - తిరువాయ్ మొళ్ళిలోని 10-3-2 పా. న సంశ్లేష దశయందు ఆనందము తలమునకలగుటచే దక్కరేమోయనియు, విశ్లేషదశయందు ఆలస్యమును సహించలేక దక్కరేమోయనియు సంశ్లేష విశ్లేషలను మార్చి మార్చి అనుభవింపజేయుచు, సంశ్లేషదశయందు జ్ఞానమును విశ్లేషదశయందు భక్తినిన్ని వృద్ధిజేయుచు, చెవులకు పెద్దకమ్మ (దుద్దు) లను పెట్టుకొనుటకై (ధరించుటకై) నూలు పెట్టియు పత్తిపెట్టియు బెండుపెట్టియు చెవిరంధ్రమును పెంచువారివలెను, నెలరోజులుపవసించిన వానికి మొదటనే అన్నము పెట్టిన జబ్బుచేయునని తలచి అన్నమును నూరి శరీరమునకు పూసియు బొరుగుల గంజిని అన్నమును పెట్టి ఇమిడిన తర్వాత అన్నమును పెట్టున్నట్లును నిత్యసూరుల భోగమును మొదటనే కల్గించిన వీరు దానిని సహింపరని దానిని సహింపజేయుటకై సంశ్లేషవిశ్లేషలతో చాలాకాలము సర్వేశ్వరుడు శ్రమపడినట్లనుట.

**అవ** - సంశ్లేషవిశ్లేషలనగా నెవ్వియనిన తెల్పుచున్నారు.

**30. ఇవత్తాల్ వరుమ్ సంశ్లేష విశ్లేషఙ్గళాకిఱన ఎళియనాయ్ నిఱ్కుమ్ అఱియనాయ్**
వీనిచేత కలుగు సంశ్లేష విశ్లేషములనునవి ఎళియనాయ్ నిఱ్కుమ్ అఱియనాయ్
**ఎయ్‌తాన్ ఎన్గిఱ దర్శనసమమాన మానసానుసన్ధానముమ్ తిణ్గొళ్ళప్పెఱాత**
ఎయ్‌తాన్ అనెడి దర్శనసమమగు మానసానుసంధానమును బాహ్యానుభవముకల్గనందున
**మనశ్శైథిల్యముమ్.**
మనస్సు శిథిలమగుటయు.

వ్యా - పైన జెప్పినవానికి హేతువులగు సంశ్లేషవిశ్లేషలు ఎవ్వియనగా మనస్సునకు మిక్కిలి సులభుడనియు, స్వామి నాముందఱ వచ్చి నిలుచున్నాడు అనిచెప్పినట్లు ప్రత్యక్షసమానమగు మానసికానుసంధానము సంశ్లేషయనియు, నీదివ్య మంగళవిగ్రహమును నాకన్నులకు చక్కగా కన్పడునట్లు ఒకనాడు కృపజేయుమా అనునట్లు తాము కోరిన బాహ్యానుభవముకలుగనందున అంతరానుభవము చెడిపోవునట్టి యంతఃకరణశైథిల్యము విశ్లేషమనియు అనుట.

**అవ** - లోకులకు కోరిన విషయము లభింపకుండుట పుణ్యపాపములచేగదా! విలక్షణులగు వారికిని కల్గుటకు కారణమేమి? యనిన తెల్పుచున్నారు.

**31. పుణ్ణియమ్ పావమ్ పుణర్చ్చి పిరివై అవై శరిత్తవర్కు ప్రియహితపరన్తాన్**
పుణ్యపాపములు సంశ్లేషవిశ్లేషలు వానిని దాటిన వీరికి ప్రియహితుడగు సర్వేశ్వరుడే
**తుళక్కఱ ఎఙ్గుమ్ తన్నైక్క నడత్తుమ్.**
తుళక్కఱ ఎంగుమ్ అన్నట్లు చేయును.

వ్యా - లోకులకు పుణ్యమువలన సంశ్లేషయు పాపమువలన విశ్లేషయు కల్గుచుండగా తిలలలో తైలము, కట్టెలో నిప్పు ఉండునట్లు విడదీయరానట్లు ఈయాత్మతో చేరియున్న పుణ్యపాపరూప ప్రబల కర్మలను బలవంతుడు ఉపాయముతో పెద్దగోడను పడద్రోయునట్లు సర్వేశ్వరుడే ప్రియుడును హితుడును నగుటచేత వీరికి జ్ఞానభక్తులను వృద్ధిపొందింపవలెననెడి యిచ్ఛతో మానసిక సాక్షాత్కారముచే సంశ్లేషభావనను బాహ్యఅలాభముచే విశ్లేషభావనను కల్గింగి సుఖదుఃఖముల ననుభవింపచేసెను.

**అవ** - ఇట్లు సర్వేశ్వరుడు వృద్ధిపొందించిన జ్ఞాన ప్రేమ దశలయందు వీరు మాట్లడు విధమేది? యనిన తెల్పుచున్నారు.

**32. జ్ఞానత్తిల్ తమ్‌పేచ్చు ప్రేమత్తిల్ పెణ్‌పేచ్చు**
జ్ఞానదశన తమమాట, ప్రేమదశన నాయకి మాట.

**వ్యా** - జ్ఞానదశయందు తామనెడి జ్ఞానముతోగూడి మాట్లాడుదురు. ప్రేమదశయందు అవస్థాంతరమును బొంది స్త్రీ (నాయకి) మాట్లాడినట్లు మాట్లాడుదురు.

అవ - ఇట్టి దశలలో వీరి మాటలలో భేదముండుటయేనా ? లేక స్వరూపము నందును భేదముండునా ? యనిన తెల్పుచున్నారు.

**33. తేఱుమ్‌కలజ్గి ఎన్ఱుమ్ తేఱియుమ్ తేఱాతుమ్ స్వరూపమ్ కులైయాతు**

తేరుమ్‌కలగి అని జ్ఞానమునను కలతయందును స్వరూపము చెడదు.

వ్యా - తెలివియున్నప్పుడును తెలివిలేనప్పుడును లక్ష్మివంటియామె శ్రీ కృష్ణునియందే మగ్నమై యున్నది అనిచెప్పినట్లు, రెండుదశలయందును శేషత్వస్వరూపము మారదు.

అవ - అయినచో వీరియందు మారునదేమి?అనిన తెల్పుచున్నారు.

**34. అడియోమ్ తుడర్న్దు కుత్తేవల్ అడిచ్చియోమ్ అడిక్కీఴ్‌కుత్తేవల్ ఆకై అవస్థాన్తరమ్.**

అడియోమ్ తుడర్న్దు కుత్తేవల్ అడిచ్చియోమ్ అడిక్కీఴ్‌కుత్తేవల్ అనుచోట్ల అవస్థాంతరము.

వ్యా - దాసులము ఎడతెగకుండ మంగళాశాసనముజేసి అనియు అనుసరించి అంతరంగకైంకర్య ములజేసి యనియు జెప్పినట్లు తామనెడి జ్ఞానముతోనున్న దశయందును, దాసులమగు మా తలపై నీ శ్రీహస్తము నుంచుము అనియు, నీ పాదకైంకర్యము జేయవలెననియు (నాయికా) స్త్రీ భావనతో మాట్లాడిన దశయందును స్వరూపమునందును స్వరూపానురూపమగు కైంకర్యప్రార్థనయందును భేదములేదు, అవస్థాంతరభేదము మాత్రమే యేఱ్పడునది.

అవ - వీరికి తామనితెలిసి మాట్లాడుట స్వాభావికముగాని పిరాట్టిదశనుబొంది స్త్రీగా మాట్లాడుట ఆగంతుకము కాదా। యనిన, భగవంతునకే పరతంత్రమై అతనికే భోగ్యమగు ఆత్మవస్తువు స్త్రీవలె ప్రవర్తించుట స్వరూపానురూపమై దానికి తగి నట్లుండునట్టి మాటలును స్వరూపాన్తర్గతములేగాని ఆగంతుకములు కావని రూపకాలంకా రముచే తెలుపుచున్నారు.

**35. విద్యై తాయాకప్పెత్తు పాలుమముదమాన తిరునామత్తాలే తిరుమకళ్ పోల**

విద్య తల్లియై కనగా పాలు,అమృతమువంటి తిరుమంత్రము చేత లక్ష్మివలె

**వళర్త్త తజ్ఞమాకియ తన్దై మత్తొరువర్క్కు ప్పేచ్చుప్పడామల్ విశ్వపతి**

పెంచగా రక్షకుడగు(ఆచార్యుడను) తండ్రి మరొకరిని ప్రార్థింపక విశ్వపతి

**లోకభర్తా ఎన్నుమ్ మణవాళరై నాలిరణ్డి త్రైకొణ్డు ముప్పిరియాన బ్రహ్మసూత్ర బన్ధత్తోడే**

లోకభర్తా అని సర్వేశ్వరుని 8అక్షరములుగొని మూడు పదముల మంగళసూత్రముతో

**వరిప్పిక్క ప్పరమ్పురుడన్ కైక్కొణ్డపిన్ చతుర్థియుళ్ పుక్కు ఇదైయీడునడుక్కిడక్కుమ్**

వరింపజేయ పరమపురుషుడు గ్రహించినవెనుక కైంకర్యమునజేరి శరీరప్రతిబన్ధకములగు

**నాళ్కళ్గొత్తు జన్మభూమియై విట్టకన్ఱు శూర్పణకుమ్బిఅప్పడియే ఉడన్‌శెన్ఱు కుడైన్దు నీరాడి**

రోజులు జరిపి లీలావిభూతిని విడిచి శూర్పణకుమ్బులోవలె వెంబడిపోయి విరజలోస్నానమాడి

**వియన్దుళ్ళాయ్ అఞ్జనత్తిన్ నీఱునానప్పొడి పీతకవాడై పల్కలన్కొణ్డు నోక్కి అలఙ్కరిత్తు**
దివ్యమాలలు దివ్యాంజనము దివ్యచూర్ణము పీతాంబరము ఆభరణములగొని వచ్చి అలంకరించి
**పల్లాణ్డిశైత్తు క్కవరిశెయ్య నిఱైకుడ విళక్కమేన్ది ఇళమఙ్గైయర్ ఎతిర్కొళ్ళ**
పల్లాణ్డుపాడి చామరములువీచగా పూర్ణకుంభము మంగళదీపముధరించి యౌవనలు యెదుర్కొన
**వైకున్దమ్ పుక్కిరున్దు వాయ్మడుత్తు ప్పేరుమ్కళిచ్చియాక వానవర్ పోకముణ్డు**
వైకుంఠమున ప్రవేశించి స్వామితోకలిసి మహానందముతో నిత్యుల భోగమనుభవించి
**కోప్పుడైయ కోట్టుక్కాల్ కట్టిల్ మితిత్తు ఆరోహిత్తు భరత అక్రూర మారుతికళై**
ఐశ్వర్యసూచక దివ్యపర్యంకమున కాలిడి ఎక్కి భరతుని అక్రూరుని హనుమను
**పరిష్వఙ్గిత్త మణిమికుమార్పిలే కురుమామణియాయ్ అణైయుమ్ వస్తువుక్కు**
కౌగలించిన మణులుగలవక్షమున కౌస్తుభమణివలె ఆలింగిత ఆత్మవస్తువునకు
**మణివల్లిప్పేచ్చు వన్దేఱియన్ఱు**
నాయిక మాటలు ఆగంతుకముకాదు.

వ్యా - ఆచార్యుడు శిష్యుని విద్యవలన పుట్టించుచున్నాడు అన్నట్లు ఆచార్యుడు తిరుమంత్రము ద్వారా స్వరూపజ్ఞానమును గల్గించినప్పుడు ఈయాత్మయొకవస్తువనదగినట్లు జ్ఞానజన్మకలదై, తేనె పాలు అమృతములవలె మిక్కిలిభోగ్యమగునట్టి తిరుమంత్రము వలన లక్ష్మివలె పోషించితిని అన్నట్లు అనన్యార్హశేషత్వాదుల వలన లక్ష్మివలె పోషింపబడి అజ్ఞానజన్మనిచ్చు లౌకిక తండ్రివలె గాక, బంధమోక్షములు రెంటిని కల్గించు వైదికతండ్రి సర్వేశ్వరునివలెనుగాక, ఒకప్పుడును విడనా డక హితపరుడై మోక్షమును మాత్రమే గల్గించునట్టి ఆపద్రక్షకుడగు ఆచార్యుడనెడి తండ్రి, మనుష్యమాత్రులకు దాసుడననెడి మాటమాత్రమును సహింపజాలనట్లు అన్యశేషత్వప్రసక్తిరాకుండ, లోకభర్త విశ్వపతి యని చెప్పబడు శేషశాయియగు సర్వేశ్వరుని, 8 అక్షరములు 3 పదములుగల్గిన తిరుమంత్రమనెడు మంగళసూత్రబంధముతో వరించునట్లు చేయగా, పరమపురుషుడగు సర్వేశ్వ రుడు వరించిన తర్వాత వివాహానంతరము శేషహోమపర్యంతమగు నాల్గవదినమువరకును సంశ్లే షవిశ్లేషలు లేకుండ అనన్యార్హశేషత్వమునకు తగినట్లు అంగీకరించినందున కైంకర్యప్రార్థనను తెలు పునట్టి చతుర్థి అర్థమున ప్రవేశించి, దంపతులిరువురును నొకే ప్రక్కపై నున్నను పరస్పర సంబం ధయోగ్యతలేనట్లు ప్రతిబంధకులగు సోమాదులు మధ్యనుండునట్టి దినమువలెనే శేషత్వజ్ఞాన మున్ను కైంకర్యప్రార్థనయును ఉన్నందున జీవేశ్వరులకు సామీప్యమున్నను కలిసియుండుటకు తగ నియట్లు, ప్రతిబంధకమగు శరీరముగల నాల్గునాళ్ళును గడిపి ఆచార్యునిచే జ్ఞానజన్మను బొందు టచే జన్మభూమియనదగు లీలా విభూతిని విడిచి ఆటవస్తువులతోసహా పుట్టింటిని వదలి అత్తవారిం ట ప్రవేశించునట్లు పరమపదమును జేరుటకై నాయకుడు ముందుపోగా వానితోగూడ అర్చిరాది మార్గమున పోయి, అత్తవారిల్లుచేరగనే స్నానముజేయునట్లు అమృతవాహినియగు విరజానదియందు వాసనారూపమగు మురికి పోవునట్లు స్నానమాడి, స్నానముజేసిన పడుచును భర్తృ బంధువులగు

స్త్రీలువచ్చి యలంకరించునట్లు దివ్యమాలలు దివ్యాంజనము దివ్యచూర్ణము దివ్యవస్త్రములు దివ్య ఆభరణములను గొని 500 మంది దివ్యాప్సరసలు యెదురుగ వచ్చి సర్వేశ్వరునికి భోగ్యమగునట్లు బ్రహ్మాలంకారమొనర్చి, చుట్టునుజేరి మంగళాశాసనమొనర్చి చామరమువేయగా, అలంకరింపబడి ఆదరణతో గొనిపోబడునట్టి పడుచు భర్తృగృహమువద్దకు పోగానే అచ్చటనుండు స్త్రీలు మంగళదీపాదులను వెలిగించుకొని యెదురుగవచ్చి సత్కరించునట్లు మంగళకరములగు పూర్ణకుంభము దీపము మొదలగు వాటిని గొని నిత్యయౌవనలగు మరికొందరు దివ్యాప్సరసలు యెదుర్కొన భర్తృగృహమున ప్రవేశించునట్టి స్త్రీ వలె శ్రియఃపతి యొక్క భోగస్థానమగు వైకుంఠమున ప్రవేశించి వానితోగూడియుండి నిత్యసూరులు అనుభవించునట్టి భోగమును అనుభవించి, ఉభయ విభూతి నిర్వాహకత్వమును సూచింపజేయునట్టి సర్వాశ్చర్యమయమగు దివ్యపర్యంకమున పాదపీఠమున కాలుపెట్టియెక్కి శ్రీ భరతుని అక్రూరుని ఆంజనేయులను ఆదరించి ఆలింగనము జేసికొనినట్టి కౌస్తుభమణి ప్రకాశించునట్టి సుందరమగు వక్షస్థలమునందు భోగ్యమై తేజస్కరమునై వెలుగొందు ఆత్మవస్తువునకు, ప్రక్కన నొకమండ యాధారములేనట్టైన పైకి ప్రాకజాలక భూమిపై పడియుండు లతవంటి యామె తన స్త్రీత్వమును బట్టి చేయునట్టి సంభాషణము ఆరోపితము కాదు, అనగా స్వాభావికమనుట.

కావున స్త్రీత్వము ఆత్మవస్తువునకు స్వాభావికమని యథార్థముగ తెలిసికొనిన వీరు నాయకికగ మాట్లడుట సహజమని యేర్పడుచున్నది.

**అవ** - ఇట్లు స్త్రీతో సామ్యముమాత్రముకాకుండ స్త్రీలలో నుత్తమురాలగు పిరాట్టి (లక్ష్మి)తో సామ్యము పరిశుద్ధాత్మస్వరూపమునకు కలదని స్పష్టముగ తెలుపుచున్నారు.

**36. ఇన్బుమ్ అన్బుమ్ ముఱ్పడువతు కొఋన్దువిడువతాకిఅతు**

స్నేహము ఆనందమును, ముందుపడుటయు వృద్ధిపొందుటయు

**కడిమామలర్ ప్పావై యోడుళ్ళ సామ్యషట్కత్తాలే.**

తామరపుష్పవాసినితోనున్న సామ్యషట్కముచేత.

**వ్యా** - నిరతిశయ భోగ్యురాలగు పిరాట్టికి ప్రియుడగు సర్వేశ్వరుడు ఆమెయందలి ప్రీతిని ఆమెచే నంగీకరింపబడిన చేతనుని వరకును పెంపొందించి యామెకంటెను ఈ చేతనుని మిక్కిలి స్నేహించుటయు ప్రేమించుటయు ఆనందమును గల్గజేయుటయు జేయును. ఇందులకు కారణమేమనగా, పిరాట్టితో నీ చేతనునికి గల సామ్యహేతువులగు అనన్యార్హశేషత్వము, అనన్య శరణత్వము, అనన్యభోగ్యత్వము,సంశ్లేషయందు ధరించియుండుట, విశ్లేషయందు ధరింపజాలకుండుట, వానిచేతనే నిర్వహింపదగి యుండుట, యనెడి ఆరువిధములగు సామ్యమునుబట్టి యుండును.

**అవ - పెరియ పిరాట్టితో సామ్యముమాత్రమేగాక తక్కిన పిరాట్టులు ముగ్గురితోనున్న వీరికి సామ్యముగలదని తెలుపుచున్నారు.**

**37. ఉణ్ణాతు కిడన్దు ఓర్‌మాఱ్ఱైయినాల్ఎన్నుమ్ పీఱుడైయ ముడిక్కురియారోడు**
ఉణ్ణాతు కిడన్దు ఓర్‌మాఱ్ఱైయినాల్ అను,పా.లందు విలక్షణమగు కిరీటధారులగు పిరాట్టులతో
**ఇత్తిరు మణ్డేరన్నవొణ్ణుతల్ పిన్నైకొల్ ఎన్గిఱ వొప్పు తెన్పాల్ నెడుమాడమ్**
లక్ష్మీసమాన భూదేవిసమాన నప్పిన్నసమానఅనెడి సామ్యము తెన్పాల్ నెడుమాడమ్
**కడుఞ్శిలై అమ్బెరి ఊట్టి నీర్ఱొ ఎరిత్త పెరున్దోత్తత్తు ఆరుయిర్ కాకుత్తన్ ఆతియఙ్గాల**
కడుమ్శిలై అమ్బెరి ఊట్టి నీర్ఱొ ఎరిత్త పెరున్దోత్తత్తు ఆరుయిర్ కాకుత్తన్ ఆతియంగాల
**మణ్పురై పొన్‌మాతిన్‌తుకళాడి ఎరుత్తేళ్ఱ్త్ళ్ఱ్ శఱైయినార్ ఎన్నుమవత్తిలే తోన్దుమ్.**
మణ్పురై పొన్‌మాతిన్ తుకళాడి ఎరుత్తేళ్ఱ్త్ళ్ఱ్ శఱైయినార్ అనుపాశురముల తెలియును.

వ్యా - ఉణ్ణాతు ఉఱఙ్గాతు అను నాయ్చ్చియార్‌తిరుమొఴ్ఱి లోని (11-7) పాశురమున జెప్పినట్లు త్రివిక్రమావతారమును తలచుకొనుటచే పరతంత్రురాలగు నామె పొందిన దశను జనకుని కుమార్తెయగు సీతను ఎడబాసి నిద్రాహారములు లేక దోమలు నల్లులు కుట్టినను తెలియనట్లు పడి యుండి శ్రీరాముడు పడునట్లు చేయగల కిరీటధారియగు పిరాట్టి ఆధిక్యమును,
కిడన్దు ఇరున్దు నిన్ఱుఅళన్ద అను (తివాయ్ 2-8-7) పాశురమున జెప్పినట్లు అవాప్తసమస్తకాముడగు సర్వేశ్వరుడు తనను అనేక పర్యాయములు అనుభవించినను తృప్తిపొందక పిచ్చెక్కునట్లు చేయు నట్టి కిరీటధారియగు భూదేవి ఆధిక్యమును,
ఓర్ మాఱ్ఱైయినాల్ అను (తిరువిరుత్త 20) పాశురమున జెప్పినట్లు నిత్యసూరుల తిరువారాధనము నుగూడ లక్ష్యపెట్టక ఉపేక్షించి నీచమగు గొల్లకులమున కృష్ణుడైపుట్టి మృత్యువుతో సమమగు ఆబోతులతో పోరునట్లు చేయగల సామర్థ్యముగల కిరీటధారియగు నప్పిన పిరాట్టి ఆధిక్యమును,
ఇత్తిరు అను (తివాయ్ 4-4-7) పా.న వలె సర్వేశ్వరునితప్ప వేరువిషయమును ఎరుగని సాక్షాల్ల క్ష్మియనదగిన స్వరూపస్వభావములుగల యీమె అనియు మణ్డేరన్నఒణ్ణుతల్ అను (తిరువిరుత్తం 49) పాశురమున జెప్పినట్లు భూదేవితో సమానయనియు.

పిన్నైకొల్ అను (తివాయ్ 6-5-10) పాశురమున నప్పిన్నయా? భూదేవియా? లక్ష్మియా? యనదగినట్లు వీరికిగల సామ్యము .

తెన్పాల్ అను (తిరువి 87) పా .న శ్రీరామచంద్రుని విడుచుటచే భాధకపదార్థముల వలన బాధపడుటను, నెడుమాడమ్ అను (తిరువి 36)పా . న ప్రీతిలేకున్నను సామాన్యమగు కృపయును లేదా ? అని క్రౌర్యము దెల్పుటయును.

కడుఞ్శిలై అను (తివాయ్ 5-4-3) పా. న శత్రువులయందు తాను దయతలచినను దయ తలపని ధనస్సుగల రామచంద్రుడు రాలేదని కష్టపడుటను,

అమ్బెరి అను (తివాయ్ 4-2-8) పా. న లంకాపట్టణమును దహింపజేసిన శ్రీరామచం ద్రుని శ్రీపాదములమీది తులశికై యాశపడుటను, ఊట్టి అను (తివాయ్ 2-1-3) న లంక యంతయు అగ్నికి విందు జేసినవాని శ్రీ పాదములకై ఆశబడిన నేను పొందినదానినే నీవున్ను పొందితివా

యని తనతోబాటు దుఃఖించునట్టి వారిని కౌగిలించుకొని దుఃఖపడుటయును,

నీర్మై (తివాయ్ 6-1-10) న సాటిలేని యుద్ధముజేసిన రావణుడు తనకు రక్షకముగనుంచుకొనిన కోటగోడను పడగొట్టిన ప్రసిద్ధమగు శౌర్యముగల శ్రీరామునికి వాని రక్ష్య వర్గములో నేనొకతెనున్నానని విన్నవించుమని తనయొక్క దూతను పంపుటయు, ఎరిత్త (తివాయ్ 4-8-5) న ఐశ్వర్యగర్వితుడగు రావణునియొక్క నగరమును దహించి పట్టాభిషేకమొనర్చిన శ్రీరాముడు ప్రేమింపని జ్ఞానము వలన నేమి ప్రయోజనమని స్వామికి ప్రీతికరములుగాని వాటిని ఉపేక్షించుటయు,

పెరున్దోత్తత్తు (తివాయ్ 6-6-9) న శ్రీరాముని సౌందర్యమున కాశబడి తన శరీరకాంతిని కోల్పోవుటయు,అరుయిర్కాకుత్తన్ (తివాయ్ 6-5-6) న నాకు ప్రాణభూతుడగు శ్రీరాముడు నాతోకలిసి యెడబాసిన యీదశయందు వాని తిరునామమును జెప్పి కష్టపెట్టకుమా యని చిలుకను నిషేధించియు అతియఙ్గాలత్తు (తివాయ్ 4-2-6) న వరాహకల్పాదిన మహాపృథివిని అండభిత్తినుండి విడిపించిన మహాపురుషుని శ్రీపాదములందు సమర్పించిన తులశిని పలుమాఱు చెప్పునట్లు పిచ్చెక్కుటయును,

మణ్పురై (తివాయ్ 6-6-5)న సర్వేశ్వరునికై యాశబడి జ్ఞానమునుపోగొట్టు కొనుటయును, పొన్మాతిన్ తిరువిరుత్తం 50 పా. న శ్రీభూనాయకుడు తాను ధరించిన తులశిని మాకొప్పులనుయట యెన్నటికో యనియు,

తుకళాడి (తిరువిరుత్తం 55) పా . న అద్వితీయ వరాహమై ప్రళయమునొందిన భూమినుద్ధరించునప్పుడు స్వామి దేహమున భూమి చిన్న నలుసుగ దోచునట్లు జేసిన అతిమానుషచేష్ట ననుభవించెడి యీమె సాటి ఉభయవిభూతులలో నెచ్చటనైనను కలదా యనదగినట్లును,

ఎరుత్తేళ్తళ్వీ (తివాయ్ 4-2-5) న వృషభముల కౌగలించుకొనుట మొదలగు అతిమానుష చేష్టలుగల శ్రీకృష్ణుని తులశికై ఆశించి నానాటికి శుష్కించుటయు,

శత్తైయినార్ (తివాయ్ 4-8-4) న గోపకుడై ఆశ్రితరక్షణకై తన శరీరమును గమనింపక తిరిగెడి శ్రీ కృష్ణుడు ప్రేమింపని సౌందర్యము నాకు అక్కఱలేదనియు,

ఈ విధమగు శ్రీసూక్తులచే నమ్మాళ్వార్లకు పిరాట్టులతో సామ్యము స్పష్టముకాగలదని తెలియుచున్నది.

**అవ** - నమ్మాళ్వార్లకు పట్టపుదేవులతో సామ్యము మాత్రమేగాక, బృందావన స్త్రీలయొక్కయు మధురాపట్టణపు నాగరిక స్త్రీలయొక్కయు నరకునిచెఱనుండి విడిపించిన పదునాఱువేల రాజకన్యలయొక్కయు, భావనలు వీరికి కలవని తెల్పుచున్నారు.

**38. ఇవర్కళ్ తేడినిఱ్క పొయ్కై ముతుమణల్ ముల్లైప్పన్దల్ ముత్తమ్ మచ్చొదుమాళికై**
ఈపిరాట్టులు వెతుకుచుండ సరస్సు ఇసుకతెన్నెలు జాజిపందిరి ముంగిలి మిద్దె
**అవ్విడమ్పుక్కు వారి శిత్తైత్తు ప్పుఱిత్తు కిళ్ళిత్తు కోయిన్మై**
ఆయాస్థలములజేరి బట్టలను దాచి బొమ్మరిండ్ల చెరిపి బంతిని లాగి రెవికల చింపిస్వతంత్రుడై

**కుఱుమ్బుశెయ్‌తు అల్లర్ విళైత్తు కవరుమ్ ఉకక్కు నల్లవర్ ముఖ్ళిశి ఆవర్**
చిలిపిచేష్టలు చేసి గగ్గోలు పఱచి అనుభవించు ప్రీతులగు గోపికలయు ముఖ్ళిశి ఆవర్
**ఎన్నుమ్ తేన్‌మొళ్ళి యాలేగోకులత్తై మఱప్పిక్కుమ్ నగర స్త్రీకళ్, నరకనై**
అనిన్ను తీయని మాటలచేగోకులమును మరపించునట్టి మధురలోని స్త్రీలను, నరకుని
**త్తులైత్తు కవర్‌న్ద పతినాఱు పల్లాయిరమ్ ఎణ్ణిఱన్దార్ భావమ్ కడల్‌ఞాలమ్**
చంపి స్వీకరించిన 16.పా.లలోచెప్పినట్లు పల్లాయిరం ఎణ్ణిఱన్దార్ భావమున్ను కడల్‌ఞాలమ్
**మిన్నిడై మల్లిగై వేయ్‌మరు పేయ్‌ములై మునిన్దు మఱ్ఱొరు విఱల్‌కణ్ణనై మజ్గనూత్త**
మిన్నిడై మల్లిగై వేయ్‌మరు పేయ్‌ములై మునిన్దు మఱ్ఱొరు విఱల్‌కణ్ణనై మజ్గనూత్త
**వాయుమ్ తీర్ప్పారై ఎన్నుమవత్తిలే తోన్నుమ్.**
వాయుమ్ తీర్ప్పారై అనువానిలో తెలియును.

వ్యా - పట్టపుదేవేరులు తనను వెతుకునట్లు వారిని ఉపేక్షించి, గోపికలు జలక్రీడలాడు తావులను ఆటలాడుకొనుచోట్లను స్వేచ్ఛగ గుమికూడియుండు ప్రదేశములను, సరస్సు, ఇసుకతెన్నెలు, మల్లె పందిరి, ఇండ్ల ముందుప్రదేశముల, ఇంటి మిద్దెలు మొదలగు చోట్ల ప్రవేశించి, స్నానమొనర్చువారల చీరెలగొనిపోవుట, ఆడుకొనువారల ఆటలను చెడగొట్టుట, బంతి బొమ్మలు మొదలగు ఆటవస్తువులను దొంగిలించుట, వారితో కూడి ఆటలాడునప్పుడు చేతికందిన చీరెలను రెవికలను చింపుట ,యు, అణిగియుండక స్వతంత్రుడై ప్రవర్తించుచు అల్లకల్లోలము కలుగుజేసి, గొల్లపల్లెలోని స్త్రీల నందఱను ప్రేమించి ప్రేమింపజేసుకొనిన గోపికాస్త్రీల భావనలెల్ల నమ్మాళ్వార్లకు కలవనెడి విషయము, కృష్ణుని విరహమును సహింపజాలక అతని చేష్టల ననుకరించినట్లు నమ్మాళ్వార్లును వానిని విడువజాలక అనుకరించిన కడల్‌ఞాలమ్ తిరువాయ్‌మొళ్ళి యందును, ఆలస్యముగ వచ్చినందులకు సహింపజాలనట్లు కోపించిన మిన్నిడైమడవార్ పాశురములందును,పగలంతయు పశువులమేపి తిరిగివచ్చెడి వానిని గమనింపక ఒక్క రాత్రి యందు 5 లక్షల ఇండ్లలోని స్త్రీలు వానికేమి యాపదకల్గినదోయని బాధపడిన ప్రాతర్యుద్ధమును వర్ణించిన మల్లిగై యను పాశురములను, గోపికలు రాత్రియంతయు వాని గాఢమగు ఆలింగనములో నుండియే తెల్లవారినట్లును వాడు పశువుల వెంట అడవికి పోయినట్లును భావించి మొఱపెట్టినట్లు సాయంయుద్ధమును వర్ణించు వేయ్‌మరుతోళిణై పాశురములందును పూతనా శకట యరుళార్జునాదుల చంపిన శ్రీ కృష్ణునికి నాస్త్రీత్వమును అర్పించితిననితెల్పెడి పేయ్‌ములైయుణ్ణు మునిన్దశకటముతైత్తు పాశురములందునుతెలియవచ్చును.

శ్రీ మాలాకారులు సమర్పించిన మాలను ధరించియు, కూని సమర్పించిన చందనము పూసుకొనియు మార్గమున కువలయాపీడమను ఏనుగును చంపి నిల్చిన వాని సౌందర్యమును శరీర కాంతిని పరాక్రమమును తలచి మగ్నులై తమలోతాము చెప్పుకొనిన, గోపికల మరపించునట్టి తీయని మాటలుగల మధురయందలి నాగరికస్త్రీల భావన ముఖ్ళిశి ఆవర్ తేన్‌మొళ్ళి పాశురము

లందును మల్లయుద్ధము చందనముచెడకుండ చేసిన ఆశ్చర్యమునకు నాకుమాత్రె తన మర్యాదను చెడగొట్టుకొనినదని మఱ్ఱొరు పాశురమునను, మల్లులను కంసుని వధించిన కృష్ణుని ఆ రసముతోనే అనుభవింప ఆశబడుటను తెల్పిన విరల్‌కంజనై పాశురమునను తెలియవచ్చును.

నరకుని జంపి విడిపించిన రాచకన్యలు పదారువేలమంది భావనయు నాయాపాశురముల ఆళ్వార్లకు కలదనియు,

శ్రీకృష్ణుడు దూతగవెళ్ళినప్పటి యెడబాపునకు దుఃఖించినట్లును, నారపక్షి ఉడుత మొ. వాని స్వభావము తెలియక అ విరహముచే తెల్లబారినవిగ తలచి దుఃఖించుటయు సారథ్యవేషము నకై యీామె మనసు శిథిలమైనదనియు ద్వారకాపతికి మంగళాశాసనమొనర్చిన యీామెబాధ నివ ర్తించుననియు తెలిపెడి వాయున్దిరై తేర్‌పాకనార్కువణ్ణువరావతి తీర్వారై పాశురములనుతెలియును.

అవ - పై వారందరితోను సామ్యము ఒక్కొక్క విషయముననే గాని అన్ని విధములను సీతతో సామ్యము గలదని తెల్పుచున్నారు.

**39.** **ఇరానెనిల్ నచవాక క్కుత్రైత్తవన్ పిన్‌తొడర ఇరుద్ద వన్‌శిఱైయిలుమ్**
ఉండనినిన నిలువలేనట్లు కలిసియున్నస్వామి వెంటవచ్చినట్లు ఉన్న క్రూర చెఱయందు
**విదితన్ పుణై యెన్ఱు జీవితాదికళాల్ కుఱైవిన్ఱి మాయుమ్‌వకై విషశస్త్రజ్ఞళ్ తేడి**
ధర్మజ్ఞుడు స్నేహించుమని జీవితాదులచే ఫలములేక చచ్చుటకై విషశస్త్రములు వెదకి
**విల్‌వలవా హా ఎన్ఱు ఇరక్కమెఱ్ఱా కొడుమై కళ్‌శఙ్కిత్తు ఎన్నైయుమ్ జీవన్దీమెన్ఱు**
వింటి బలశాలీ అయ్యో అని దయలేనివాడని చెడ్డగశంకించి నన్నును జీవించియుంటినని
**ఆళ్‌విట్టు చ్చుడరైయడైన్దు అకలకిల్లా ముత్తువమై పెరుమకళోడే.**
దూతనంపి సూర్యకాంతివలెనంటి ఎడబాయలేనని అన్నిటను శ్రీదేవితోసాటి.

వ్యా - నీటి నుండి బయల్పడిన చేపవలె విడిచియుండలేనట్టి సీతకై శ్రీరాముడు నిద్రాహారములులేక లంక వరకు వచ్చినట్లును, క్రూరమగు చెఱసాలయందు విముఖుడగు రావణునికి, ధర్మమునెఱిగిన వాడు శరణాగతవత్సలుడుగాన రాముని శరణుజొచ్చుమని హితముపదేశించుటచేతను, రాముని విడిచి రాక్షసస్త్రీలమధ్యనున్న నాకు ప్రాణము ఆభరణములు మొదలగువానిచే ప్రయోజనమేమని విరహాతిశయముచే చనిపోవుటకుపయోగించు విష శస్త్రాదులను కోరుట చేతను, సాటిలేని ధనుర్ధ రుడా ఓ రామచంద్రాయని మొఱబెట్టుటచేతను, దయలేనివాడా యని రాముని శంకించుటచేతను, చనిపోవుటకు ముందుగనే వచ్చి రక్షింపమని దూతద్వారా తెలుపుటచేతను సూర్యుని విడిచి కాంతి యుండజాలనట్లు రాము నెడబాసి జీవించలేననుటచేతను నిరుపాధిక స్త్రీత్వముగల సమ్మాళ్వార్లకు ఆయా పాశురములలో నీ యవస్థలెల్ల కలుగుటచే వీరికి అన్నివిధములను సీతతో (పెరియపిరాట్టితో) సామ్యము కలదని తెలియనగును.

**అవ** - స్వామిని విడిచి యుండలేకపోవుటలో పిరాట్టివలె వీరొక్కరేనా ? వేరెవ్వరైన కలరా? యనిన తెల్పుచున్నారు.

**40. పిరియిల్ ఇళేనుక్కు ఇళఙ్గోవుమ్ అక్కుళత్తిల్ మీనిణే.**

ఎడబావున నిలువలేమికి లక్ష్మణుడును ఆగుంటలోని చేపయేగదా.

వ్యా - ఓ రాజా నీటిని విడిచిన చేపవలె నిన్నువిడిచి యుండలేనివారమే నేనును సీతయు, అనుటచే లక్ష్మణులతోను ఆళ్వార్లకు సామ్యము కలదని భావము.

**అవ** - సహజమగు భక్తిగల శ్రీలక్ష్మణ భరత శత్రుఘ్న దశరధ యశోద ప్రహ్లాద విభీషణ ఆంజనేయ అర్జునాదులతోను ఆళ్వార్లకు సామ్యము కలదనుచున్నారు.

**41. అழுమ్ తొழுమ్ స్నేహ బాష్పాంజలియోడే రుచిర సానుక్కళిల్**

ఏడ్చును దండమిడును స్నేహపు కన్నీటి నమస్సుతో అందమగు కొండచరియల

**కూవిక్కొళ్ళుమ్ పిరియా అడిమైక్కు చ్చరణే శరణెన్ఱు వాళుమ్ విల్లుమ్కొణ్డు**

ఆజ్ఞాపించి ఎడతెగని సేవలజేయ పాదములే రక్షయని కత్తిని విల్లును గొని

**బన్ధువుమ్ పితావుమ్ అవరే యెన్ఱైయుమ్, అన్నైయెన్శెయ్యిల్ఎన్**

బంధువును తండ్రియు రాముడే అన్నలక్ష్మణుడు తల్లి ఏమి చేసిన నేమి

**రాజ్యముమ్ యానేయెన్ఱు పెరుమ్శెల్వముమ్ ఇచ్ఛియామల్ వేణ్డిచ్చెన్ఱు**

రాజ్యమును నేనుశేషమని గొప్ప సంపదనున్న కోరక కోరివెళ్ళి

**తిరువడియే శుమన్దు విరైన్దు వరుమళవుమ్ కణ్ణనీర్ పజ్కమాక నిలమ్ తుழாవి**

పాదుకలనే ధరించి ప్రీతితో వచ్చువరకును కన్నీటితో బురదకాగా భూమిని తడిమి

**కుడిక్కడన్ద కైయలవుమ్ కోతిలడిమై ఉయిమో వెన్పిత్త పులన్గొళ్**

కులమర్యాద దాటక చేయిజారినభరతుడు చెడ్డలేనిసేవ తగునా జయించిన ఇంద్రియాల

**నిత్యశత్రు విచిన్తనమాన భ్రాతాక్కళ్ అప్రాప్తులై క్కప్రాప్తుతు పోనాయ్ ఎన్ఱుమ్**

నిత్య శత్రువును నిత్యము తలచెడి సోదరులు అత్యప్రాప్తమైనతమై పోతివి అని

**మాతాపితాక్కళ్ శెన్ద్రీ త్తణ్గాత్తు ఇళనాకమ్ ముతలాన పకైయఱ చ్చిన్తైశెయ్తు**

తల్లిదండ్రులు అగ్ని చల్లగాలి కోడెనాగు మొదలగునవి పగలేక తలచి

**ఎఙ్జుముళనెన్ఱుమ్ పళ్ళిప్పిళ్ళై ముత్తువిట్టు మత్తిలేన్ ఎన్ఱుమ్ ధర్మాత్మా వాళి**

అంతటనున్నాడనియు ప్రహ్లాదుడు మొత్తమువిడిచి వేరెఱుగను అనిన విభీషణుడు బాణముల

**ప్రాప్తిన్ద నిర్గుణ విశ్వాత్మా ఉళ్ళే ఉఱైయ ఊణాక వీరచరితమ్ కళ్ళార్**

వర్షించిన దోషరహిత అంతర్యామిగ లోన నివసింప భోగ్యముగ వీరచరితము నెఱిగి

**భావమ్ మత్తిలేన్ ఎన్ఱుమ్ రామదాసన్ పల్ వకైయుమ్కణ్డు వెణ్ శెజ్గన్దిన**

భావము వేరుచోటలేదనిన హనుమ పలు విధముల జూచి తెల్లనిశంఖు ధరించిన
**రూపపరనాన శ్వేతన్ ముతలానార్ పడికళుమ్ కాణలామ్.**
రూపమునసక్తుడగు అర్జునుడు మొదలగువారి విధములు చూడవచ్చును.

వ్యా - బాల్యమునుండియు శ్రీరాముని విడువజాలని స్నేహముచే కన్నీటితో చేతులుజోడించి నిల్చియు మీఇష్టమైనచోట పర్ణశాలనిర్మింపుమని యాజ్ఞాపింపుడనియు నీవు సీతతో చిత్రకూటమున విహరించునప్పుడుగాని నిద్రించినప్పుడు మేల్కొనినప్పుడుగాని సర్వవిధసేవల నేనే చేసెదనని యు, నన్ననుచరునిగ గొనుమని రాముని పాదముల బట్టుకొని సీతను ప్రార్థించియు, ఆయుధము ధరించి వారివెంటనంటియు రాముడే నాకు సర్వవిధబంధువనియు తలచిన లక్ష్మణులవలెనే నమ్మాళ్వార్లును అళుమ్తొళుమ్ (తివాయ్ 7-2-8) కన్నీరు కార్చుచు నమస్కరించును, ముకప్పేకూవి ప్పణికొళ్ళాయ్ (తివా 8-5-7) దగ్గరకు జేరి ఎడతెగని సేవను గొనుటకు ఆయుధముగొని వెంబడించ నాశించి, శేలేయ్ కణ్ణియరుమ్ (తివా 5-1-8) సర్వేశ్వరుడే సర్వవిధబంధువని తెల్పుటచేత నమ్మాళ్వార్లు లక్ష్మణులతో సాటి - శ్రీభరతులు పట్టాభిషిక్తుడైన శ్రీరామునకు సేవలొనర్చి సంతసింపగోర నాతనికి వ్యతిరిక్తముగ కైకేయి శ్రీరాముని అరణ్యమునకుబోవజేసిన దౌష్ట్యమునకు తల్లిని సహింపనట్లును, దశరధుడు మృతినొందగనే రాజ్యమేలుటకు వశిష్ఠాదులు నియమింప రాజ్యమునందిచ్ఛలేక నేనును రాజ్యమును రామునిసొత్తేనని శ్రీరామునిగొనివచ్చి పట్టాభిషిక్తు నొనర్చనపేక్షించి మంత్రులతో రామసన్నిధికిబోయి వేడినను నాతడంగీకరింపక పాదుకలనొసంగ సంతసముతో రధమునెక్కినట్లును, రాముడు తిరికివచ్చు వరకును కన్నీటిచే నైన బురదలో పడియుండి, జ్యేష్ఠుడుండగా కనిష్ఠుడు పట్టముగట్టుకొనుట తగదనెడి ఇక్ష్వాకువంశమర్యాద నతిక్రమింపక తనకోరికనెరవేరలేదనెడి కొరతతో నున్న భరతునివలె -

నమ్మాళ్వార్లును భగవానుని తప్పుదారిననైనను పొందగోరు త్వరకు అడ్డగించెడి తల్లిని శత్రువుగ జూచుటచేతను నేనును నా శరీరమును నీవేయని సంపదల నగ్నిగ తలచి వేంకటాచలపతిని జూడగోరి పోయి సేవించి సంతసించి యాతడు పరమపదమునకు గొనిపోవుటకై వచ్చువరకును కన్నీటి బురదలో బడి సహింపక భూమిని గీరుచు ప్రపన్నకులమర్యాదనతిక్రమింపక తాము కోరినది చేజిక్కని కొరతతో నుండుటచే భరతులతో సాటి -

శ్రీశత్రుఘ్నులు రామసౌందర్యమున మనసుపోనీయక భరతునియందే యుంచియు నిత్య శత్రువగు రామసౌందర్యము భరతులకెక్కువ ఇష్టమగుటచే నాతని ప్రీతికై దాని నాదరించినట్లు -

నమ్మాళ్వార్లును భగవానుని భక్తులు చిన్నవారైనను నాకు రక్షకులు వారే యనియు అట్టివారిచ్చటనే తిరుగుచుండ వారిని విడిచి సర్వేశ్వరుని పాదముల నాశ్రయించుట తగునా ? యనియు, భాగవతుల కిష్టమను తలంపున పులజ్గొళ్ వడివున్ మనిత్తతాయ్ యనుచోటను యింద్రియముల నాకర్షించు భగవంతుని దివ్యమంగళ విగ్రహము నామనసులో నున్నదనుటచే -
:-లక్ష్మణ భరత శత్రుఘ్నుల సామ్యము నమ్మాళ్వార్లుకు కలదని తెలియుచున్నది -

దశరథ చక్రవర్తి శ్రీ రామచంద్రుడు వచ్చుచుండగా రెప్పవాల్చక చూచుచు తృప్తి నొందక యింకను అనుభవింప నాశించునట్లు శ్రీనమ్మాళ్వార్లును అప్పొళ్తుతుక్కప్పొళ్తుతు ఎన్నారావము తమే అప్పటికప్పుడు నాకు తృప్తితీరని అమృతమువంటివాడని భగవానుని యనుభవించుటలో తృప్తితీరని విధమును తెల్పుటచే శ్రీనమ్మాళ్వార్లకు దశరథునితో సామ్యము కలదనుట -

శ్రీకృష్ణుడు యమళార్జునములనెడి మద్దిచెట్లమధ్యగ పోవుటకు భయపడి పరుగిడిపోయి పిల్లవానిని యెత్తుకొని వచ్చుచు ఈ పెద్ద మద్దిచెట్లమధ్యను పోతివే అని చెప్పుచు భయపడినట్లు శ్రీ నమ్మాళ్వార్లును ఎప్పుడో జరిగిపోయిన మద్దుల మధ్యన పోవుటను తలచి యప్పుడే జరుగుచున్నట్లు భయపడి పోనాయ్ మరుతికళ్నడువే, (పోతివి మద్దుల మధ్యను), అనుటచే యశోదానందుల అధ్యవసాయము వీరికి కలదని తెలియనగును -

ప్రహ్లాదుడు అగ్ని చలి గాలి మొదలగు బాధక పదార్థములయందు విరోధ బుద్ధిలేక వాని యందంతర్యామిగగల భగవానునే దర్శించినట్లు నమ్మాళ్వార్లును అగ్నిని కౌగిలించుకొని అచ్యుతుడనును, చల్లని గాలిని స్పృశించి గోవిందుడనును, పోవుచున్న యౌవనపు సర్పము వెంటపోయి శ్రియఃపతి పడక యనును మొదలగు వానిచే భగవదాత్మకములుగ నన్నిటిని తలచుటచే ప్రహ్లాదునితో సామ్యము వీరికి కలదన దగును -

విభీషణుడు లంకతో సహా దారాపుత్రాదులెల్లరను త్యజించి శ్రీరాముని శరణుజొచ్చినట్లు అళ్వార్లును తయరతఙ్కుమనన్తన్నైయన్ఱి మత్తిలేన్ తంజమాకవే దశరథుని పుత్రునికన్న మరియొకరిని రక్షకముగ తలచననుటచే విభీషణులతో సామ్యము చెప్పవచ్చును -

ఆంజనేయులు శ్రీరామావతారమును తప్ప మరొకదానిని (పరమపదమున్ను) తలచను అన్నట్లు నమ్మాళ్వార్లు ఇరామపిరానైయల్లాల్ మత్తుంకఱ్పరో శ్రీరామచంద్రునితప్ప మరొకటిని నేర్తురా? యనుటచే ఆంజనేయులతో వారికి సామ్యము -

అర్జునుడు సంతోషమునకు భయమునకు హేతువగు విశ్వరూపమునుజూచి పరిచయము గల వెనుకటిశంఖచక్రాదులధరించిన రూపమునే జూడగోరినట్లు వీరును విరుద్ధవిభూతియోగమును దర్శించి కూరార్ాళివెణ్శఙ్గేన్ది వారాయ్ పదునగు చక్రమును తెల్లని శంఖమును ధరించి రమ్ము అనుటచే వీరికి అర్జునునితో సామ్యము -

**అవ** - పైన చెప్పిన వారందరికంటెను ఆధిక్యమును తెలుపుచున్నారు.

**42. కుళ్లలిల్ నెఞ్జమ్ అరుకలిల్ శువైయుమాన ఇవర్కళ్అళవల్లర్.**

కుళ్లలిల్ పా.న మనస్సును అరుకలిల్ పా.న రసమునుగల్గి, వీరల మాత్రమేకారు.

**వ్యా** - తిరువిరుత్తమున 3వ పాశురమున జెప్పినట్లు పిరాట్టులు నిత్యసూరులు సర్వేశ్వరుడు చేరియున్న గోష్ఠి యందు లగ్నమైన మనస్సు గలవారై, తివాయ్ 1-9-3 పాశురమున జెప్పినట్లు పిరాట్టులు ఆంజనేయులు ఆదిశేషువు మొదలగువారితో ఒక్కొక్కరితో నొక్కొక్క రసమువలెగాక అన్ని

విధములగు సంశ్లేషరసములును నాచే ననుభవింపజేసినాడనుటచే భగవద్భాగవత గోష్ఠి రసమెరు గని పైవారికంటెను వీరు విలక్షణులని యెరుగదగును.

**అవ** - ఇట్టి మనస్సున్ను రసమున్నుగల వీరు అవతరించి అనేక కైంకర్యముల జేయు నట్టి అనంత గరుడాదులవలె తామని తలతురనుచున్నారు.

**43. ఎత్తైక్కుమ్ ఎన్దతు తోన్ఱ ప్పిఱన్దు ఒప్పిత్తు వీశి కాప్పిట్టు క్కాట్టుక్కు**
ఎప్పటికిని అనుట తెలియ అవతరించి అలంకరించుకొని విసిరి రక్షపెట్టి అడవికి
**ముఱ్పట్టు ధర్మమ్‌శొల్లి కేట్టు శిష్యా దాసీ భక్తైకళాయ్ పాడి వరుడి ఇన్దువన్దు**
ముందుబడి ధర్మముచెప్పి విని శిష్యురాలు దాసీ భక్తురాలునై పాడి కాళ్ళుపట్టి నేడువచ్చి
**ఎన్బారైయుమ్ శెన్ఱాల్ ఊరుమ్ నివాసదాస భేదమ్ కొళ్వారైయుమ్**
అన్న భూదేవినిన్ని శెన్నాల్ ఊరుం పా. వలె నివాసదాస శ్లో. శరీరభేదము గొనినవారివలె
**తాన్ అవనాక భావిప్పర్**
తాము వారుగ భావింతురు.

**వ్యా** - (ఎత్తైక్కుమ్) ఎప్పటికిని ఏడేడుజన్మలకును నీతోగూడియేయుండి నీకే సేవచేతును అనిన ఆండాళ్, భూదేవి అంశ యగుటచే ఉపలక్షణముచే శ్రీ భూ నీళలను-

భగవానునకు తగినట్లుగ రాముడైన సీతగ నవతరించి పట్టాభిషేకమునకై నలంకరించి చామరము వీచి దశరధుని ఇంటి కేగునప్పుడు ద్వారము వరకు వెంబడించి మంగళాశాసనమొ నర్చి అరణ్యమునకు పోవునప్పుడు ముందుగ నడతునని వెంబడించి, ఆయుధముల ధరించుట విరోధమున కగునని ధర్మముపదేశించిన సీతను -

శ్రీవరాహస్వామివలన పరమధర్మమును విని శిష్యదాసీభక్తురాలునై ఉన్దన్నైప్పాడి అన్నట్లు కవిత్వముచెప్పి కాళ్ళుపిసికిన భూదేవిని-

భూదేవి అవతారమై ఇచ్చటికి వచ్చి వీనిని ఆరగించినచో నూరువేలుగ నిచ్చుటయేగాక దాసినై సేవజేతునన్న ఆండాళ్ళును-

శెన్ఱాల్కుడైయామ్ (వెళ్ళిన గొడుగగును) అను పాశురమునను ఊరుమ్ (తిరుగును) అను పాశురమునను, నివాసశయ్యాసన, దాసస్సఖా శ్లోకములందువలె సర్వవిధసేవలొనర్చుటకై గృహము ప్రక్క సింహాసనము పాదుకలు ఉత్తరీయము తలగడ(దిండు)యై, చలికి ఎండకు తగినట్లు శరీరమును మార్చుకొనెడి ఆదిశేషువును -దాసుడు స్నేహితుడు వాహనము ఆసనము ధ్వజము వి తానము (చాందినీ)వ్యజనము(విసరుకర్ర)లుగ శరీరమునుమార్చుకొని సేవలొనర్చెడి గరుత్మంతుని, శ్రీనమ్మాళ్వార్లు సర్వవిధసేవలొనర్చుటయందు ఆతురతగలవారుగ తమను పైవారలతో ఒక్క భేద మును లేనియట్లు తలతురు.

**అవ** - సర్వేశ్వరుని తిరుమేని సౌందర్యము ఆళ్వార్ల పుంస్త్వమును చెడగొట్టి స్త్రీభావనను గల్గించుటకును, ఈశరీరముతోనే సకలవిధకైంకర్యములు లభించుటకును ద్రౌపది కౌసల్యలను దృష్టాంతముగ జెప్పుట స్థూలదృష్టి మాత్ర మగుననుచున్నారు.

**44. ఎఝువతు ఓర్ఉరు అఝ్గి క్క శెయ్‌కిఱ వఝువిలా అడిమైక్కు పాఞ్చాలి**
ప్రకాశించు దివ్యరూపము చెఱుప చేయగోరు విడువులేని సేవలకు ద్రౌపది
**పడుత్తుమతుమ్ కౌసల్యానువృత్తియుమ్ ఒప్పాకుకై పరిశు.**
చేయునదియు కౌసల్య అనుసరణయును సాటియనుట స్థూలము.

**వ్యా** - భగవానుని తేజోమయమగు అప్రాకృత దివ్యమంగళవిగ్రహము పురుషుల దృష్టులను చిత్తములను అపహరించి స్త్రీ భావనగల్గజేయునది యగుటచే ఆళ్వార్లు తామొక నాయికాభావనను పొంది విచ్ఛిత్తిలేని కైంకర్యమును జేయగోరుటలో ద్రౌపది స్నానసమయమున నామె పిరుదుల సౌందర్యమును జూచిన స్త్రీలు తమను పురుషులుగ భావించుకొనుటయును, కౌసల్య తన భర్త యగు దశరధునకు దాసి సఖి భార్యవలె సకలవిధ సేవలొనర్చుటయు మాటమాత్రమునకేని సాటిగా వనుచున్నారు. అనగా ఆళ్వార్ల భావనయే ఉత్కృష్టమని దెల్పుట.

**అవ** - ఆళ్వార్లు ఇట్టి అవస్థాంతరమును బొందినను తమ నిజస్థితి లోని అభినివేశమునకు లోపము గల్గదని సోదాహరణముగ దెల్పుచున్నారు.

**45.** పెరుక్కాఱు పల **తలైత్తు** కడలై నోక్కుమాపోలే నెక్కొశిన్దు కరైన్దు **అలైన్దు**
పొంగునదిపలుగ ప్రవహించి కడలిని చేరునట్లు శిథిలమై కరిగి తల్లడిల్లి
**ఇడిన్దుడైయ పెరుకుకాతల్ కడల్ ఇడఙ్గొణ్డ కడలై బహుముఖమాక**
రూపుమాయునట్లు పెరిగినప్రేమ కడలి నివాసియగు స్వామిని అనేకరీతులుగపోయి
**అవగాహిక్కుమ్.**
ప్రవేశించును.

**వ్యా** - వెల్లువ వచ్చిననది, అనేక రీతులుగ ప్రవహించి విశాలమగు సముద్రము వైపునకే ప్రవహించునట్లు శరీరము శుష్కించి, ఆభరణములు వదులై జారి, శిధులులై పరవశులై ద్రవీభూతులై ఒక్కతావని లేక మనస్సు చలించి, శరీరము రూపుమాసి పోవునట్లు, పొర్లిపోవునట్లు వృద్ధిపొందిన ప్రీతి, ఒక సముద్రము మరియొక సముద్రమున ప్రవేశించునట్లు పాలసముద్రమున నిద్రించునట్టి శ్రమహరమైన దివ్య దేహముగల శ్రీమన్నారాయణుడను అపరిచ్ఛేద్యవస్తువును తన స్వాభావికస్థితి వలనను అవాంతరభేదమువలనను అనేకవిధములుగ పోయి ప్రవేశించుటచే అన్ని అవస్థలందును ఆళ్వార్లభక్తి వైభవము ప్రతిపాదింపబడినది.

అవ - ఆళ్వార్లభక్తి శాస్త్రములందుజెప్పినట్లు గాక క్రమముతప్పినదై, శాంతముకానిదై, అనేకరీతులుకల్గియుండుట ఏల? యనిన తెల్పుచున్నారు.

46. అచ్ఛేద్యమెన్నువతు ఈరుమ్ వేమ్ ఈరియాయ్ ఉలర్త్త ఎన్నప్పడ
ఛేదింపబడని ఆత్మ బ్రద్దలగుచున్నది కాలుచున్నది ఆర్ద్రమైనది ఎండినది అనునట్లు
చిత్తమ్ శిత్తాయ్ అల్లేనెన్న నీఙ్గ కరణఙ్గళ్ ముడియానేయిల్ అవైయాక
మనస్సు చేతనమై అనుకూలించనని ఎడబాయ ఇంద్రియములు ముడియానేయందువలెకాగా
ఉడలమ్ ఆత్మధర్మమ్ కొళ్ళకాత్తుమ్ కళ్ళియుమ్ కట్టియణ్ణక్కొణ్ణ పెరుఙ్గాతలుక్కు
శరీరము ఆత్మధర్మమునుగొన గాలిని ఉప్పుమడిని కౌగలించుకొనునట్లుచేయు గొప్పభక్తికి
ప్పత్తిమై నూల్ వరమ్బిల్లైయే.
శాస్త్రోక్త క్రమములేదుకదా.

వ్యా - ఛేదన దహన క్లేదన శోషణములకు చెడనిదిగా చెప్పబడిన ఆత్మ వస్తువు, సర్వేశ్వరుని స్వభావము స్మరణమునకు వచ్చి బ్రద్దలై, నిప్పువద్దనున్న మైనమువలె కరుగుచున్నదనియు, ఆర్ద్రమగుచున్నదనియు, ఎండిపోవుచున్నదనియు, చిగురుటాకువలె శుష్కించుచున్నదనియు చెప్పుటచే, అచేతనమగు మనస్సు చేతనుని వలెనై సర్వేశ్వరుని విడనాడిన నీకు నేనింద్రియముగా నుండనని విడిచి పోగా, బాహ్యేంద్రియములు చైతన్యముగలవానివలె ఒకదాని వ్యాపారమునుగూడ మరియొకటి యాశపడినట్లు ఆతురపడి, భగవత్ప్రీతిపారవశ్యముచే కలతపడి కృత్యాకృత్యములెఱుగక నిదిధ్యాసితవ్యః అను శాస్త్రముచే విధింపబడి చేతనునిచే సాధింపదగి క్రమ పరిపాకమగు భక్తి వంటిదిగాక దానికంటెను విలక్షణమై పొరలిపోవునట్టి ఆళ్వార్లభక్తి శాస్త్రమర్యాదకు లోబడినదికాదని తెల్పిరి.

అవ - ఇట్టి భక్తి గల ఆళ్వారునాయకి, చెలి తల్లి కుమార్తె అని మూడు విధములుగ మాట్లాడుటలో నభిప్రాయమేమన తెల్పుచున్నారు.

47. సమ్బన్ధోపాయ ఫలఙ్గళిల్ ఉణర్త్తి తుణివు పతత్తమ్ ఆకిఱ ప్రజ్ఞావస్థైకళుక్కు
సంబంధఉపాయ ఫలములందు జ్ఞానము నిశ్చయము త్వర అను ప్రజ్ఞావస్థలకు
తోழ் తాయార్ మకళ్ ఎన్ను పేర్.
చెలి తల్లి కుమార్తె అని పేర్లు.

వ్యా - సఖి యనగా, నాయకీ నాయకులను చేర్చునది, అగుటచే తిరుమంత్రమునందలి. మొదటి పదమగు ప్రణవముచేత సర్వేశ్వరునితో చేతనునకుగల అనన్యార్హశేషత్వరూపసంబంధమును తెల్పు సంబంధజ్ఞానమే చెలి యవస్థ యనబడును.

తల్లియనగా, కని పెంచి కుమార్తె యౌవనురాలై నాయకునియందలి ప్రీత్యతిశయముచే

వాడున్నచోటును వెదకుచు పోవలెనని ప్రయాణమగు నప్పుడు వాడే వచ్చువరకును వేచియుండ వలెనే తప్పగడపదాటిపోవుట కులమర్యాదకు విరుద్ధమని అడ్డగించునట్టిది. అగుటచే తిరుమంత్రము నందలి మధ్యమపదమగు నమః చేత సర్వేశ్వరుని వైలక్షణ్యమును జూచి క్రమప్రాప్తిని సహించక త్వరపడునప్పుడు ఇది ప్రపన్నకుల మర్యాదకు తగదని నిషేధించి వాడేవచ్చి విషయీకరించువర కును వేచియుండవలెనని స్వాతంత్ర్యమును పోగొట్టెడి ఉపాయాధ్యవసాయ (సిద్ధోపాయ) నిష్ఠ యే తల్లియవస్థ యనబడును.

కుమార్తె యనగా, యాదృచ్ఛికముగ నాయకుని కల్సుకొని వాని అతిశయమునందు ప్రీతి గల్గి కులమర్యాదనున్ను గమనింపక నాయకుని పొందినగాని ప్రాణములు నిలువని త్వరాతిశయము గలది. అగుటచే నిది తిరుమంత్రమునందలి చివరిపదమగు నారాయణచే తెల్పబడు సర్వేశ్వరుని స్వరూప రూప గుణ విభూతుల వైలక్షణ్యమును అనుసంధించి వానిని అనుభవించుటలోని ఆలస్య మును సహింపక వాడే ఉపాయమను నిశ్చితబుద్ధిని అతిక్రమించి చెంతజేరి అనుభవించిననేగాని ప్రాణములను ధరించియుండజాలనట్టి ప్రాప్యత్వరయే కుమార్తె యవస్థ యనబడును.

ఈమూడు అవస్థలును తిరుమంత్రముయొక్క మూడు పదములచే తెల్పబడుటచే వీనియర్థ మును మనస్సున నెల్లకాలమును తలచుచుండవలెనని యర్థము.

**అవ** - ఈ మూడు అవస్థలును ఆళ్వార్ల మాటలచే తెలియవచ్చునా? అనిన సఖి తల్లి కుమార్తెలవలె మాట్లాడు తిరువాయ్‌మొళ్ళిలయందు నివి తెలియువచ్చుననుచున్నారు.

**48. సఖి వెళి విలక్కి ఆశై అఱుత్తు అఱుత్తొదునిన్ఱ మూన్ఱిల్ అనన్యార్హత్వముమ్**
చెలికత్తె అన్యశేషత్వమును ఆశనుపోగొట్టి అనన్యతనుదెల్పు మూటియందును అనన్యార్హత్వమున్ను,
**వాడి మెలిన్దు పిత్తేఱి ఏఱప్పేశి కట్టిఴన్దు అకన్ఱు శార్వతేవలిత్తమై సాధనమామో**
వాడి శుష్కించి పిచ్చెక్కి అర్తిగచెప్పి హద్దుదాటి ఎడబాసి చనిపోదలచుట సాధనమగునా?
**ఎన్ఱు మాతా అఞ్జి ముఱైప్పట్టు ముఱైయిడుకిఱ ఏఴ్ఱిల్ అధ్యవసాయముమ్, పుత్రి**
అని తల్లి భయపడి మొఱపెట్టి ప్రార్థించునట్టి ఏడిటన నిశ్చయమున్ను, కుమార్తె
**పలకాల్ ఆళ్‌విట్టు ఆత్తామై శొల్లి క్కవరాతవై విట్టు ఇరైక్క మడలెడుత్తు**
పలుమార్లు దూతలనంపి సహింపలేమినిదెల్పి ఆదరించనివి విడిచి క్షోభింప సాహసమొనర్చి
**క్కణ్ పుతైయ పోక్కత్తు ఉరు నెఞ్జుళ్ళెఴ కూదునాళ్ తేడి తార్హ్ త్తతుక్కు**
కనులుమూతబడ గతిలేక రూపము మనసుకురాగా కూడురోజు వెదకి ఆలస్యమునకు
**ఊడి ఉశాత్తుణై అత్తు శూఴవుమ్ పకైముకమ్‌శెయ్య తడైనిల్లాతే పుయక్కత్తు**
కోపించి సాయములేనిదై బాధకములు బాధింప తల్లిని సఖిని యెదిర్చి చావదలచి
**మాలైయుమ్ కాలైయుమ్ పూశలిడుకిఱ పతినేఴ్ఱిల్ త్వరైయుమ్ తెరియుమ్.**
సాయంకాలము ఉదయకాలము మొఱపెట్టునట్టి పదినేడునందును ప్రాప్యత్వర తెలియును.

వ్యా - చెలికత్తెయొక్క అనన్యార్హశేషత్వ సంబంధజ్ఞానరూపమగు అవస్థను తెలియబఱచు తిరువాయ్మొళ్ళులు మూడు. అవి (1) తీర్ప్పారైయామిని(4-6), (2) తువళిల్మామణి (6-5), (3) కరుమాణిక్కమలై (8-9)

ఇందు (1) తీర్ప్పారైయామిని పిరాట్టి యాదృచ్ఛికముగ సర్వేశ్వరునితో కల్సి పిమ్మట యెడబాపును సహింపలేక మూర్ఛిల్లియుండగా, తల్లి కుమార్తె కష్టమును అందులకు హేతువును (కారణమును) పరిహారమును తెలియక విరుద్ధభాషిణియగు ఎరుకల సోదికత్తె చెప్పినట్టి మాటచొప్పున నీమె కష్టమునుబాప ఆవేశమువచ్చినట్లాచరింప, యీమె స్వభావమెరిగిన ప్రాణస్నేహితురాలు యీమెకు అన్యస్పర్శము తొలగింపకున్న బ్రతుకదనితెల్పి అందులకు తగిన పరిహారమున్ను విధించి అచ్చట హేయమైన కల్లును మాంసమును ఉంచవలదనియు, ధాన్యము పాడగునట్లు గాడిద నోటి చలనము జూచి ఫలమేమనియు, ప్రాప్యవస్తువును (భగవానుని) పొందుటయందలి త్వరచే కల్గిన మనోవైకల్యముగాని, ఉపాయఅధ్యవసాయము చెడుటచే కల్గిన మనోవైకల్యము కాదుగాన, దేవతాన్తరసంబంధముచే నీవ్యాధిని పోగొట్టరాదనియు, కర్మఫలముగాక ఆకస్మిక భగవత్కటాక్షముచే దివ్యమంగళవిగ్రహుని అనుభవించవలెననెడి ప్రీతిచే కల్గిన మనోవైకల్యమగుటచే దీనికి పరిహారము కర్మానుష్ఠానము కాదనియు, అనన్యార్హశేషత్వమునకు విరుద్ధమగుటచే స్వరూపమును నశింపజేయునని తెల్పి అన్యసంబంధమును మాన్పించినట్టి తిరువాయ్మొళ్ళి.

(2) తువళిల్మామణి, తులైవిల్లిమంగల దివ్య దేశమున మిక్కిలి ప్రీతిగల కుమార్తెను మళ్ళించవలెనని యత్నించు తల్లినిగూర్చి చెలికత్తె మీరేకదా యీమెను ఆదివ్యదేశమునకు తీసికొనిపోయి మిక్కిలి ప్రావణ్యము కల్గించినది, కాన నీమె విషయమున మీకు ఆశలేదనెడి మాటలచే అర్చావతారమే సులభోపాయమను నధ్యవసాయము విషయవైలక్షణ్యమునగల ప్రీతిచే గల్గిన త్వరయైనచో ఉపాయముతో సంబంధించునుగాన నది మాన్పించుటకై యత్నింప, సంబంధజ్ఞానము వచ్చి, శేషవస్తువు శేషికి సంతోషముగల్గజేయునేగాని, ఉపాయకోటిలో చేరదనియు, ప్రాప్తవిషయవైలక్షణ్యముచే వచ్చినదగుటచే నిది నివర్తింపజేయుటయు నసంభవమనియు, నివర్తించెదననెడి స్వాతంత్ర్యము అత్యంత పారతంత్ర్యస్వరూపముతో విరోధించును గాన త్యాజ్యమనియు నిట్లు స్వసంబంధమును నివర్తింపజేసిన తిరువాయ్మొళ్ళి.

(3) కరుమాణిక్కమలై,కుమార్తె యుక్తవయస్కురాలని బంధువులు స్వయంవర పత్రికల నంప తిరుప్పులియూరిలోని నాయనార్లతో నీమెకు కలయిక కలదని యీమె శరీరమందున, మాటలందునగల మార్పులచే తెల్సికొనిన ప్రాణసఖి, యీ ధ్వని నాయిక విననట్లైన మనుష్యులకే తన నిత్తురన్నమాత్రమున దుఃఖించునదగుటచే నీయత్నమును మాన్పింపజేయవలెనని బంధువుల బిల్చి యీమె తిరుప్పులియూరి నాయనార్లతో సంబంధము గలదిగ తెలియుచున్నది, వాని గుణ చేష్టితములనే స్తుతించుచున్నది, ఇట్లుండ మీరు చేయు యత్నము తగదని తెల్ప, వారు ఈమెకు గల అవయవ ఆభరణ శోభలాతనికి గలవా యన, వాటికి కొఱతలేదు, అవియేవియులేకున్నను ఈమె

వాని యందే సక్తమైనదని తెల్పి ఆ యత్నమును మాన్పించిన పాశురములందు నిరుపాధిక శేష త్వము వలన నీయాత్మవస్తువు సర్వేశ్వరునికే తగినదనెడి సంబంధజ్ఞానమగు చెలి పలుకులు స్పష్టము. కావున నీయాత్మవస్తువు దేవతాంతరములకుగాని తనకుగాని శేషముగాక భగవానునకే శేషమైనదని తెల్పెడి యీమూడు తిరువాయ్మొழிలయందును సంబంధజ్ఞానము కల్గినప్పుడు మాట్లాడెడి మాటలను చెలి యవస్థగ తెల్పిరి.

తల్లియొక్క అనన్యోపాయత్వమను ఉపాయాధ్యవసాయరూపమగు అవస్థను తెలియబఱచు తిరువాయ్మొழிలు ఏడు.

అందు(1) ఆడియాడి (2-4) భాగవత గోష్ఠి లభింపనందున పీకిపారవైచిన మొక్కవలె నాబిడ్డ వాడిపోయి (2) పాలనాయ్ (4-2) చేతికందనివాటికై యాశబడి కృశించిపోయి (3) మణ్ణైయి ఱుందు (4-4) సదృశ సంబంధ పదార్థములజూచి వాడేయని భ్రమించి (4) కడల్ఞాలమ్ (5-6) ఆవేశమా ! యనదగినట్లు వాడుమాట్లాడినట్లు మాట్లాడి, (5) మాలుక్కు (6-6) భగవానుని పొందలే దనెడి దుఃఖముచే లోకమర్యాదనతిక్రమించి, (6) ఉణ్ణుమ్శోరు (6-7) తనకీమె సహాయముగనుం డక, (7) కంగులుమ్ (7-2) ఈమె యీలాగున కష్టపడుటను చూచి యూరకుండుట మీకృపకు రక్ష కత్వమునకును తగునా? యని శ్రీరంగని ప్రార్థించునట్టి వీనియందు తల్లిమాట్లాడినట్లుండు ఉపాయా ధ్యవసాయదశ తెల్పిరి.

నాయిక(పుత్రి) యొక్క ప్రాప్యత్వరావస్థను దెల్పునవి పదునేడు.

అందు(1) అఞ్జిఱై (1-4) (2) వైకల్ (6-1) (3) పొన్నులకు (6-8) (4) ఎజ్ఞానల్ (9-7) ఈ నాల్గిటియందును క్రమప్రాప్తిలో భగవానుని పొందుటకొప్పుకొనక దూతలను పంపుటయు, (5) వాయుమ్ (2-1) భగవదలాభముచే తమవలెనే కన్పించిన సకల పదార్థములును దుఃఖించుచున్న విగా దుఃఖించి, (6) ఏఱాళుమ్ (4-8) వాడాదరింపని వాటిని ఉపేక్షించి, (7) మాశరుశోతి (5-3) జగత్తు క్షోభిల్లునట్లు సాహసకృత్యములొనర్తుమని, (8) ఊరెల్లామ్ (5-4) ప్రేమరూపవ్యాధియు రాత్రి రూపమగు యుగమును సంకేతములేర్పఱచుకొని ఒంటరిగజేసి తనను బాధించుటచే బయటికి పోజాలక, (9) ఎంగనేయో (5-9) దివ్యమంగళ విగ్రహము మనసున స్పష్టముగ ప్రకాశింప (10) మానేయ్నోక్కి (5-9) తిరువల్లవాழ் నందలి స్వామిని పొందుకాలమేదోయని, (11) మిన్నిడై (6-2) ప్రణయ రోషముచే ఆలస్యమునకు కోపించి, (12) వెళ్ళైచ్చురిశఙ్గు (7-3) మనస్సు వానివద్దకే పోవుటచే సహాయభూతులు లేక, (13) ఏழైయరావి (7-7) జ్ఞానవైశద్యముచే వాని అవయవ ఆభర ణాది బాధకవర్గము ఒకటై బాధింపగా, (14) నంగళ్వరివళై (8-2) హితమునుదెల్పు తల్లి, చెలికత్తె నతిక్రమించి, (15) ఇన్నుయిర్చ్చేవల్ (9-5) సదృశపదార్థములజూచి కష్టపడి ప్రాణముల వీడ యత్నించి, (16) మల్లికై (9-9 ) సాయంకాలము శ్రీకృష్ణుడు పశువులతో రాకుండుటచే నేమి సంభ వించునో యని భయపడి, (17) వేయ్మరు (10-3) ప్రాతఃకాలమున శ్రీకృష్ణుడు పశువుల మేపుటకై పోవునట్లనుమానించి పోవద్దని నిర్బంధించి యిట్లు పదునేడు తిరువాయ్మొழிలందు ప్రాప్యవస్తువి

షయమున త్వరాతిశయము కుమార్తె(నాయిక) అవస్థగ తెల్పిరి.

అవ - తల్లి సఖి యవస్థలు సంబంధజ్ఞాన ఉపాయాధ్యవసాయములగుచో వాటిని బహు వచనముచే నేల జెప్పిరనిన.

**49. తోழி మార్ అన్నైయర్ ఎన్గిఅ పన్మై రక్షకత్వాది బన్ధ వాత్సల్యాది**
చెలికత్తె తల్లి అనెడి బహువచనము రక్షకము మొ. సంబంధ వాత్సల్యాది
**వ్యవసాయ బుద్ధిభేదత్తాలే.**
అధ్యవసాయ జ్ఞానభేదములచే.

వ్యా - సఖినిన్ని తల్లినిన్ని బహువచనమున చెప్పుట, తిరుమంత్రమున జెప్పినట్లు ఈ ఆత్మతో సర్వేశ్వరునికి, రక్షకత్వ శేషిత్వ, కారణత్వ, శరీరిత్వాది సంబంధములగూర్చిన జ్ఞానభేదముండుట చేతను, ఉపాయభూతుడగు సర్వేశ్వరునికిగల వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్య జ్ఞాన శక్తి కృపాదులగూర్చిన అధ్యవసాయరూపమగు జ్ఞానభేదముండుటచేత వాటిని తెల్పు శబ్దములును బహు వచనమున దెల్పిరి.

అవ - కుమార్తె యనగా ప్రాప్యత్వరయైనచో కుమార్తెకున్న ఏడు అవస్థలును ఎట్లన్వయించు కొనవలెనన తెల్పుచున్నారు.

**50. అభిలాషా చిన్తన అనుస్మృతి ఇచ్ఛా రుచి పర పరమ భక్తి కళిలే పేతై ముతలాన**
అభిలాషా చిన్తన అనుస్మృతి ఇచ్ఛ రుచి పరభక్తి పరమభక్తులందు బాలిక మొదలగు
**పరువం కొళ్ళుమ్.**
అవస్థలను గొనునది.

వ్యా - 1. అభిలాష. అనుభవయోగ్యమగు పదార్థమును మొట్టమొదట చూచినప్పుడు గల్గు ఆశ.
2. చిన్తన, చూచిన విషయమును గూర్చిన స్మరణము.
3. అనుస్మృతి, ఆ స్మరణము నిరంతరము కొనసాగుట.
4. ఇచ్ఛ, ఆ విషయమును తప్పక అనుభవించియే తీరవలెనను ఆశ.
5. రుచి, రసాంతరములచే మార్చరానియట్లు ముదిరిన ఆశ.
6. పరభక్తి, ఆ విషయమున సంశ్లేషవిశ్లేషలచే కల్గు సుఖదుఃఖములు.
7. పరమభక్తి, ఆ విషయమును విడిచిన బ్రతుకలేని యవస్థ.

ఈ ఏడు అవస్థలయందును, (1) పేతై 5-7 సం. బాలిక, (2) పెతుమ్బై 8-11 సం, బాలిక, (3) మంగై 12-14 సం. బాలిక, మడన్తై 14-19 సం. స్త్రీ, (5) అరివై20-26 సం. స్త్రీ, (6) తెరివై 27-31 సం.స్త్రీ (7) పేరిళమ్ పెణ్ 32-40 సం. స్త్రీ, అను ఏడు అవస్థలను కుమార్తె యని చెప్పబడిన ప్రాప్యత్వర తెలియనగును.

భక్తి యొక్క ప్రథమదశ మొదలు చరమదశ వరకునుండు అవస్థాభేదములు, భక్తి రూప మగు ప్రాప్యత్వరయందు తెలియనగును.

**అవ** - నాయికావస్థయందు వర్ణింపదగిన అవయవ విశేషముల దెల్పుచున్నారు.

**51. మయిల్ పిఱై విల్ అమ్బు ముత్తు ప్పవళమ్ శెప్పు మిన్ తేర్ అన్నమ్**
నెమలి చంద్రుడు విల్లు బాణము ముత్యము పగడము స్తనము మెరుపు రథము హంస
**తెయ్వవురు వికాస శుద్ధి దాన్తి జ్ఞాన ఆనన్ద అనురాగ భక్తి**
దివ్యరూపము జ్ఞానవికాస పరిశుద్ధి ఇంద్రియనిగ్రహము జ్ఞానము ఆనందము ప్రేమ భక్తి
**అణుత్వ భోగ్యతా గతికళై ఉడైయ అకమేనియిన్ వకుప్పు.**
అణుత్వము భోగ్యత నడకలను కల ఆత్మస్వరూపపు స్థితి.

**వ్యా** - పింఛముచే నెమలికి అతిశయము గల్గునట్లు, జ్ఞానవికాసముచే నాత్మకతిశయము గల్గును గాన జ్ఞానవికాసమును నెమలితో పోల్చిరి.

ధావళ్యముచే చంద్రునికి ఆధిక్యము గల్గునట్లు, స్వాతంత్ర్య అన్యశేషత్వములను దోష ములు లేని పారిశుద్ధ్యముచే ఆత్మకు శుద్ధియగుటచే దోషరాహిత్యమును చంద్రునితో పోల్చిరి.

ధనస్సుతో కనుబొమలను పోల్చిచెప్పుటచే విల్లువలె ఒంగియుండు బాహ్యాభ్యంతర ఇంద్రియ నిగ్రహరూప దమము తెల్పబడినది.

బాణముతో జ్ఞానమును పోల్చుటచే, బాణము లక్ష్యవస్తువున పడునట్లు జ్ఞానమును సర్వే శ్వరునియందే యగుటను తెల్పిరి.

ముత్యమువలె తెల్లనైన చిరునవ్వు అన్నట్లు భగవద్విషయానుభవము వలన గలుగునట్టి ఆనందము తెల్పిరి.

పగడముతో అనురాగమును పోల్చిచెప్పుట, దాని యెఱ్ఱదనముచేత.

స్తనములను భక్తితోపోల్చుట, శేషియగువాడు ప్రీతితో పై బడునట్లు పరిపాకమును బొందిన భక్తి తెలుపబడినది.

మెరుపుతో అణుత్వము దెల్పుట, సూక్ష్మతనుబట్టిగాన ఆత్మవస్తువుయొక్క అణుత్వము దెల్పబడినది.

తేరుతో భోగ్యతను తెల్పుట, తేరణ్గల్కుల్ అనుతావున నితంబ (పిరుదుల)వైలక్షణ్యము అనుభవించువానికి భోగ్యమగుటచే శేషికి రసవంతముగనుండు ఆత్మవస్తువు యొక్క భోగ్యత తెల్పబడెను.

హంసతో నడకను పోల్చుటచే సర్వేశ్వరుడును భాగవతులును కీర్తించునట్లు స్వరూపాను రూపముగ ప్రవర్తించుటయనెడి నడవడి తెల్పబడెను.

కావున నెమలి మొదలగు వానితో బోల్చి వర్ణింపదగిన అవయవములతో గూడినట్టి అప్రా

కృతదివ్యదేహము జ్ఞాన వికాస శుద్ధ్యాదుల కాశ్రయమై ఆత్మస్వరూపముయొక్క స్థితి ధర్మిధర్మ ములు చేరియుండుటచే నిట్టి రూపముతోనే యుండవలెననెడి ఏర్పాటును ప్రాప్యవస్తువు నందలి త్వరయనెడి కుమార్తె యవస్థగా పేర్కొనిరి.

**అవ** - ఈ మూడు అవస్థలయొక్క వృత్తివిశేషములను (చేష్టలను), తెల్పుచున్నారు.

**52.** **శూర్గ్ చ్చి, అకత్తి నీరెన్నుమ్పళ్గి ఇణక్కి యెజ్ఞనేయెన్నుం మేల్యిత్తు**
ప్రీతిగల్గజేసి చేయిజారజేసిరను నింద పొంచియుండి ఎట్లుఅని నేరముమోపి
**మున్నిన్రాయ్ ఇవళై నీరెన్రుమ్ ఇరుపడైమెయ్ కాట్టు నీ రెన్నెయెన్నుమ్**
ముందునిల్చితివని ఈమెను మీరనియు, ఇద్దరకు సహకరించుటయు స్వభావమెట్టిదోయెరుగక
**ఉడన్నాడు ఇడైయిల్లైయెన్రుమ్ ఉతఱుతల్ ఇరున్దిరున్దు నడన్దాళెన్రుమ్ కొణ్డాట్టమ్**
కోపపడుట సంబంధములేదనియు విసిరికొట్టుట ఉండియు నడిచిపోయినదని కొనియాడుట
**అవస్థాత్రయవృత్తి.**
అవస్థాత్రయవృత్తి.

**వ్యా** - చెలికత్తెలేకదా ఈమెను గొనిపోయి భగవద్విషయమున ప్రీతిగలదానినిగజేసి యీస్థితికి తెచ్చినారని తల్లి చెలికత్తెలపై నెపముపెట్టుట (పెరి.తి. 3-7-4) తుల్లైవిల్లి మంగలమునకు గొని పోయి అటనుండు భగవానుని సేవింపజేసి, మీరేకదా యీమెనిట్లు చేయిజారునట్లు చేసినారని చెలి కత్తె ,తల్లిపై నెపము పెట్టుటయు (తివాయ్ 6- 5-2), మా సఖియలు మాకు వనవిహారమునందు ఆశనుకల్గించి అన్నట్లుగా వనవిహారమునకై గొనిపోవుటకై పొంచియుండి నీ విషయమున ప్రావణ్యా మేర్పఱచిన చెలికత్తెలమూలమునకదా యిది వచ్చినది అని చెలికత్తెపై నేరము మోపుటయు (తివాయ్ 6-2-8) , నాకు వానియందు ప్రావణ్యము గల్గించిన తల్లులగు మీరు నాపై కోపగించుట ఎట్లు అని తల్లిపై నాయిక నిందమోపి (తివాయ్ 5-3-1) ఇట్లు నాయిక, చెలియను తల్లిని విదలించి వేయుటయు, ఒక్కరికిని కన్పడక పెరిగినట్టి నీవు ఇప్పుడెల్లరకు కన్పడునట్లు ముందు నిల్చితివని సఖి తల్లివైపునకు పోయి కుమార్తెను చివాట్లు పెట్టుటయు (తివాయ్ 5-5-9) , ఈమెను భగవానుని నుండి మరలించెడి యాశను వదలుకొనుడని తల్లికి సలహాయిచ్చుదానివలె చెలికత్తె కుమార్తెకు సాయపడునట్లుభయులకు సంబంధించియుండుట (తివాయ్ 6-5-1), తల్లులును సఖియలును నన్నీసమయమున నోదార్చక రాత్రియంతయు నిద్రించుచున్నారని కుమార్తెయిరువురను కోపించు టయు (తివాయ్ 5-4-5), ఓ తల్లులారా నా చెలియలారా! నేనేమిచేయుదుననగా ఆవిషయము నుండి మనసును త్రిప్పుకొనుట మంచిదనగా, మీతోనాకు సంబంధములేదని ఉభయులను చెంతచే రనీయక విసిరికొట్టుటయు (తివాయ్ 8-2-7), అరవిందలోచనా యనుటకు బలహీనతచే ఉండి యుండి అనేకమార్లు ఆపిఆపి వాని నేత్రసౌందర్యమును తెల్పునట్టి అతిప్రావణ్యమునకు చెలి కొను యాడుటయు (తివాయ్ 8-2-7), ఈమె తిరుక్కోళూరునకే నడచిపోయినదని తల్లి శ్లాఘించుట (తి

వాయ్ 6-7-9) . ఇట్లు సంబంధజ్ఞానము ఉపాయాధ్యవసాయములు ప్రాప్యత్వరకు హేతువులగుట ప్రథమదశ యనబడును. ప్రాప్యత్వరను నివర్తింపజేయు సంబంధజ్ఞానము ఉపాయాధ్యవసాయములు ముఖభేదముచే వాటివాటి కనుకూలముగ నుండుట మధ్యమ దశ అగును. ప్రాప్యత్వర సంబంధజ్ఞాన ఉపాయాధ్యవసాయముల నతిక్రమించుటయు శ్లాఘ్యమగుటయు చరమదశ.

ఇట్లు చెలికత్తె తల్లి కుమార్తె యనెడి అవస్థాత్రయముయొక్క వ్యాపారమని యెఱుగతగును.

**అవ** - తల్లి, కుమార్తె యనెడి యవస్థలలో శత్రువులుగ చెప్పునదెవ్వరిననిన తెల్పుచున్నారు.

**53. తాయార్ ఏతలర్ ఉత్తార్ కళెన్నుమ్ సాధ్య సిద్ధసాధన నిష్ఠరై, మకళ్ నమ్ముడైఏతలర్**
తల్లి శత్రువులు బంధువులనుట సాధ్య సిద్ధసాధన నిష్ఠులను కుమార్తె నాయొక్కశత్రువులు
**యాముడైత్తుణై ఎన్నుమ్ సిద్ధ సాధన సాధ్య పరరై .**
మాయొక్క రక్షకులు అనుట సిద్ధ సాధన సాధ్య పరులను.

**వ్యా** - తల్లియనబడు ఉపాయాధ్యవసాయదశయందు, శత్రువులు సాధ్యసాధన నిష్ఠులు, బంధువులు, సిద్ధసాధననిష్ఠులకు అనుకూలులగు సిద్ధసాధననిష్ఠపూర్తిలేనివారు, కుమార్తె యనబడుప్రాప్యత్వరదశయందు, అంతరంగ శత్రువుగ సిద్ధసాధననిష్ఠయను తల్లినిన్నీ, బంధువుగ తనతో సుఖదుఃఖముల ననుభవించునట్టి సాధ్యసాధన నిష్ఠయగు చెలియను తెల్పిరి.

భగవంతుని యందే ప్రీతిగల్గి,వాడే ఉపాయమను నిశ్చయము గలవారైన సిద్ధసాధనపరులు, ఇట్టి త్వర పారతంత్ర్యముతో ననుకూలింపదని, నిషేధించువారు, శత్రువులు. తనవలెనే ఉపేయబుద్ధియందు నిల్చి తనతో నేకీభవించియుండు సాధ్యసాధనపరులు బంధువులు.

**అవ** - అన్యాపదేశములకు స్వాపదేశార్థములను దెల్పుచున్నారు.

**54. నాలయలార్ అయళ్చేరియార్ ఉపాయచతుష్టయ అన్తర్యామిత్వ పరర్.**
ఊరివారు పొరుగూరివారు ఉపాయచతుష్టయ అంతర్యామిత్వ పరులు.

**వ్యా** - ఊరివారనినది కర్మజ్ఞాన భక్తి ప్రపత్తులనబడు నాల్గుపాయములందు స్థిరముగ నున్నవారిని, ప్రక్కవూరివారుగ తెల్పినది అర్చావతారమునందంత ప్రీతిలేక అంతర్యామియందు మనస్సుంచినవారినని తెలియదగును.

**అవ** - ప్రపన్నులనున్ను వేఱైనవారుగ చెప్పవచ్చునా ? యనిన తెల్పుచున్నారు.

**55. కీழై మేలై వడక్కిలవై పుఱమ్బాక త్తమ్పత్తు ఉళ్ళశల్.**
క్రింద పైన ఉత్తరమనునవి బయటివిగ స్వగతస్వీకారము లోనిపార్శ్వముగ.

వ్యా - కీఞ్జై మేలై వడక్కిలవై అను పాశురములందు చెప్పబడిన కర్మ జ్ఞాన భక్తులు సిద్ధసాధనులకు బయటివై స్వగతస్వీకారములోని భాగమై యుండును. క్రియను కర్మయోగముగు దర్శనము జ్ఞానయోగముగను అనుభవమును భక్తి యోగముగను తెలియదగును.

అవ - ఊరార్ నాట్టారులకర్ అనువారెవ్వరనిన తెల్పుచున్నారు.

**56. ఊరార్ నాట్టార్ ఉలకర్ కేవల ఐశ్వర్యకామ స్వతంత్రర్.**

ఊరివారు లోకులు లోకాంతరులు కేవలులు, ఐశ్వర్యకాములు స్వతంత్రులు.

వ్యా - ఊరివారనగా ఆత్మప్రాప్తికాములగు కేవలులు. లోకులనగా పుత్ర పశు అన్నపానాదులను గోరునట్టి - ఇహలోక ఐశ్వర్యకాములు, లోకాంతరపరులనగా స్వర్గాది పరలోక ఐశ్వర్యమును గోరునట్టి స్వతంత్రులనుట.

అవ - కేవలులను ఒకే వూరివారినిగా చెప్పవచ్చునా ? యనిన తెల్పుచున్నారు.

**57. ఇఱుకల్ ఇఱప్పుక్కుమ్ ఇఱన్దాల్ తఙ్గుమ్ ఊర్ ఒక్కుమే.**

అల్పమగు ఆత్మానుభవమును ఎడబాసిన నివసించు ఊరు ఒకటేకదా.

వ్యా - అపరిచ్ఛిన్నములగు రూప గుణ విభూతులతో గూడియున్న పరబ్రహ్మము ననుభవించుట గాక, అణువగు ఆత్మననుభవించుట అల్పానందమేయైనను నది జరామరణములతో సంబంధము లేక ప్రకృతి మండలమునకు పైదగు పరమాకాశముననుండి అనుభవించవలసినదిగాన దేశము సమానమే యగును.

**58. శిఱు శీరార్ శుళకుకళ్ ఉభయ వివేక పరికరమ్.**

చిన్న పెద్ద జల్లెడలు రెంటిని తెలియుటకు సాధనము.

వ్యా - చిన్నజల్లెడ యనగా, ముతకయిసుకను సన్నయిసుకను వేరుచేయునట్టి సాధనమగుటచే దేహముకన్న, వేరైన ఆత్మను తెల్సికొనుటకు సాధనమగు ప్రమాణము, పెద్దజల్లెడ యనగా, ఈమెకింతటి వ్యామోహము గల్గించిన దెవ్వరనిన,దేవతాంతరములుగావు సర్వేశ్వరుడే యని తెలియుటకు సాధనమగు ప్రమాణము.

ఉభయవివేకమనగా, త్యాజ్యోపాదేయరూపములగు (విడువదగిన స్వీకరింపదగిన) విషయముల గూర్చిన వివేకము.

**59. మాలై కఙ్గుల్ కాలై పకల్ రజస్తమస్సత్వశుద్ధసత్త్వజ్ఞానఙ్గళ్.**

సాయం రాత్రి వేకువ పగలు రజస్తమస్సత్వశుద్ధ సత్త్వ జ్ఞానములు.

వ్యా - సాయంకాలమనగా రాగముతోగూడియుండి పదార్థములు స్పష్టముగ తెలియరాకుండుటచే అది పదార్థముల విషయమున అన్యథాజ్ఞానమును బుట్టించు రాజసజ్ఞానము.

రాత్రియనగా, పదార్థములను కన్పింపనీయక, కొలదిగ కన్పించినను విరుద్ధముగ తెలియ వచ్చు నట్టి చీకటికాలమగుటచే తెలియవలసినవాటిని తెలుపక విపరీతజ్ఞానమును గల్గించు తామస జ్ఞానము.

వేకువ (ప్రాతఃకాలము) యనగా, వెలుగువచ్చుటచే పదార్థములు స్పష్టముగ తెలియవచ్చు టకుపకారకమగు సాత్వికజ్ఞానము.

పగలనగా, పదార్థములను సంశయవిపర్యయములు లేక గన్పింపజేయు కాలమగుటచే, గుణ విగ్రహ విభూతి విశిష్టుడగు సర్వేశ్వరుని బాగుగ తెల్పునట్టి శుద్ధ సత్వ జ్ఞానము.

**60. నిలా ముత్తమ్ ప్రజ్ఞాప్రాసాదమెన్నుమ్ ఎల్లైనిలమ్.**

నిలా ముత్తమన ప్రజ్ఞాప్రాసాదమనెడి చరమావధి.

వ్యా - ప్రజ్ఞయనెడి మేడపైనెక్కి అన్నట్లు ఉన్నత స్థానమునుండి అన్నిటిని తెల్సుకొనదగినదై తెల్సికొనిన తర్వాత భాగవతప్రతిపత్తియే పరమప్రాప్యమని యితరులకును తెలియజేయునట్టి చర మావధియగు పురుషార్థ జ్ఞానమనుట.

**61. కళై వళై అహమ్మమకృతికళ్.**

కళై వళై (అనునవి) అహం మమకారములు.

వ్యా - కళై వళై అని చెప్పబడునవి, భగవదనుభవ విరోధులగు అహంకార మమకారములనుట. ఈ అహంమమలు రెండును తిరుమంత్రమునందలి మధ్యమపదమగు నమః చేత నిషేధించి, నారాయణాయ అను తృతీయ పదముచేత భగవదనుభవము చెప్పబడినది.

**62. పట్టమ్ శూడకమావన పరావరగురుక్కళ్ పూట్టుమ్ ఆత్మ భూషణజ్గళ్,**

పట్టము భుజకీర్తులనియు ఉత్తారకాచార్యులు అలంకరించు ఆత్మభూషణములు.

వ్యా - ముందుగ నీయాత్మ నంగీకరించి ఆచార్యులు కల్గించు నామరూపములును భగవత్వందనా దులును,ఆపై ఆచార్య అనుభవమున నెఱిగిన శేషత్వజ్ఞానాదులనబడు ఆత్మాలంకారములు ననుట.

**అవ - ఇక లీలోపకరణములుగ చెప్పినవాటి స్వాపదేశార్థములను తెల్పుచున్నారు.**

**63. పన్దు కళ్ల్ పావై కుళ్లమణన్ యాళ్ తెన్దల్ మతియమ్ అడిశిల్**

బంతి గచ్చకాయ పటము బొమ్మ వీణె మలయమారుతము చంద్రుడు అన్నము

**శాన్దమ్ పూణ్ అకిల్ శిత్తిల్ తూతై ముతలావన గుణత్రయ**
గంధము ఆభరణము దేవదారు బొమ్మరిండ్లు చిన్నబొమ్మ మొదలగునవి త్రిగుణములతో
**విచిత్ర కర్మ సూత్రత్తాలే కట్టి లీలైయాక ప్రేరిక్క విళున్దు ఎళున్దుమ్**
విచిత్రకర్మసూత్రముచే బంధించి విలాసార్థము(జీవుని) ప్రేరేపింప క్రిందపడి పైకిలేచి
**శుళన్దు ఉళన్దుమ్ పఱిపట్టుమ్ అల్పసారమామవైయుమాయ్ మదీయమెన్నిల్**
సుడితిరిగి వచ్చుచుపోవుచు విడిపింపబడునట్టి అల్పసారములునై నావన్నప్పుడు
**విట్టకలవుం తదీయమెన్నిల్ ఇకళ్ వఱవుమ్ మునివతుమ్ ఇక్కాలమ్ ఈదో**
త్యాజ్యములై వానివన్నప్పుడు ఉపాదేయములై మునివదుం పా.న ఇక్కాలం పా.న ఈదో పా.న
**ఎన్నప్పడుమ్ పొఙ్గైమ్పులనిల్ భోగ్యాది సమూహమ్.**
అనబడిన పొంగైంబులందు భోగ్యాది సమూహము.

**అళకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ తిరువడికళే శరణమ్.**

**వ్యా** - పైన చెప్పబడిన లీలోపకరణ భోగోపకరణములు త్రిగుణములతో గూడ కర్మసూత్రములతో కట్టి సర్వేశ్వరుడు వినోదమునకై, అజ్ఞుడు నశక్తుడునగు చేతనుని పైలోకములకు పోవుచు మరల క్రిందకు వచ్చుచుండునట్లు ప్రేరేపింపగా,

ఈ చేతనుడు చక్రము తిరిగినట్లు పోయినత్రోవనే పోవుచు యమాలయము మాతృగర్భము మరలమరల ప్రవేశించుచు కష్టపడుచుండుటను చూచి భగవానుడు తన భోగమునకు విరోధియగు శరీరమును బలవంతముగ విడిపించ, అల్పసారములై భగవానునినుండి వేరుచేయునవియేగాని తమయందనుభవింపదగిన దొక్కటియు లేకుండునట్టివై, నావి యనుకొనిన విడువతగినవియై వానివి యను కొనిన స్వీకరింపదగినవియగు భోగ్య భోగోపకరణ భోగస్థానములు.

ఇందు ఎఱ్ఱని తెల్లని నల్లని దారములతో చేయబడిన బంతిగ చెప్పబడినది, త్రిగుణాత్మకమై భోగస్థానమగు శరీరము. గచ్చకాయలు ఐదుగనుండు పంచేంద్రియములు, పటము బొమ్మ క్రీడోపకరణములు, వీణ చంద్రుడు అన్నము చందనము. ఆభరణములు దేవదారు అనునవి శబ్దాది విషయములు. వీటిలో ఆభరణము దేవదారు అనునవి రూపగంధ భేదములు. బొమ్మరిల్లనగా చిన్న చోటగుటచే భోగస్థానములగు దేహము వాసస్థానములగు గృహాదులును. చిన్నబొమ్మ యనుటచే ఇతరేతర భోగోపకరణములకు సూచకము. లీల యనగా అప్పటికప్పుడు సంతోషము కల్గించునట్టి వ్యాపారమగుటచే నిందులకు ఉపకరణములు (సాధనములు)గా నున్నవి గాన నివి యన్నియు పొంగైమ్పులన్ అను పాశురమున చెప్పబడిన భోగ్యభోగోపకరణాదుల సమూహమని చెప్ప వచ్చును.

**ఆచార్యహృదయవ్యాఖ్యానమున ద్వితీయప్రకరణము సమాప్తము.**

**పెరియజీయర్ తిరువడికళే శరణమ్.**

# తృతీయ ప్రకరణము

**అవ** - భగవంతుని యొద్దకు దూతలుగ పంపబడిన పక్షులను గూర్చి స్వాపదేశార్థముల తెల్పుచున్నారు.

**1. శేర్ ప్పారై పక్షిగళాక్కి జ్ఞానకర్మజ్ఞళై చ్చిఱకెన్ఱు గురు సబ్రహ్మచారి పుత్ర శిష్య**
ఘటకులను పక్షులుగజెప్పి జ్ఞానకర్మలను రెక్కలని గురు సబ్రహ్మచారి పుత్ర శిష్య
**స్థానే పేశుమ్.**
స్థానముల చెప్పుదురు.

**వ్యా** - భగవద్విషయమునకు ఘటకులగువారిని పక్షులనుగను, వారి జ్ఞానానుష్ఠానములను రెక్కలుగను చెప్పి రెక్కలతో పక్షి ఆకసమున కెగురునట్లు ఈజీవుడు తన జ్ఞానానుష్ఠానములతో సర్వేశ్వరుని బొందగలడు. గురువుల సహాధ్యాయుల యొక్కయు పుత్ర శిష్యుల యొక్కయు స్థానములలో నుండి మాట్లాడుదురనుట.

**అవ** - ఈ పక్షులలోని అవాంతరభేదములయొక్క స్వాపదేశముల దెల్పుటకై హంసయన బడువారెవ్వరనిన తెల్పుచున్నారు.

**2. వివేకముఖరాయ్ నూలురైత్తు అళ్ళలిల్ రతియిన్ఱి అణజ్గిన్నడైయై**
త్యాజ్యోపాదేయ సమర్థులై శాస్త్రోపదేశమొనర్చి ప్రకృతివాసనలేక కోర్కెలేక పిరాట్టినడవడికను
**ప్పిన్శెన్ఱు కుడైనిళ్లలిలే కవరి అశైయ చ్చజ్గమవై మురల వరివండు ఇశైపాడ**
అనుకరించి గొడుగునీడన చామరము వీచ శంఖముట ధ్వనింప తేనెత్రాగితుమ్మెద గానముజేయ
**మానసపద్మాసనత్తిలేయిరుందు విధియినాల్ ఇడరి అంతరమిన్ఱి ఇన్బమ్‌పడ**
మానససరస్సునఉండి భాగ్యముచే దుఃఖములేక విఘ్నములులేక ఆనందముపెరుగ
**క్కుడిచ్చీర్ మైయిలేయాతల్ పత్తత్త పరమహంసరావుతలాన నయా శలన్**
కులగౌరవముచేగాని సంసారసంబంధములేని పరమహంసలనబడు నీతితప్పని శెల్వనంబి
**మెయ్‌న్నావన్ నాథ యామునర్ పోల్‌వారై అన్న మెన్ఱుమ్.**
సత్యవాగ్నిష్ఠుచిత్తులు నాథ యామునుల పోలువారిని హంసలందురు.

**వ్యా** - సారాసారవివేకోన్ముఖులై శ్రోతలకు శాస్త్రార్థముల నుపదేశించి అసత్యమగు ప్రకృతిన దిగబడక, పిరాట్టియొక్క అనన్యార్హ శేషత్వాదులను పురుషకారభావమనెడి నడవడిక ననుసరించి, పద్మపత్రమువలె శ్యామమైన శరీరముగల శ్రియఃపతికి సంసారతాపము తగలనట్లు గొడుగుగా గలవారై పరిపూర్ణజ్ఞానులు చామరాది కైంకర్యముల నొనర్ప, శుద్ధస్వభావులు స్తుతింప, సారగ్రాహులు సామగానమొనర్చి, ఆచార్యుని పాదపద్మములను సర్వదా మనసున ధ్యానించునట్టి వారై , శాస్త్రోక్తరీతిగ

సంసారసంబంధములను సకలదుఃఖములను సంబంధింపక ఒక విఘ్నమున్ను, గలుగనట్లు ఆ పై పైని ఆనందము వృద్ధి పొందునట్లు , భార్యాపుత్రాదులతో గూడియుండి భగవదనుభవముజేయునట్టి శెల్వనంబి పెరియాళ్వార్లు వంటివారును సాంసారికమగు సమస్త సంబంధములును లేనివారై సన్న్యాసాశ్రమ ధర్మము నవలంబించినవారై, పరమహంసలని పేర్కొనదగిన శ్రీమన్నాథయామునుల వంటి వారును గుణసామ్యమును బట్టి హంసలుగ పేర్కొనబడుదురు.

అవ - తుమ్మెద కందిరీగలుగ జెప్పిన దెవ్వరి ననిన తెల్పుచున్నారు.

3. ఎన్ పెఱుతియెన్న భ్రమియాతు ఉళ్ళత్తుళూఱియ మధువ్రతమాయ్ తూమతు

చెప్పికాదనునట్లు భ్రమింపక హృదిని ఊరిన తేనె ధారకమై శుద్ధభోగ్య

వాయ్కళ్కొణ్డు కుఞ్జల్వాయ్ వకుళత్తిన్ సారమ్ గ్రహిత్తు తే తెనవెన్ఱు ఆళమ్ వైత్తు

వాక్కులతో తలయందలి పొగడపూల సారము గొని తెన్నతెన్నఅని గానమొనర్చి

చ్చిఱుకాల్ ఎల్లియంపోతు కురుంచి మరుళ్ కామరమ్ కందారమ్ తలైక్కొళ్ళ

వేకువన సాయంకాలమున కురుంజి ఇందళము కామరము కందారముల ప్రధానముగ

ప్పాడి తున్నిట్టు నెరుక్క నీక్కొన్ఱు కడన్దు పుకున్దు తకైవఱ ప్పుక్కు వణ్డొత్తిరుణ్డకుఞ్జలిలే

పాడి క్రిక్కిరిసి త్రోయగా తెఱుపుదని దాటి ప్రవేశించి అడ్డులేక పోయి తుమ్మెదవంటిజుట్టున

శఙ్కైయఱ మరువి అరుళాతయామ్ ఎన్ఱు ఓడివన్దు వాశమేయూది వణ్డేకరియాన

భయపడక అమరి దయచూడని మమ్ము అని పరుగిడివచ్చి వాసన నూద్చి తుమ్మెదసాక్షియగు

తెయ్వవణ్డోడే శేర్విక్కుమ్ శేమముడై నారతన్ మునివాహనర్ తమ్బిరాన్మార్ పోల్వారై

పరదేవతతో చేర్చునట్టి క్షేమమొనర్చు నారదుడు తిరుప్పాణన్ తంబిరాన్మారులవంటివారిని

వణ్డు తుమ్బి ఎన్ఱుమ్.

తుమ్మెద కందిరీగ అందురు

వ్యా - చెప్పికాదనవలసినట్లు స్వరూపానురూపములుగాని వానిని భోగ్యములుగ భ్రమింపక, శేషభూతుల హృదిన ఊరినట్టి భగవద్విషయమను తేనెను ప్రేమించి, వేఱొకదానిని చూడక భగవదనుభవముననే మనముంచి , పరిశుద్ధమై భోగ్యమగు వాక్కుగొని, ప్రతిరోజు వికసించిన పొగడపూల మాలికను ధరించువారగు నమ్మాళ్వార్ల కొప్పులలోని పుష్పసారమును పరత్వాదులకన్న భోగ్యముగ ననుభవించి యిట్లు భగవద్భాగవత భోగ్యతలను అనుభవించుటచే కల్గిన ఆనందముతో నుప్పొంగి, కురుంజి ఇందళము కామరము కందారము మొదలగు రాగముల గానమొనర్చి సేవించుకొనుటకై వచ్చినవారు క్రిక్కిరిసి కావలివానిని తలుపుతెరువుమని ప్రార్థించి మనసును ఇంద్రియముల నాకర్షించునట్టి ద్వారసౌందర్యమున మనసుపోనీయక అటంకములేక తమతో సాటియగు తావు నకుపోయి నిర్భయముగ సమీపమున నుండువారై వాని దయకు పాత్రులగునట్లు ఈతని ఆర్తిని సర్వేశ్వరున కెఱిగించి అతని రాకను తెలియబఱచుటచే నీతనికి గల్గిన సంతోషము ననుభవించి

సర్వేశ్వరుని వద్ద తామనుభవించిన భోగ్యతను తమ వాక్కుచే తెల్పి యీమె నోదార్చ, వేదాంతార్థముల గ్రహించిన అరు శాస్త్రముల జదివి జ్ఞానానుష్ఠాన నిష్ఠుడగు నాచార్యుని పురుషకారముగ గొని అంగీకరించువాడగు వేదాంతవేద్యుడగు గరుడవాహనారూఢుడగు సారగ్రాహి సర్వేశ్వరునితో చేర్చునట్టి బ్రహ్మభావనైకనిష్ఠయనెడి రక్షగల్గి భగవద్గుణానుభవమువలన గల్గిన ఆనందముచే నృత్యమొనర్చి గానముజేయుచుండు శ్రీనారదాదులును, లోకసారంగమహామునులచే మోయబడిన శ్రీతిరుప్పాణియాళ్వార్లును, తిరువాయ్మొళ్ళి మాధుర్యమే భోగ్యతగాగల తంబిరాన్మార్ వంటివారును పైగుణసామ్యముచే తుమ్మెదలనియు కందిరీగలనియు తెలియదగును, కందిరీగయు తుమ్మెద జాతిలోనిదే యగుటచే వండు తుంబి యని వేర్వేరు జంతువులుగా బేర్కొనిరి.

అవ - చిలుకలు మొదలగు పక్షుల నెవ్వరినిగా బేర్కొనిరనిన తెల్పుచున్నారు.

**4. కణ్వలై ప్పడాదే అకవలైప్పట్టు వళర్త్తు ఎడుప్పార్ కై యిరున్దు తయిర్**
స్త్రీలకంటివలలో పడక స్వామికటాక్షపాత్రులై పోషకుల చేతిలో నుండి పెరుగు
**నెయ్యమర్ పాలముతుణ్డు ఒరుమిడరాయ్ పోత్తి ఒడువణ్ణమ్ తిరున్ద నువలాతతుక్కు**
నేయి పాలనారగించి ఏకకంఠులై స్తుతించి ఏదొకవిధముగ తిరిగి చెప్పనందులకు
**ఎన్బుళ్ళైక్కుమ్ నీయలైయే నల్వాళమ్ తురప్పనెన్డుమ్ అవత్తుక్కుమ్ ఉకన్దు**
ఎముకనుఒరిసెడి నీవేకదా మంచిఉపకృతి? తరుముదునని వానికిన్ని సంతసించి
**శొల్లెడుత్తు చ్చోర్న్దవాతే కళిప్పియామైత్త మాత్తమ్ కైకూప్పి వణజ్గి ప్పాడి**
నామములందించి పరవశించగనే నేత్పిన మాటలను చేమోడ్చి దండమిడి పాడి
**ఆలియావత్తైయా పరాభిమానత్తిలే ఒతుజ్గిన నమ్బిక్కన్బర్ తలైమీతడిప్పాడి**
సంకీర్తనతో ప్రొద్దుజరుపు వారిఅభిమానమున ఒదిగిన మధురకవులు తొండరడిప్పాడి
**ఉడైయవర్ ఉడైయార్పోల్వారై క్కిళి పూవై కుయిల్ మయిల్ ఎన్డుమ్.**
రామానుజులు మొదలగువారిని చిలుక గోరువంక కోకిల నెమలి అందురు.

వ్యా - స్త్రీల కంటిచూపనెడి వలలోపడి అనర్థపడక సర్వేశ్వరుని తామర వంటి కనుల చూపునబడి కటాక్షపాత్రులై స్వరూపవర్థకులై లాలించి రక్షించు నట్టివారి స్వాధీనమున నుండి కాలోచితముగ పాకానుగుణముగా ఉపదేశముల ద్వారా ధారక - భోగ్యములగు భగవద్గుణానుభవము జేయించగా ననుభవించి ఆచార్యునభిప్రాయముతో నేకీభవించినవారై ఘటకులుగ ఉపకరించిన దశయందు నాయార్తిని సర్వేశ్వరున కెఱిగింపుమన నట్లొనర్చనందున సర్వేశ్వరుని జ్ఞప్తికిదెచ్చు పదార్థములు బాధించునట్టి సమయమున దగ్గరుండి వాని తిరునామముల నుచ్చరించుటయును సహింపక, నేర్పినందులకు మంచి ప్రత్యుపకారమొనర్చిరని అనాదరణజేసినప్పుడును నిగ్రహానుగ్రహములు రెండిటికిని సంతసించి తిరునామముల జెప్పుమని మొదలందించి బలహానిచే శరీరము పరవశింప ఆనందముతో సంకీర్తనముతో ప్రొద్దుపుచ్చుకొనువారై ఆచార్య భాగవత అభిమానమును ఆధారము

గాగొని శ్రీనమ్మాళ్వార్లయందెక్కుడు ప్రీతికలవారగు శ్రీమధురకవులును భాగవతులకు పాదధూళి వలె పరతంత్రులుగ పిలువబడు శ్రీతొండరడిప్పొడిఆళ్వార్లు శ్రీరామానుజుల అంతరంగశిష్యులుగ ప్రసిద్ధి నొందిన శ్రీకూరత్తాళ్వాన్ ముతలియాండాన్ ఎంబారులు అరుళాళప్పెరుమాళెంబెరుమానార్ వంటివారిని గుణసామ్యమును బట్టి చిలుక గోరువంక కోకిల నెమలి యని తెల్పుదురు.

అవ - నారపక్షి కొంగ కురుకు అనిన దెవ్వరినన తెల్పుచున్నారు.

5. ఆశఱుతూవి ఎన్నుమ్ బాహ్యాభ్యంతర శుద్ధియోడే తిరైయుగళుమ్
దోషములేనిరెక్కలు అనెడి బాహ్యాభ్యంతర పరిశుద్ధితో అలలుపొర్లు
వ్యసనవ్యధైయత్తు తాయ్ వాయిల్ ఉణ్ణుమ్ పిళ్ళైక్కు ఇరై త్తేడి
దుఃఖబాధలేక తల్లి నోటితో తిను పిల్లకు ఆహారము వెదకి
వైకలుడన్ మేయ్న్దు నుజ్గాళ్ పైజ్గానమెన్ను బ్రహ్మరథమ్ పణ్ణిక్కొడుత్తవై
నిత్యమును మేపుచు మీకాళ్ళను సముద్రమంతయు బ్రహ్మరథ మర్యాద
కొణ్డు నల్లపదత్తైయుమ్ వేణ్డేన్ ఎన్నుమ్ తనిప్పెరుమ్ పిత్తర్ నమ్ముతలికళ్
గొని సన్మార్గమున్ను కోరననెడి సాటిలేని గొప్పభక్తులు మనపూర్వాచార్యుల
పోల్వారై నారై కొక్కు కురుకు ఎన్నుమ్.
వంటివారిని నారపక్షి కొంగ నీటికోడి అందురు.

వ్యా - దోషరహితమగు రెక్కలుగలిగి, భగవంతునిపై లగ్నమనస్కులగుటచే బాహ్యాభ్యంతరశుద్ధి గల్గి నిశ్చలమనస్కులై సంసారసముద్రతరంగరూప తాపత్రయ వ్యసనములు పైబడుచున్నను చలింపక, తల్లి నోటితో తెచ్చిన ఆహారమునే తినిబ్రతుకు పిల్లకు ఆహారమునిచ్చెడి తల్లివలె తమ పరతంత్రులగు శిష్యులకు భగవద్విషయార్థములను కృపతో చెప్పి, సర్వకాలమును భోగస్థలములకు తామే పోయి ప్రీతిగల శిష్యులతో గూడి భగవద్గుణానుభవమొనర్చి మీపాదములను నాతలపై నుంచుడన్నట్లును, ఈ సముద్రమంతయు మీదే యొనర్తునన్నట్లును ఆశ్రయించిన శిష్యులు ఉపకార స్మృతివలన శరీర అర్థ ప్రాణములు సదాచార్యుని కైంకర్యమున వినియోగపఱచునది యనిన శాస్త్ర ప్రకారము వారు సమర్పించిన బ్రహ్మరథమర్యాదల నంగీకరించి శేషత్వమనెడి మంచిమార్గమునకు అనుకూలమగు గృహస్థాశ్రమము కైంకర్యమునకు విరోధమని భయపడి వైరాగ్యముగల్గి శ్రీరంగనాధుని శ్రీపాదములందే మనసుగలవారై వ్యామోహితులైన శ్రీకులశేఖరాళ్వార్లు ఆచార్యస్థానమున నున్న మన పూర్వాచార్యులవంటివారిని గుణసామ్యమునుబట్టి నార కొంగ కురుకు పక్షులనుగ పేర్కొందురు.మిగిలిన పక్షులను నుపలక్షణముచే నిట్లే తెలియదగును.

అవ - మేఘముగ జెప్పిన దెవ్వరినన దెల్పుచున్నారు.

6. పూర్ణనాళ్ శీర్ కడలైఉళ్కొణ్డు తిరుమేని నన్నిఱమొత్తు ఉయిర్ అళిప్పాన్‌తీర్థకరరాయ్
సకాలమున గుణసంద్రమునజేరి తిరుమేని వర్ణమున సములై ప్రాణి సంరక్షణలో పవిత్రులై

**ఎజ్హుమ్ తిరిన్దు జ్ఞానప్రదత్తై పూరిత్తు తీఙ్గిన్ఱి వాఴ నితి శొరిన్దు**
అంతటను తిరుగుచు జ్ఞాన సరస్సును నిండించి చెడ్డలేక సుఖింప గుణనిధిని వర్షించి
**కొడుత్తతు నినైయాతే లజ్జిత్తు వెళిత్తొళిత్తు కణ్డు ఉకన్దు పరసమృద్ధియే పేఱాన**
ఇచ్చినది తలపక సిగ్గిల్లి పాలిపోయి చూచి సంతసించి పర సమృద్ధియే ఫలముగ
**అన్పుకూరుమ్ అడియవర్ ఉఱైయిలిడాతవర్ పుయమ్మైక్కొఅరుళ్‌మారి కుణమ్**
ముతలాళ్వార్లు భక్తిసారులు తిరుమంగై యాళ్వార్లు గుణములు
**తికళ్ కొణ్డల్ పోల్ వార్తై మేఘమెన్నుమ్.**
ప్రకాశించు రామానుజులు పోలిన వారిని మేఘమనిరి.

**వ్యా** - భగవదనుభవమునకు యత్నించిన కాలమున వాని కళ్యాణగుణసాగరమున ప్రవేశించి ఆ గుణములను లోన నణుచుకొని శరీరకాంతిచే వానితో సములై సంసారమునందలి ఆత్మలనురక్షించుటకై లోకమును పవిత్రమొనర్చువారై ఉజ్జీవించునట్టి మార్గమును జూపించువారై అంతటను సంచరించి జ్ఞానమను మడుగును తాము వర్షించునట్టి భగవద్గుణరూప జలములతో నిండించి కష్టమను మాటలేక అందరును, ఉజ్జీవించునట్లు భగవద్గుణములనెడి రత్ననిధిని వర్షించి తామొనర్చిన ఉపకారము చాలునా ! యని సిగ్గుపడి, ఇట్లుపకారము జేయుటకు అవకాశము కలుగనప్పుడు శరీరము శుష్కించిపోయియు, కల్గినప్పుడు వానియొక్క సమృద్ధినిజూచి సంతసించియు, వాని అతిశయమునే తమ అతిశయముగ తలచియుండువారును, కన్నీరుకార్చుచు ప్రేమపరవశులైనట్టి ముదలి ఆళ్వార్లను, దేవతాంతరములకు పరత్వములేదనియు భగవంతునకే పరత్వము కలదనియు ప్రతిపాదించునట్టి తిరుమழிశైయాళ్వార్లను, ఔదార్యమున మేఘమునుబోలి కృపను వర్షించు తిరుమంగై యాళ్వార్లను రామానుజులవంటివారిని గుణసామ్యమున మేఘముగ పేర్కొందురు.

**అవ** - ఆళ్వార్లు దూతలను పంపవలసివచ్చునట్లు సర్వేశ్వరుడు వీరికి కన్పించకుండుటకు కారణమును, దూతలను పంపుటకు హేతువును, నాల్గుమార్లు దూతలను పంపుటలోని విషయమును తెల్పుచున్నారు.

**7. నమ్పిఱైయుమ్ శిఱన్ద శెల్వముమ్ పడైత్తప్పరప్పుమ్ తమరోట్టై వాసముమ్ మఱప్పిత్త**
నా దోషమును సమృద్ధ సంపదను రక్షకజాగరూకత తమతో చేరు ప్రీతియు మరపించిన
**క్షమా దీక్షా సారస్య సౌన్దర్యఙ్గళై ఉణర్త్తుమ్ వ్యూహ విభవ పరత్వ ద్వయ**
క్షమ దీక్ష ఐకరస్య సౌందర్యములను తలచుకొని క్షీరాబ్ధి అవతార అంతర్యామి, పరమపద
**అర్చైకళ్ తూతు నాలుక్కుమ్ విషయమ్.**
అర్చలు దౌత్యములు నాల్గింటికి విషయము.

**వ్యా** - **అఞ్జిఱైయ (1-4) తివాయ్‌మొழிయందు** సర్వేశ్వరుడు తన **సౌలభ్యగుణముచే ఆళ్వా**

యొక్క తక్కువతనమును జూడక వీరితో కలుసుకొని , వీరి చలించు నట్టి మనో దోషమునుజూచి దూరముగపోయి వీరి యపరాధమునే మనస్సుననుంచుకొని తనయొక్క క్షమాగుణమును ప్రకాశింప జేయకపోయెనని తలచి, వానికి తన అపరాధసహత్వగుణమును జ్ఞాపకమొనర్చిన రాగలడని తలచి జగత్తును సృజించుటకై సముద్రమున పరున్నవాని సృష్టివలన ప్రయోజనము, ఈ చేతనుల వలన కైంకర్యమును గొనుటకే కదా ? యని తెల్పుడని వ్యూహమునకు దూతలనుపంపుటచే ఆళ్వార్ల దోషములను మరచి సర్వేశ్వరుడు తనక్షమాగుణమును జూపగలడని మొదటి దూత్యమునకు వ్యూహము విషయము.

వైకల్ (6-1) తిరువాయ్మొழியందు ఆర్తరక్షణదీక్షాపరతంత్రుడగు సర్వేశ్వరుడు తిరువణ్వణ్డూరులోని ఐశ్వర్యమునందు వ్యామోహపడి కష్టపడు వారి కష్టమును పోగొట్టెడి తన దీక్షను మరచిపోయెను గాన వాని కది తెలిపిన రాకమానడనియు, సీతాపిరాట్టికై రావణుని లంకను నాశమొనర్చిన అద్వితీయ వీరునికి వాని రక్ష్యవర్గములో నేనొకతె నున్నానని తెల్పుడని రెండవమారు పంపిన దూత్యమునకు విభవము (అవతారములు) విషయము.

పొన్నులకు (6-8) తిరువాయ్మొழியందు సృజింపబడిన జగత్తును రక్షించుటలో పరాకు గల్గి ఆశ్రితులతో తనకుగల ఐకరస్యమును మరచినందుచే నన్ను మరచినాడనియు,
వాని యాగుణమును జ్ఞప్తియొనర్చిన రాగలడని అతీంద్రియమగుటచే పరమపదము, పరత్వసమానమగు అంతర్యామి విషయముల మూడవ మారు దూత్యమొనర్చుట పరత్వద్వయ విషయము.

ఎజ్ఞానల్ (9-7) తిరువాయ్మొழியందు తనను ప్రేమించియుండు భాగవతులతో చేరియుండుటచే తనతో చేరనివారి ప్రాణములు నిలువలేనట్లొనర్చెడి తనదివ్యమంగళవిగ్రహ సౌందర్యమును మరచి, మనని విడిచిపోయెనంతియేగాని తన సౌందర్యమును జ్ఞాపకముజేసిన రాకమానడని పంపినట్టి నాల్గవ దూత్యము అర్చావతార విషయము.

అవ - అనేక తావులకు దూతలను పంపినచో సర్వేశ్వరుడొక్కడేయనెడి నిశ్చయము పోదా ? యనిన స్థలభేదముదప్ప వస్తుభేదములేదని తెల్పుచున్నారు.

**8. పకల్ ఓలక్కమిరున్దు కఱుప్పు ఉడుత్తు శోదిత్తు కార్యం మంత్రిత్తు వేట్టైయాడి**
పగలు సభలోనుండి నల్లబట్టల ధరించి ఊరుశోధించి పనులవిచారించి వేటాడి
**ఆరామజ్ఞళిలే విళైయాడుమ్ రాజనీతి యాతుం శోరామల్ శెజ్గోల్ నడావుకిఱ పారళన్ద**
ఉద్యానముల క్రీడించెడి రాజనీతి ఏకొద్దియు తగ్గక ఆజ్ఞను నడపించు భువినేలు
**ఎన్నుమ్ మూన్డుముడిక్కురియ ఇళ అరశుక్కు విణ్మీతు ఎన్గిఱ ఐదిలుమ్ కాణలామ్.**
అన్నట్లు త్రివిధపట్టమునకుతగిన యువరాజునకు పరత్వము అనునట్టి ఐదింటిలోచూడవచ్చును.

వ్యా - పరివారముచే సేవలుగొనుటకును తన ఆధిపత్యము తెలియుటకును కచేరిచేయుట ప్రజల దోష గుణముల నెఱుగుటకై మారువేషమున నగరశోధనమొనర్చుట, నిగ్రహానుగ్రహములకై రాజ్య

కార్యముల విచారించుట, దుష్టమృగముల వేటాడుట, శ్రమదీర ఉద్యానవనముల విహరించుట, యను నైదువిధముల రాజనీతి యున్నట్లు సర్వజగన్నాథుడగు సర్వేశ్వరుడు, ఉభయవిభూతులందును ఏకొఱతయులేక తన దివ్యాజ్ఞ నడిపించువాడై శ్రీమహాలక్ష్మియు తానును నిత్యముక్తులతో గూడి సభాస్థలిన నుండుటయు, అన్నిటియందును వ్యాపించియుండి వాటికి తెలియనట్లుండి వాటిని తానెఱిగియుండుటయు, క్షీరాబ్ధిని శయనించి యోగనిద్రనొనర్చి చేతనుల రక్షణోపాయముల యోజించియు, చేతన రక్షకై యవతరించి దుష్టసంహారమొనర్చియు విరోధి నిరసనశ్రమదీర ఉద్యానవనములతో గూడిన శ్రీరంగము తిరుమల మొదలగు దివ్యదేశముల నివసించుటయు, నీ యైదింటియందును జూడవచ్చును.

ఇందుచే పరత్వాదులకు స్థలభేదమేతప్ప వస్తుభేదము లేదని స్పష్టము.

**అవ** - పరత్వాదులైదును భగవదవతారములేయైయుండగా వీరు అర్చావతారమునందే మిక్కిలి ప్రీతిగలిగి మిగిలిన వానిని సమానముగ జూడకపోవుటకు కారణము దీనియొక్క గుణపూర్తియే యనుచున్నారు.

**9**. **తమరుకన్ద అడియోముక్కే ఎన్డుమ్ పిన్నానార్ వణఙ్గుమ్ ఇడత్తిలే**
భక్తులు ప్రేమించిన దాసుల రక్షించుటకే అనియు తర్వాతివారు ఆశ్రయింపదగు చోటనే
**ఎల్లామ్ పూర్ణమ్.**
అన్నియు పూర్ణము.

**వ్యా** - తమరుకన్ద అను పాశురమున భక్తులు ప్రేమించిన ద్రవ్యమే తనకు శరీరముగను వారిడిన పేరే తనకు పేరుగను గలిగి, దాసుల రక్షించుటకై పరత్వాదులవలె దేశదూరములుగాక ఆశగల్గినప్పుడు వెంటనే అనుభవించుట కనుకూలమై అవతారమునకు తరువాతివారును ఆశ్రయింపదగినట్లుండునట్టి అర్చావతారమునందు పై యవతారములకన్న నెక్కుడు గుణములు గలవని తెల్పినవారైరి. కావుననే అర్చావతారమునందెక్కుడు ప్రీతిగలవారైరి.

**అవ**- పరత్వాదులకు సాధారణములగు గుణములలో నొక్కొక్కటి ప్రధానముగా, నాయా దివ్యదేశముల జూపదలచి ముందుగ శ్రీరంగనాథుని గుణముల దెల్పుచున్నారు.

**10**. **వన్పెరువానకమ్ ముతలుయ్య ఇనితాక త్తిరుక్కణ్గళ్ వళర్కిన్ఱ తిరువాళన్**
ఊర్ధ్వలోకస్థులు భూలోకులుజ్జీవింప భోగ్యముగ శయనించి శ్రియఃపతి
**తిరుప్పతి వడివుడై క్కడలిడమ్ కట్కిలీ ఎన్నుమవత్తిల్ ఇవళ్ తిఱత్తు**
శ్రీరంగమున దివ్యదేహముగల్గి సంద్రమున కానరానివాడా అనువానియందు ఈమె విషయము
**ఎన్కొలో ఎన్గిఱ వ్యూహ సౌహార్దప్రధానమ్.**
ఎమగునో అనెడి వ్యూహ సౌహార్దము ప్రధానము.

వ్యా - నైమిత్తిక ప్రళయమున నశింపని బ్రహ్మాది ఉపరితన లోకములును వానియందలి బ్రహ్మాదులును భూమియు భూలోకస్థులు నుజ్జీవించునట్లు సంతసమున శయనించి యుండునట్టి శ్రియఃపతి యొక్క స్థానమగు శ్రీరంగమున తనతో సమానమగు దివ్యదేహములుగల నిత్యసూరులకు నిర్వాహకుడై సముద్రవర్ణుడై సముద్రమున శయనించి కనులకు కానరానివాడై ఈమెగతి ఏమి కాగలదు, ఈమె విషయమున నేమియాలోచించితివని ప్రార్థించునట్లు క్షీరాబ్ధిన యోగనిద్రయొనర్చు వ్యూహ గుణమగు సౌహార్దము శ్రీరంగమునందు మిక్కిలిగ ప్రకాశించును.

అవ - తిరుమలయందు ప్రకాశించు గుణమును దెల్పుచున్నారు.

**11.** మణ్ణోర్ విణ్ణోర్ వైప్పిల్ పోకిష్ణ ఏళులకుక్కు ఉయిర్ పాశమ్ వైత్త నిగరిల్
నిత్యులకు బద్ధులకు తిరుమల త్రికాలముల ఏడు లోకములకు ఆత్మయై ప్రేమించిన సాటిలేని
**వాత్సల్యమ్ ఉజ్జ్వలమ్.**
వాత్సల్యము ప్రకాశించును.

వ్యా - ఉభయవిభూతులలో నుండువారికై ఏర్పఱచబడిన నిధివలె నెల్లప్పుడును సకలాత్మలకును సర్వవిధబంధువై అన్నిటికిని ఆత్మయగు అంతర్యామిగుణమగు వాత్సల్యము తిరుమలయందు ప్రకాశించును.

అవ - ఆళ్వార్‌తిరునగరియందు ప్రకాశించు గుణమును దెల్పుచున్నారు.

**12.** ఉభయప్రధాన ప్రణవమాన ఉతైకోయిలిల్ ఎత్తేవుమ్ ఎన్నుమ్ పరేశత్వం పొలియుమ్.
జీవేశ్వరప్రధాన ప్రణవమగు ఆళ్వార్‌తిరునగరిన ఏదేవతైన అన్నట్టి పరఈశత్వము సమృద్ధము.

వ్యా -ఓమిత్యాత్మానం యుంజీత (ఓం అని ఆత్మను ధ్యానించవలెను) అనియు, ఓంకారోభగవాన్ విష్ణుః (ఓంకారము భగవంతుడగు విష్ణువు ) అనియు చెప్పియుండుటచే శబ్ద అర్థముల ప్రాధాన్యమును బట్టి ప్రణవము జీవేశ్వరులిద్దఱిని తెల్పునట్లు ఆళ్వార్లయొక్కయు సర్వేశ్వరుని యొక్కయు ఆధిక్యమునుదెల్పు తిరునగరియందు సకల పదార్థములును తన శరీరభూతమైయుండునట్టి ఐశ్వర్యముగల పరత్వలక్షణమగు ఈశ్వరత్వము వృద్ధియగుచుండును.

అవ - తిరుక్కురుంగుడి యందు ప్రకాశించు గుణమును దెల్పుచున్నారు.

**13.** వైష్ణవ వామనత్తిల్ నిఱైన్ద నిలమేనియిన్ రుచి జనక విభవ లావణ్యమ్ పూర్ణమ్.
శ్రీవైష్ణవ వామనమున పూర్ణమై నీలపుమేనిన రుచిని పుట్టించు విభవ లావణ్యము పూర్ణము.

వ్యా - తిరుక్కురుంగుడి యని జెప్పక శ్రీవైష్ణవవామనక్షేత్రమనుటకు వామనావతారమున తాను యాచకుడైనట్లు తిరుక్కురుంగుడినంబి రామానుజులను యాచించి మంత్రమునొంది వైష్ణవనంబినైతినని సంతసించుటయే కారణము. అట్టి తిరుక్కురుంగుడియందు నీలమేఘనిభశ్యామమగు దివ్య

మంగళవిగ్రహమునందు విభవావతారమున ప్రకాశించునట్టి సముదాయశోభయగు లావణ్యము సంపూర్ణముగ గలదు.

**అవ** - శిరీవరమంగలము నందలి ప్రధానగుణమును దెల్పుచున్నారు.

**14. రుచివివశర్కు పాతమే శరణాక్కుమ్ ఔదార్యమ్ వానమామలైయిలేకొళ్ళున్దు విడుమ్.**

రుచివివశులకు పాదమునే రక్షకమొనర్చునట్టి ఔదార్యము వానమామలైయందు విస్తరించి యుండును.

**వ్యా** - ముందుజెప్పిన లావణ్యమువలన నొక్కరిచేతను మాన్పింపరానియట్లు కలిగిన రుచి వలన పరవశులై అనన్యసాధనులగువారికి తన శ్రీపాదములనే ఉపాయముగా నొసగినట్టి ఔదార్యగుణము శిరీవరమంగలమనెడు వానమామలైయందు వర్ధిల్లును.

**అవ** - కుంభకోణము నందలి గుణమును దెల్పుచున్నారు.

**15. కళైకణత్తారై ఉరుక్కుమ్ మాధుర్యమ్ కుడమూక్కులే ప్రవహిక్కుమ్.**

రక్షలేనివారిని శిథిలులజేయు మాధుర్యము కుంభకోణమున ప్రవహించును.

**వ్యా** - నా దుఃఖమును బోగొట్టినను పోగొట్టకపోయినను నీ కన్న వేరొకరక్షకుడు లేడనెడి నిశ్చయము గలవారు నీటివలె కరిగి శిథిలులగునట్లు చేసెడిదియు నింకను ఆశనుపుట్టించునట్టి మాధుర్యము కుంభకోణమున ప్రవహించుచుండును.

**అవ** - తిరువల్లవాళ్ నందలి గుణమును దెల్పుచున్నారు.

**16. మెలివిలుమ్ శేమమ్ కొళ్విక్కుమ్ కృపై తెన్నగరిలే నిత్యమ్.**

బాధయందును రక్షకమని నమ్మునట్లొనర్చు కృప తిరువల్లవాళ్ న నిత్యము.

**వ్యా** - నిరతిశయభోగ్యమగు భగవద్విషయమును శీఘ్రముగ ననుభవింపగోరి యది లభింపనందున మిక్కిలి బాధపడుచున్నను, సర్వేశ్వరుడే రక్షకమను నిశ్చయముతో నుండునట్లొనర్చు, వాని కృపయే సుందరనగరమగు తిరువల్లవాళ్ దివ్యదేశమున నిత్యముగ నుండును.

**అవ** - తిరువణ్వణ్డూరు నందలి గుణమును దెల్పుచున్నారు.

**17. వ్యవసాయజ్ఞర్ రక్షణస్థైర్యమ్ పంపోత్తరదేశస్థమ్.**

విశ్వాసపాత్రుల రక్షణస్థైర్యము పంపోత్తరదేశమున గలదు.

**వ్యా** - ఆర్తుల రక్షించుటలోని సర్వేశ్వరుని అధ్యవసాయమును బాగుగ తెలిసి విశ్వసించియుండు

వారిని రక్షించుటలో నత్యజేయమ్ (విడనాడను) అనియు, ఏతద్వ్రతంమమ (అదినాదీక్ష) అనియు, అనుకూలులచేతను చలింపజేయరానట్టి సర్వేశ్వరుని స్థైర్యరూపగుణము పంపానది ఉత్తరతీరమందలి తిరువణ్ వణ్డూరునందు స్థిరముగ నుండును.

అవ - తిరువిణ్ణగరమందలి గుణమును దెల్పుచున్నారు.

**18. విళంబ విరోధమ్ అప్పికుమ్ విరుద్ధఘటనాసామర్థ్యమ్ నన్నగరిలే విస్తీర్ణమ్.**

ప్రణయరోషమును పోగొట్టునట్టి అఘటితఘటనా సామర్థ్యము తిరువిణ్ణగరిన అధికము.

వ్యా - క్రమప్రాప్తిలో సర్వేశ్వరుని పొందుటను సహింపక త్వరపడెడి నాయిక, సర్వేశ్వరుడు ఆలస్యముగ వచ్చినందులకు సహింపక మాగోష్ఠికి రావలదనియు పొమ్మనియు తెలియబఱచెడి ప్రణయకోపము వలన కలిగిన విరోధమును పోగొట్టుటయనెడి సామర్థ్యము, విరుద్ధవిభూతులగు దారిద్ర్యము సంపద, స్వర్గము నరకము, మొదలగువానిని , సంఘటింపజేయగల అఘటితఘటనా సామర్థ్యము మంచినగరమనిచెప్పబడిన తిరువిణ్ణకరమున విస్తరించియుండును.

అవ - తులైవిల్లిమంగల మందలి గుణమును దెల్పుచున్నారు.

**19. ఘటిత ఘటక విఘటనా బాన్ధవమ్ అవ్వూరిలే ద్విగుణమ్.**

ఆశ్రితులను ఘటకులను ఆశవదలజేయు బాంధవ్యము ఆవూరిలో రెట్టింపు.

వ్యా - పురుషకారభూతుల ద్వారా సర్వేశ్వరుని బొందినవారినిన్ని అట్లు పొందించిన పురుషకారభూతులనున్ను ఇక యీమెను మరలించుట సాధ్యముగాదుగాన, నామెపై మీరు ఆశను విడువుడు అనదగినట్లు విడదీయగల బాంధవ్యము, తులైవిల్లిమంగలమని నాయిక చెప్పినంతటి భోగ్యముగ చెలికత్తె జెప్పిన ఉండదనెడి భావనతో ఊరిపేరును చెప్పక అవూరు అనదగినట్టి తులైవిల్లిమంగలమను దివ్యదేశమున ద్విగుణీకృతముగ నుండును.

అవ - తిరుక్కోళూరునందలి గుణమును దెల్పుచున్నారు.

**20. కైమ్ముదల్ ఇழన్దార్ ఉణ్ణుమ్ నిధియిన్ ఆపత్సఖత్వమ్ పుకుమ్ ఊరిలే సమృద్ధమ్.**

చేతిపట్టు వదలినవారు అనుభవించు స్వామియొక్క ఆపత్సఖత్వము చేరిన ఊరిలో సమృద్ధము.

వ్యా - ప్రాప్యవస్తువగు సర్వేశ్వరుడు లభింపనందున గల్గిన యార్తిచే పరవశించి ఆభాస ప్రాప్యప్రాపకములనెడి కంకణములు జారిపోపుట లోకమర్యాదనతిక్రమించుట మొదలగునవి తమంతటనే విడిచిపోయినందున ధారక పోషక భోగ్యవస్తువులన్నియును సర్వేశ్వరుడే యని అనుభవింపదగినట్లు

చేర్చబడిన నిధి యని చెప్పదగినట్లు అపత్కాలమున నుపయోగపడెడి సర్వేశ్వరుని ఆపద్రక్షకత్వము నాబిడ్డ తిరుక్కోళూరున ప్రవేశించినది (చేరినది) అని చెప్పదగిన తిరుక్కోళూరునందు సమృద్ధముగా నుండును.

అవ - తెన్ తిరుప్పేరై యందలి గుణమును దెల్పుచున్నారు.

**21. శెన్రు శేర్ వార్క్కు ఉశాత్తునై అఱుక్కుమ్ సౌన్దర్యమ్ మానగరిలే ఘోషిక్కుమ్.**

వెళ్ళి చేరువారికి కూడుమనస్సునపహరించు సౌందర్యము మహానగరమున శబ్దించును.

వ్యా - క్రమప్రాప్తిలో సర్వేశ్వరుని పొందుటను సహించియుండజాలక, ప్రేమచే హితమును చెప్పువారల మాటలనుగూడ వినకుండ సర్వేశ్వరుడున్న చోటునకే పోయి ప్రవేశింపగలమను నాయిక మనస్సును అపహరించునట్టి సౌందర్యముగల వాని మహానగరమనబడు తిరుప్పేరై దివ్యదేశమున భగవద్విషయము ననుభవించుటచే గల్గిన సంతోషాతిశయము వలన నచ్చటి భాగవతోత్తములు పాడునట్టి సామవేదధ్వని తెలియవచ్చును.

అవ - తిరువాఱన్విళై దివ్యదేశమందలి గుణమును దెల్పుచున్నారు.

**22. ప్రవణ చిత్తమ్ పరత్వ విముఖమాక్కుమ్ ఆనన్దవృద్ధి నీణకరిలే.**

ప్రీతిగల మనసు పరత్వ విముఖమొనర్చు ఆనందవృద్ధి గొప్పనగరిన.

వ్యా - అవిద్యాదులు జీవాత్మతో సంబంధమును వదలి జ్ఞానపూర్తిగల పరమపదమును జేర్చుటకు సన్నద్ధమైవచ్చినను, నా మనస్సు తిరువాఱన్విళైయను దివ్యదేశమున కైంకర్యముజేయుటకే ఆశించునని ఆళ్వార్లన్నట్లు పరమపదముయొక్క పేరును తలుచుటయు అసహ్యమగునట్లు విముఖులనుగా జేయునట్టి ఆనందసమృద్ధి గొప్పనగరమని చెప్పబడిన తిరువాఱన్విళైయందు స్పష్టముగ తెలియవచ్చును.

అవ - తిరుక్కుళందై యందలి గుణమును తెల్పుచున్నారు.

**23. సాదరరై ప్పరిశు అழிక్కుమ్ చేష్టితాశ్చర్యమ్ కుళత్తే కొడివిడుమ్.**

ఆదరణస్త్రీల సిగ్గును చెడగొట్టు ఆశ్చర్యచేష్టితము క్కుళందలో ధ్వజమెగురును.

వ్యా - సర్వేశ్వరుని విషయమున ఆదరణకలవారిని స్త్రీలకుండవలసిన ధర్మములగు లజ్జాదులను పోగొట్టిన ఆశ్చర్యముగల్గించు చేష్టితములు తిరుక్కుళందయను దివ్యదేశమున కట్టిన మేడల ధ్వజముల ప్రకాశించును.

అవ - తిరువణ్పరిశారమందలి గుణమును దెల్పుచున్నారు.

**24. శ్రమమ్ మనమ్ శూఴుమ్ సౌకుమార్య ప్రకాశమ్ అచ్చేరియిలే.**
శ్రమకు మనసు భ్రమించు సౌకుమార్య ప్రకాశకము తిరువణ్పరిశారమున.

**వ్యా** - మిక్కిలిప్రీతిగల నిత్యసూరులచే సేవలగొనుచు సుకుమారమగు శరీరముతో పరమపదమున నున్నవాడు, సంసారమున నవతరించి జీవుల కష్టముల తొలగించుటకై పడిన శ్రమను భూమిని గొలుచుటచే గలిగిన శ్రమను తలచుకొని మనోవ్యాకులయై ఆళ్వార్ నాయిక భ్రమించునట్లు కొండల మోయు భారమువలె, శంఖచక్రముల ధరించియున్న సర్వేశ్వరుని సౌకుమార్యము, నమ్మాళ్వార్ల తల్లిగారగు ఉడైయనంగైమీర్ పుట్టిల్లగు తిరువణ్పరిశారమున చూడవచ్చును.

**అవ** - తిరుచ్చిత్తారునందలి గుణమును దెల్పుచున్నారు.

**25. మహా మతికళ్ అచ్చమ్‌కెట్టు అమరుమ్ శౌర్యాదికళ్ చ్చిత్తాత్తిలే క్కొఴిక్కుమ్.**
మహామతులు నిర్భయులై యుండునట్టి శౌర్యాదులు చ్చిత్తారున ప్రకాశించును.

**వ్యా** - సంస్పృశన్నాసనంశౌరేః విదురస్సమహామతిః (దూరదర్శియగు విదురుడు అనుమానముచే శ్రీకృష్ణుని ఆసనమును తడివిచూచెను, అన్నట్లు భగవానుని సౌకుమార్యమును దలచుకొని వానికేమి యాపత్తుగల్గునోయని భయపడెడి విదురాది మహామతుల భయముతీరునట్లు శౌర్య వీర్య పరాక్రమ ములు తిరుచ్చిత్తాఱు దివ్యదేశమున ప్రకాశించును.

**అవ** - తిరుక్కడిత్తానము నందలి గుణమును దెల్పుచున్నారు.

**26. సాధ్య హృదిస్థనాయుమ్ సాధనమ్ ఒరుక్కడుక్కుమ్ కృతజ్ఞతాగన్ధమ్ తాయప్పతియిలే.**
ఆళ్వార్ల హృదినుండియు సాధనమున సమముగ వసించు కృతజ్ఞతాగంధము దాయభాగమున.

**వ్యా** - సాధ్యమగు(ఫలమగు) ఆళ్వార్ల హృదయ నివాసము సిద్ధించినను, సాధనమగు దివ్యదేశ మును వదలకుండుటకు కారణము, ఈదివ్యదేశమున నుండుటచేకదా ఆళ్వార్లులభించిరనెడి కృతజ్ఞ తారూప పరిమళము తనకు దాయభాగముగా లభించినట్లు తలచియుండు తిరుక్కడిత్తానమను దివ్య దేశమున ప్రకాశించును.

**అవ** - తిరుప్పులియూరునందలి గుణమును దెల్పుచున్నారు.

**27. అవగాహిత్తారై అనన్యార్హమాక్కుమ్ నాయకలక్షణమ్ వళమ్ పుకఴుమ్ ఊరిలే**
మునిగినవారిని అనన్యార్హమొనర్చు నాయకలక్షణము తిరుప్పులియూరున
**కుట్టమిడుమ్.**
సంపూర్ణము.

**వ్యా** - సర్వేశ్వరుడు తన అనుగ్రహమున మునిగినవారిని అనన్యార్హులనుగా (ఇతరులకు తగనివారి

నిగ) జేయునట్టి నాయక లక్షణములగు అవయవ ఆభరణ శోభలు ఆళ్వార్లు కొనియాడదగిన ఐశ్వ ర్యముగల తిరుప్పులియూరున సంపూర్ణముగ నుండును.

**అవ** - తిరుప్పుళింగుడి, తిరువరకుణమంగై శ్రీవైకుంఠములందలి గుణమును దెల్పుచున్నారు.

**28. భోగ్య పాక త్వరై తెళిన్ద శన్దైక్కు మున్నిల్ మూన్రిలుమ్ ప్రకటమ్.**

భోగ్యతా పరిపక్వత్వర తెళిన్ద పా.నకు ముందటి మూటియందును తెలియును.

వ్యా - మిక్కిలి ఆకలిగొన్నవాడు అన్నము ఉడుకుటకు ముందగనే త్వరపడి దానిదగ్గరనే పడుకుని కూర్చుని, నిల్చుని యుండునట్లు , భోగ్యభూతులగు ఆళ్వార్లకు పరమభక్తి రూపమగు పరిపక్వత గల్గువరకును,సర్వేశ్వరునికి గల త్వర, తెళిన్దవెన్శిన్దై అను పాశురమునకు ముందు జెప్పబడిన పుళిఙ్గుడి కిడన్దు, వరకుణమఙ్గై యిరున్దు, వైకున్దత్తుణిత్తు అన్నట్లు తిరుప్పుళింగుడిన పరుండి, వర కుణమంగైన కూర్చుని, వైకుంఠమున నిల్చుని యుండుటచే నా మూడు దివ్యదేశముల యందును సర్వేశ్వరుని ఆర్తితెలియవచ్చును.

**అవ** - తిరుక్కాట్కరై యందలి గుణమును దెల్పుచున్నారు.

**29. భోగత్తిల్ తట్టుమాఱుమ్ శీలమ్ కాట్ క్కరైయిలే కరై అళిక్కుమ్.**

భోగదశన తల్లక్రిందులౌ సౌశీల్యము తిరుక్కాట్కరై గట్లను త్రెంచును.

వ్యా - భోగ్యభూతులగు నమ్మాళ్వార్లతో కలిసిమెలసియుండునప్పుడు, సర్వేశ్వరుడే శేషభూతుడై చేతనుని శేషినియొనర్చునట్లు జేయు స్వభావము తిరుక్కాట్కరై దివ్యదేశమున పొర్లిపోవునట్లు పొంగియుండును.

**అవ** - తిరుమూళిక్కళము నందలి గుణమును దెల్పుచున్నారు.

**30. మహాత్మాక్కళ్ విరహమ్ సహియాత మార్దవమ్ వళత్తిన్కుళత్తే కూడుపూరిక్కుమ్.**

మహాత్ములను విడనాడి సహించలేని మార్దవము మూళిక్కళమున నిండియుండును.

వ్యా - సర్వేశ్వరునియొక్క దివ్యమంగళవిగ్రహమును సేవింపవలెననెడి యాశచే భోగమోక్షముల నుగూడ తృణీకరించునట్టి మహాత్ములను విడనాడియుండుటను సహింపజాలని మార్దవము తిరు మూళిక్కళమున నిండియుండును.

**అవ** - తిరునావాయ్ దివ్యదేశమునందలి గుణమును దెల్పుచున్నారు.

**31. పిఱిన్ద తున్బక్కడల్ కడత్తుమ్ విష్ణుపోతఆనృశంస్యమ్ నావాయిలే నిళల్ ఎళుమ్.**

ఎడబాసిన దుఃఖసంద్రము దాటించు విష్ణునావదయ తిరునావాయిన ప్రతిబింబించును.

వ్యా - ఒకరికిపైగా నొకరిని దూతలుగా పంపదగినట్లు తనను యెడబాయుటవలన గల్గిన దుఃఖసాగరమును దాటించునట్టి నావవంటి విష్ణువుయొక్క కృపయనెడి గుణము తిరునావాయ్‌యందు తెలియవచ్చును. నావాయ్ ఉఱైకిన్ఱ (నావగా నివసించుచున్న) యనుటచే సర్వేశ్వరుడు నావగా నుండి ఆ దివ్యదేశము నాశ్రయించిన వారిని సంసారసముద్రమునుండి దాటించుననెడి ప్రసిద్ధియుండుటచే నా దివ్యదేశమున కాపేరు వచ్చెనని యభిప్రాయము.

అవ - తిరుక్కణ్ణపురము నందలి గుణమును దెల్పుచున్నారు.

**32. శరణ్య ముకున్దత్వమ్ ఉత్పలావతకత్తిలే ప్రసిద్ధమ్.**

శరణాగత మోక్షప్రదత్వము ఉత్పలావతకమున ప్రసిద్ధము.

వ్యా - తిరుక్కణ్ణపుర దివ్యదేశమున ఉత్పలావతకమను విమానమున వేంచేసియున్న శౌరిరాజస్వామి శరణాగతులకు మోక్షమునిచ్చువాడని ప్రసిద్ధము.

అవ - తిరుమోగూరు నందలి గుణమును దెల్పుచున్నారు.

**33. మార్గ బంధు శైత్యమ్ మోహనత్తే మడువిడుమ్.**

మార్గబంధువు శైత్యము మోహనక్షేత్రమున నిండియుండును.

వ్యా - మోక్షమునకు పోవువారి శ్రమను దీర్చునట్టి శైత్యగుణము మార్గబంధువగు మోహనక్షేత్రమనబడు తిరుమోగూరు నందలి సర్వేశ్వరుని యందు నిండియుండును.

అవ - తిరువనంతపురమునందలి గుణమును దెల్పుచున్నారు.

**34. ససైన్య పుత్ర శిష్య సాధ్య సిద్ధ భూసురార్చనత్తుక్కు ముఖ నాభి**

విష్వక్సేన బ్రహ్మ శిష్యులు సాధ్య సిద్ధులు బ్రాహ్మణులు అర్చించ ముఖ నాభి

**పాదఙ్గళ్ ద్వారత్రయత్తాలే కాట్టుమ్ సామ్యమ్ అనంతశయనత్తిలే వ్యక్తమ్.**

పాదములు మూడు వాకిళ్ళ చూపునట్టి సామ్యము అనంతపురమున ప్రకాశించును.

వ్యా - సర్వేశ్వరుని సర్వసైన్యాధిపతులగు విష్వక్సేనులు మొదలగు సాధ్యులును, పుత్రులగు, బ్రహ్మాది సిద్ధులును, ఆళ్వార్ల ఉపదేశములను విసనట్టి శిష్యులును బ్రాహ్మణులును పూజించుటకు అనుకూలముగా తిరుముఖమండలమును, నాభికమలమును, శ్రీపాదములను మూడు ద్వారముల గుండా చూపించుచు నిత్యసూరులనియు సంసారులనియు పక్షపాతములేక సమబుద్ధితో జూచునట్టి సామ్యగుణము తిరువనంతపుర దివ్యదేశమున పవళించియున్న స్వామియందు స్పష్టముగ తెలియవచ్చును.

అవ - తిరువాట్టారునందలి గుణమును దెల్పుచున్నారు.

**35. మోక్షదానత్తిల్ ప్రణతపారతన్త్ర్యం వళమ్మిక్కనదియిలే కర్రై పురళుమ్.**

మోక్షమిచ్చుటలో ఆశ్రిత పారతన్త్ర్యము తిరువాట్టారున గట్టుపొర్లును.

**వ్యా** - సర్వేశ్వరుడు సర్వసమానుడై ఆశ్రితులకు మోక్షమునిచ్చునపుడు వారు నియమించిన ప్రకారమే చేయువాడై యుండుననెడి ఆశ్రితపారతంత్ర్యము గొప్ప సంపదగల తిరువాట్టారను దివ్య దేశమున సుస్పష్టము.

**అవ** - తిరుమాలిరుంశోలై యందలి గుణమును దెల్పుచున్నారు.

**36. త్యాజ్య దేహవ్యామోహమ్ మరుళ్‌గళ్ కడియుమ్ మయల్ మికుపొళ్గిలిలేతళైక్కుమ్.**

విడుతగిన శరీర వ్యామోహము అజ్ఞానము పోగొట్టెడి తిరుమాలిరుంశోలైన చిగుర్చును.

**వ్యా** - ముముక్షువులకు త్యాజ్యమగు దేహవ్యామోహమును, అది చరమ శరీరమగుటచే ప్రియురాలి ఉచ్ఛిష్టమును (ఎంగిలిని) ఆదరించునట్టి ప్రియునివలె, వంచకుడై మనస్సుతోను ఆత్మతోను కలసిమెలిసియుండి, దివ్యదేశములన్నిటియందలి ప్రీతిని యీయొక్క దివ్యదేశమునందే చూపుచు, అజ్ఞానమును, బోగొట్టెడి, భోక్తలను మైమరపించునట్టి తోటలుగల దక్షిణతిరుపతియనబడు, తిరుమాలిరుంశోలై యందు ఆశ్రితపారతంత్ర్యము సుస్పష్టము.

**అవ** - తిరుప్పేర్రై యందలి గుణమును దెల్పుచున్నారు.

**37. అంగీకరిక్క అవకాశం పార్కుమ్ స్వామిత్వం పెరునకరిలే పేర్‌పెత్తతు.**

స్వీకరించు అవకాశముజూచెడి స్వామిత్వము తిరుప్పేర్‌న పేరొందినది.

**వ్యా** - సర్వేశ్వరుడున్న దివ్యదేశముయొక్క తిరునామమ్మును చెప్పినమాత్రముననే మనసున ప్రవేశించినాడని చెప్పదగినట్లు అంగీకరించుటకు సుకృతలేశమున్ను లేనట్టివారికిన్ని ఒడిలో మామిడికాయను తానేపెట్టి యిది నీ వద్ద నున్నదనువారివలె, నావూరును నాపేరును చెప్పితివనెడి అజ్ఞాత సుకృతము నారోపించి స్వీకరించు నవకాశమునకై నిరీక్షించెడి స్వామిత్వగుణము పెరునకరమనబడెడి తిరుప్పేర్రై యందు ప్రసిద్ధమై యున్నది.

**అవ** - ఆళ్వార్లకు దివ్య దేశములందు ప్రీతి యెప్పుడు కల్గినది, వీరి ప్రబన్ధము నే వయసులో రచించిరి, దీనిని చదువుటకు అధికారి నియమము గలదా, వీని భోగ్యత యెట్టిది అను విషయముల దెల్పుచున్నారు.

**38. ఇవత్తిల్ ప్రావణ్యమ్ ఇవళ్ పరమేఎన్న ఉణ్డామ్ షోడశకళాపూర్ణమాన**

వీనియందు ప్రీతి ఈమెకు భారమాఅన్నపా.న. ఉన్నదై 16కళలు నిండిన

**చన్ద్రమణ్డలమ్పోలే పదినారు తిరునక్షత్రమ్ నిఱమ్బినవాతే దేవభోగ్యమాన అతిల్**

చంద్రమండలమువలె పదహారు సం. వయసు నిండగనే దేవభోగ్యమైన చంద్రుని

**అమృతమొప్పాలన్ఱిక్కేయెన్నా తమిళ్గర్ ఇశైకారర్ ముదల్ పత్తర్ వానవర్ ఎన్నమ్మాన్**

అమృతమువలెగాక నా కవిత ద్రవిడులు స్వరజ్ఞానులు శ్రేష్ఠ భక్తులు నిత్యులు నాస్వామి

**పార్ పరవెన్నుంబడి సేశ్వర విభూతి యోగ్యమాన పాలోదముతన్నమెన్మొళ్గి**

భూ వ్యాప్తమన్నట్లు ఈశ్వరునితో, విభూతులకు తగినట్లు పాలుసుధవంటి మృదువాక్కు

**ముకమ్ శెయ్తతు.**

వీరిద్వారా చెప్పబడినది.

వ్యా - ఆళ్వార్లకు దివ్యదేశములందలి అర్చావతార విషయమున ప్రావణ్యము, వయసువచ్చుటకు ముందుగనే కలిగినదై ,పదునారు కళలతో పూర్ణమగు చంద్రమండలమువలెనే పదునారు సంవత్సరములు రాగానే, దేవతలు పానమొనర్చెడి చంద్రమండలము నందుండు అమృతమువంటిదిగాక, తాననియు, ఇతరులనియు, నిత్యులనియు, సంసారులనియు, పరిపాలకులనియు, పాలింపబడువారనియు, నిట్టి భేదములు లేక సర్వేశ్వరునితోగూడ ఉభయ విభూతులలోనివారును అనుభవించుటకు యోగ్యమైనదై పాలతో గలిసిన అమృతమువలెనున్న వాచ్యవాచక సంబంధము వలన మిక్కిలి భోగ్యమైనదై, అనుభవించినవారికి జన్మమరణరూపమగు సంసారసంబంధము గలుగకుండ నిత్యత్వము నిచ్చునట్టి మార్దవమగు శబ్దరూపమగు తిరువాయ్మొళ్గి దివ్యప్రబన్ధము ఆళ్వార్లవాక్కు నుండి బయల్పడినదాయెను.

అవ - ఆళ్వార్లు సర్వేశ్వరునిపై కవిత్వము చెప్పవలెనని సంకల్పించి యీ ప్రబన్ధమును సాధించిరా యని, దీని అవతరణ క్రమమునుగూర్చి తెల్పుచున్నారు.

**39. నీర్ పాల్ నెయ్యముతాయ్ నిరంబిన ఏరి నెళిక్కుమాపోల్పేపరభక్త్యాదిమయ**

నీరు పాలై నెయ్యి,అమృతమై నిండిన చెరువు గట్టుతెగినట్లు పరభక్త్యాదులతోగూడిన

**జ్ఞానామృతాబ్ధి నిమిక్కిళ వాయ్కరై మిడైన్ను మొళ్గిపట్టు అవావిలన్దాదియెన్ను**

జ్ఞానామృతసంద్రము పొంగి పెదిమలను త్రోసుకొని పాశురములై ఆర్తితో చివర మొదలుగ

**పేర్పెత్తతు.**

ప్రసిద్ధమైనది.

వ్యా - పశువులు త్రాగిన నీరు, పాలై నెయ్యిగమారి అమృతమై నిండిన చెరువు గట్టుతెగి పొర్లిపోయినట్లు, భగవదనుగ్రహము, కర్మజ్ఞానములవలన కల్గిన భక్తివలెగాక పరభక్తి పరజ్ఞాన పరమభక్తులుగనై, నిండి పొర్లి పెదిమెలనెడి గట్లను త్రోసుకొని శబ్దరూపముగ బయల్పడి ప్రవాహమై ప్రతిపాశురము యొక్క చివరిపదము తరువాతి పాశురము యొక్క మొదటిపదమగునట్లు వేయిగనై ఆళ్వార్ల పరమభక్తి ప్రేరణవల్ల నవతరించిన తిరువాయ్మొళ్గి దివ్యప్రబన్ధమని ప్రసిద్ధినొందెను.

**అవ** - తిరువాయ్‌మొళ్లి దివ్యప్రబన్ధమున ప్రతిపాదింపబడిన అర్థములను క్రమముగ జెప్పదలచి, మొదట, ఆళ్వార్లు సంసారులకుపదేశించుటనుబట్టి భగవానుని ఉపదేశ రూపమగు భగవద్గీతతో సామ్యమును తెలుపుచుండిరి.

**40.** **మనమ్‌శెయ్ ఎల్లైయిల్ ఞానఇన్పత్తై నిర్మలమాక వైత్తవర్ ఞానప్పిరానై**
సంకల్పరూప హద్దులేని జ్ఞానానందమును నిర్మలముగచూచిన ఆళ్వార్లు వరాహస్వామిని
**ఞానత్తువైమ్మిన్ ఎన్లఇతు తత్వవివేక నిత్యానిత్యత్వ నియన్తృత్వ సౌలభ్య**
మనస్సుననుంచుడు అన్నఇది తత్వవివేకము నిత్యానిత్యత్వము శాసకత్వము సౌలభ్యము
**సామ్య అహంకార ఇంద్రియదోషబల మనఃప్రాధాన్య కరణ నియమన**
సమభావము అహంకారము ఇంద్రియదోషబలము మనఃప్రాధాన్యము ఇంద్రియ నియమనము
**సుకృతిభేద దేవాసురవిభాగ విభూతియోగ విశ్వరూపదర్శన సాంగభక్తి-ప్రపత్తి**
పుణ్యాత్ములభేదము దేవాసురవిభాగ విభూతియోగ విశ్వరూపదర్శన సాంగభక్తి- ప్రపత్తి
**ద్వైవిధ్యాదికళాలే గీతాసమమెన్నుమ్.**
రెండువిధములవలె గీతతో సమానము.

**వ్యా** - సంకల్పరూపమై అపరిచ్ఛేద్యమై సర్వకారణమై అంతటను వ్యాపించియుండి ఉజ్వలమగు జ్ఞానానందలక్షణమగు సర్వేశ్వరుని, విశదముగ మనస్సున సాక్షాత్కరించిన శ్రీమన్నమ్మాళ్వార్లు, ఉజ్జీవించవలెనన్న ఞాలప్పిరాన్ అనబడు శ్రీ వరాహస్వామిని ఆతడు నిత్యనివాసమొనర్చు దివ్యదేశమును మనసున నుంచుకొనుడని పరోపదేశమొనర్చిరి. శ్రీకృష్ణుడు గీతయందు ధర్మాధర్మముల యందు వ్యాకులపడిన అర్జుననకు ప్రకృత్యాత్మలకుగల భేదమును తెల్పుటచే **తత్వవివేకమును**, ఆత్మ నిత్యత్వము, దేహ అనిత్యత్వమును, సకలమున వ్యాపించి అన్నిటిని శాసించుటను, భక్తులకై అవతరించెడి వాని సౌలభ్యమును, అందరిచేతను ఆశ్రయింపదగియుండుటచే సామ్యమును, చేతనుడే కర్తననుకొనుటచే కల్గెడి అహంకారస్వరూపదోషమును, ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః అని అసంశయం మనోదుర్నిగ్రహం చలం అని ఇంద్రియ ప్రాబల్యమును, మనస్సు యొక్క ప్రాధాన్యమున్ను సర్వద్వారాణిసంయమ్య అని ఇంద్రియవశ్యతను, ఆర్తః జిజ్ఞాసుః అని నాల్గు విధములగు సుకృతుల భేదమును, ద్వౌభూతసర్గౌ అని దేవాసురవిభాగమును, నాస్త్యంతో విస్తరస్యమే అని విభూతియోగమును, పశ్యామి యని విశ్వరూపసందర్శనమునున్ను, మన్మనాభవ యని అంగసహితమగు భక్తినిన్ని, దైవీ హ్యేషా యనియు సర్వధర్మాన్ అనియు అంగప్రపత్తి స్వతంత్ర ప్రపత్తులనున్ను ఉపదేశించినట్లే, శ్రీనమ్మాళ్వార్లు, **అడియేనుళ్ళాన్** అనుటచే జీవ పర మాత్మల భేదమును, **శెన్రుశెన్రు** అనుటచే దేహము కంటెను విలక్షణమను ప్రకృత్యాత్మవివేకమగు తత్వమును, **మిన్నిన్నిలైయిల** అనియు **ఉళ్ళతుమిల్లతుమ్** అనుటచే చిత్తుఅచిత్తుల నిత్యత్వానిత్య త్వములను,**ఉడల్మిశై**, **కరన్దశిల్** అనుటచే సర్వేశ్వరుని నియన్తృత్వమును **పత్తుడై**, పలపిఱ

ప్పాయ్ అనుటచే సర్వేశ్వరుని సౌలభ్యమును, ముత్తవుమ్ నిన్దనన్ అని సర్వజనసాధారణమగుట ను, నీర్నుమతు అనుటచే అహంకారరూపమగు దోషమును, విణ్ణులార్ అనుచోట ఇంద్రియ బలము ను, మనత్తైవలిత్తు అని మనఃప్రాధాన్యమును, ఉళ్ళమురైశెయల్ అని ఇంద్రియనియమనమును, పెరునాడుకాణ అని ఆర్తుని, ఇఱుకల్ అని కేవలుని, గుణంగొళ్ అని అర్థార్థిని, తిరునారణన్‌తాళ్ అని జ్ఞానిని చెప్పుటచే సుకృతుల భేదమును, అరక్కరశురర్ పిఱన్దిరుళ్ళిరేల్ అని దేవాసుర విభా గమును, పుకళ్ళునల్లొరువన్, నల్కురవుమ్ అని విభూతియోగమును, నీరాయ్ అని విశ్వరూప దర్శ నమును, వణక్కుడై, మేవిత్తొళ్ళుమ్, మాలైనణ్ణి అనుటచే అంగభక్తిని న్నీ, అవనుడై ఉణర్వుకొణ్డు ఉణర్న్దు అని అంగప్రపత్తిని, శరణమాకుమ్ అని స్వతంత్ర ప్రపత్తినిన్నీ ఉపదేశించుటచే తిరువాయ్ మొళ్ళికి భగవద్గీతతో సామ్యము చెప్పబడినది.

**అవ** - భగవద్గీతకన్న తిరువాయ్‌మొళ్ళికి ఆధిక్యమును చెప్పదలచి ముందుగ వక్తృవైల క్షణ్యము వలన వచ్చిన అతిశయమును తెల్పుచున్నారు.

**41. అతు తత్త్వోపదేశమ్, ఇతు తత్త్వదర్శివచనమ్.**

అది తత్త్వోపదేశము, ఇది తత్త్వదర్శివచనము.

వ్యా - భగవద్గీత, తత్వభూతుడగు సర్వేశ్వరుడు స్వయముగ నుపదేశించినది, తిరువాయ్‌మొళ్ళి, ఆప్తతములగు శ్రీనమ్మాళ్వర్ల శ్రీసూక్తి. భగుద్గీతయందు సర్వేశ్వరుడు తన వైభవమును తానే చెప్పుకొనుటచే మంద మతులకు నమ్మతగనిదిగ నుండును. తిరువాయ్‌మొళ్ళి దివ్యప్రబన్ధము శుద్ధ సత్వజ్ఞానులగు శ్రీనమ్మాళ్వార్లు మధ్యస్థముగనుండి భగవానుని వైభవము నుపదేశించినదగుటచే నాధిక్యముగలది.

**అవ** - తిరువాయ్‌మొళ్ళి ప్రబన్ధము రచించుటలోగల ఆధిక్యమును దెల్పుచున్నారు.

**42. అతు ఐవరై వెల్‌విత్తు పతిత్తైన్దుఇరట్టి పడ చ్చొన్నతు, ఇతు నాడాక తోత్తోమెన్ఱు**

అది 5గురను జయింపించి నూరుగురు నశింప చెప్పినది, ఇది దేశమెల్ల కోల్పోతిమన

**ఐయైన్దు ముడిప్పాన్ శొన్నతు**

ఆత్మసంగము నశింప చెప్పినది.

వ్యా - భగవద్గీత, రాజ్యమునుగోరి శరణాగతి యొనర్చిన పాండవులైదుగురను జయింపజేసి, నూరుగురగు దుర్యోధనాదుల నశింపజేయుటకై ఉపదేశించినది. తిరువాయ్‌మొళ్ళియో, నారాయణు నికై మనస్సును కోల్పోతిమనదగినట్లు 25 వ తత్వమగు జీవాత్మసంగమును (కైవల్యమును) నశిం పజేయుటకై ఉపదేశించినది.

**అవ** - ప్రబన్ధ ప్రారంభ పరిసమాప్తముల వలన వచ్చిన వైభవమును తెల్పుచున్నారు.

**43. అఙ్గు నమ్బి శరణెన్ఱు తుడఙ్గి, ముడివిల్ అప్రియమెన్ఱతు ఇఙ్గు పరమే ఎన్ఱు**
అచ్చట పూర్ణుని శరణని మొదలిడి చివరన అప్రియము అనినది, ఇచ్చట పాపముపెరిగెనని
**ఇట్టుఙ్గు పొలిక ఎన్ఱు ఉకన్దతు.**
మొదలిడి మంగళమని ప్రీతమైనది.

**వ్యా** - భగవద్గీత ప్రారంభమున, గుణపూర్ణుడా నిన్నుశరణుజొచ్చితిని అని శరణొనర్చిన అర్జునునికై ప్రీతితో ప్రారంభింపబడి, "నూనమశ్రద్దధానోసి దుర్మేధాశ్చాసి పాండవ అబుద్ధ్యాయన్నజానీషే తన్మే సుమహదప్రియం" అర్జునా నిజమునకు నీకు శ్రద్ధలేదు, చెడు బుద్ధివి, జ్ఞానహీనుడవై రహస్యముల నెంత ఓరిమితో జెప్పినను గ్రహింపలేకపోతివి, ఇదినాకు అయిష్టమని అప్రీతితోముగింపబడినది.

తిరువాయ్మొழியో భగవద్విముఖుల అనర్థమునుజూచి వారిని దిద్దు బాటొనర్ప విచారముతో నారంభింపబడి తమ ఉపదేశములచే దిద్దుబాటైన వారలజూచి సంతసముతో పొలిక పొలికయని వారలకు మంగళాశాసనముజేసి ముగింపబడినది.

భగవద్గీత వినిన అర్జునునకు యుద్ధము ప్రారంభించుటకు మాత్రమే ఉపయోగించెనుగాని, మోక్షప్రాప్తికి ప్రయోజనము కాకపోయెను. తిరువాయ్మొழி యట్లుగాక యెల్లరకును మోక్షప్రాప్తికి హేతువైనది.

**అవ** - ప్రతిపాద్యవిషయమునుబట్టి తిరువాయ్మొழி ఆధిక్యమును దెల్పుచున్నారు.

**44. అతిల్ సిద్ధ ధర్మవిధి, ఇతిల్ విధ్యనుష్ఠానఙ్గళ్.**
అందు సిద్ధోపాయవిధి ఇందు విధ్యనుష్ఠానములు.

**వ్యా** - భగవద్గీతయందు మామేకమ్‌శరణమ్ వ్రజ యని, సిద్ధధర్మమగు ప్రపత్తి మాత్రమే విధింపబడినది. తిరువాయ్మొழியందు తిరునారణన్‌తాళ్ అని శ్రియఃపతి యొక్కశ్రీపాదముల నెల్లప్పుడును ధ్యానింపుడని, విధియు, అడిక్కీழ் అమర్న్దు శ్రీపాదములక్రింద అమరియుండి అని అనుష్ఠానమును రెండును తెలియనగును.

**అవ** - ఆళ్వార్లు అంగీకరించుటచే భగవద్గీతకు అతిశయము వచ్చినదనుచున్నారు.

**45. పకవన్ ఞానవితి పణివకై ఎన్ఱు ఇవర్ అంగీకారత్తాలే అతుక్కుత్కర్షమ్.**
పకవన్ ఞానవితి పణివకై అని వీరి అంగీకారముచే దానికిఆధిక్యము.

**వ్యా** - అమ్‌పకవన్ వణక్కుదై (భగవానుడు స్వయముగనుపదేశించినది), ఞానవితిపిழైయామే

భక్తియుక్త కైంకర్యమును వీడక, పరమ్పణిత్త పణివకైయే (భగవానుడు తెల్పిన అనుష్ఠానమును) అను పాశురములలో ఆళ్వార్లు భగవద్గీతను ప్రమాణముగ గొనుటచే దాని కతిశయమేర్పడినది. తిరువాయ్మొళ్ళిని వీరే స్వయముగ జెప్పియుండుటచే అంగీకారావస్యకతలేక తిరువాయ్మొళ్ళి అధిక్యము జెప్పబడినది.

**అవ** - ప్రమాణ ప్రమేయ ప్రమాతృవిషయములు భగవద్గీతయందు సంగ్రహమనియు, తిరువాయ్ మొళ్ళియందు విస్తృతమగుటచే దీని ఉపదేష్టలగు నమ్మాళ్వార్ల అతిశయము దెల్పుచున్నారు.

**46. వేదవేద్య వైదిక ఉపదేశమ్ అవిద్యర్ అళవిలే, అజ్ఞర్ జ్ఞానికళ్ జ్ఞానవిశేషయుక్తర్**
భగవానుని, వైదికుల ఉపదేశము సంసారులకు మాత్రమే, అజ్ఞులు జ్ఞానులు విశేషజ్ఞులు
**సర్వజ్ఞన్ ఎన్నామల్ ఇవర్ తిరుత్తువర్.**
సర్వేశ్వరుడు అనక వీరు దిద్దుదురు.

**వ్యా** -హితానుశాసనరూపమగు వేదము యొక్కయు, వేదములచే తెలియబడువాడగు సర్వేశ్వరుని యొక్కయు, వేదముల పూర్వోత్తరభాగముల యర్థమును బాగుగ నెఱిగిన వైదికులగు మహర్షుల యొక్కయు నుపదేశములు, తత్వహితపురుషార్థముల నెఱుగని అజ్ఞులగు సంసారులకు మాత్రమే కాని, నమ్మాళ్వార్లు అజ్ఞులకును భగవానుడే ఉపాయమనెడి నిష్ఠగల జ్ఞానులకును, భగవత్స్వరూప రూపగుణవిభూతులను దర్శించి ఉపేయభూతులగు విశేషజ్ఞానముగలవారికిని, సర్వజ్ఞుడగు సర్వేశ్వరునికిన్ని, ఉపదేశించుటచే వీరే యెల్లరను దిద్దుబాటు నొనర్చినవారైరి.

**అవ** - ముందుజెప్పిన నల్గురకును ఆళ్వార్లు ఉపదేశించిన అర్థవిశేషములనుతెలుపుచు న్నారు.

**47. అఱియాతార్క్కు ఉయ్యప్పుకుమాఱుమ్, ఇక్కరైయేఱినార్క్కు ఇన్పవెళ్ళముమ్,**
జ్ఞానహీనులకు ఉజ్జీవనోపాయమును పరమపదయోగ్యులకు ప్రాప్యవైలక్షణ్యమును
**నిలైయఱియాతార్క్కు అఖ్జ్ఞాలుమ్, కరైయేత్తుమవనుక్కు నాలాఱుమ్**
తమ స్థితినెఱుగనివారికి సౌశీల్యమును కడతేర్చువానికి 24 తత్త్వములను
**అఱివిక్కవేణుమ్.**
తెలుపవలసియున్నది.

**వ్యా** - మొదటి నుంచియు భగవంతుని గూర్చిన జ్ఞానము లేని వారగు సంసారులకు సంసారమును దాటుటకు శ్రియఃపతి పాదములే ఉపాయమనియు ముముక్షువులకు ప్రాప్యవైలక్షణ్యమగు నిత్య సూరుల అనుభవమును, ఆనందప్రవాహమున మునిగి ఆధారమునెఱుగనివారికి సౌశీల్యగుణమును, పరమపదమును బొందించునట్టి సర్వేశ్వరునకు చరమశరీరమునందు వ్యామోహముగలవాడగుటచే

దాని చెడ్డను తెలియబఱచుటకై 24 తత్వములను గూర్చియు తెలుపవలసియున్నది. అనగా వీరు జ్ఞానహీనులకు భగవంతుని మోక్షోపాయముగ గొనునట్లును, ఉపాయాధ్యవసాయముగల ముముక్షువులకు కైంకర్యమున రుచి గల్గునట్లును, ప్రాప్యరుచిగలవారికి (కైంకర్యనిష్ఠులకు) ఆధారమగు సౌశీల్యగుణమును, ప్రాప్తిని గల్గించు నట్టి సర్వేశ్వరునకు త్యాజ్యమగు ప్రకృతిస్వరూపమును తెలియబఱతురు.

అవ - ఈ అర్థముల నుపదేశించుటకు హేతువులను దెలుపుచున్నారు.

**48. అవన్ మునిన్దార్క్కు త్తాన్‌కణ్డతు, తమ్మైమునివార్క్కు త్తన్ కణ్, కాణాతతు కాణ్బార్క్కు**
వాడు కోపించినవారికి తామెరిగినదియు తమనుకోపించినవారికితమ రక్ష,చూడనిదిచూచుకవులకు
**క్కణ్ మాఱుమిడమ్, రాగాన్ధనుక్కు మాయాదోషముమ్ ఇవర్ కాట్టుమవై.**
దృష్టిని మరలించియు, ప్రీతిపరవశునకు ప్రకృతిదోషమును వీరు చూపునవి.

వ్యా - క్షిపామి న క్షమామి (త్రోసివేతును క్షమించను) అనునట్లు సర్వేశ్వరుని కోపమునకు లక్ష్యభూతులగు సంసారులకు జ్ఞానశక్త్యాది గుణములుగల సర్వేశ్వరునికన్న మోక్షోపాయము మరొకటి లేదని తామెఱిగిన అర్థమును, ఓ తల్లులారా నాపైనేల కోపగింతురు అని ఉపాయాధ్యవసాయమున నుండక స్వప్రయత్నమునకు దిగెడి కుమార్తెను జూచి ప్రాప్యవస్తువైలక్షణ్యము నెఱుగక యింత మతిమాలిన ప్రీతి దగదనెడి తల్లిగారికి నామనసుతోచూడుడనియు, కంటికి కనబడని విషయములను సూక్ష్మబుద్ధితో తెలియదగిన కవులనుగూర్చి సర్వేశ్వరుని శీలగుణమును చూడకుండుడని వారి దృష్టిని మరల్చియు, చరమ శరీరమున వ్యామోహము గల్గిన సర్వేశ్వరునికి ''మంగవొట్టు'' శరీరమును విడదీయుమని ప్రకృతిదోషమును జూపియు, నిట్లు ఆళ్వార్లు ఉపకరింతురు.

అవ - అజ్ఞులకు వలెనే పైవారికిన్ని అనేకమారు లుపదేశింతురాయన తెల్పుచున్నారు.

**49. సాధన సాధ్యస్థ మధ్యస్థరై విట్టు అవత్తిల్ కలఙ్గుమ్ జీవేశ్వరర్క్కు వీడుమిన్**
సాధన సాధ్యస్థ మధ్యస్థులను విడిచి వాటియందు కలతపడెడి జీవేశ్వరులకు విడువుడు
**నినైమిన్ పిడిత్తేన్ విడువేనో వైత్తెౙ్ వూతి వాడినిఱ్క కన్నమన్ను ఆన్‌పిన్**
తలచుడు ఆశ్రయిస్తిని విడుతునా వినిలేచునట్లు వేణువూది వాడియుండ తగదు ఆలవెంట
**కైక్కొౘియేల్ ఉౘితరాయ్ ఎన్‌శొల్‌కొళ్ ఎన్ఱు ఇవర్ పలకాలుమ్ హితాహితఙ్గళ్ శొల్లువర్.**
విడువవద్దు సంచరింపుము నామాటవినుముఅనివీరు అనేకమార్లు హితా హితములనుచెప్పుదురు.

వ్యా - ఉపాయోపేయనిష్ఠులను మధ్యను పేర్కొనిన జ్ఞాననిష్ఠులను విడిచి, కర్మానుష్ఠానపరులై ఉపాయోపేయములిట్టివని యెఱుగక మనసు కలతబడిన సంసారులకు వీడుమిన్ నేను నాది అనుటను విడువుడు అను తిరువాయ్‌మొౙి మొదలు నన్‌మలరిట్టు నినైమిన్ నెడియానే (మంచిపూలను సమర్పించి స్వామిని తలచుడు) అను వరకును త్యాజ్యోపాదేయముల నుపదేశించిరి. ప్రేమపరవ

శుడై మనసు వ్యాకులపడిన సర్వేశ్వరుడు, ఆళ్వార్లు తమ అయోగ్యతను తలచుకొని మనల విడనా డిన యేమిచేయగలమని తల్లడపడెడి సమయమున సర్వేశ్వరునకు నిన్ను దృఢముగ నాశ్రయించి తిని స్వీకరింపుమనియు, నిన్నాశ్రయించిన పిమ్మట విడుతునా ? యనియు, నీప్రియురాండ్రు వేణు గానమువిని లేచివచ్చునట్లు దగ్గరగ ఊదుమనియు, ఉపాయోపేయముల దెల్పియు, నీదయకువిష యమగు స్త్రీలను విడిచి అక్షరజ్ఞానములేని మా చిలుకలతో మాట్లాడవలదనియు, మాచేతిలోని బొమ్మను లాగుకొనుట నీకు తగదనియు, ఆవులవెంట నడవి కేగవలదనియు, నా చేయిని విడువ వలదనియు అకృత్యముల చేయవలదని బోధించుటయు, నీప్రియురాండ్రతో సంచరించుమా అని యు, రాక్షసులతో కపటయుద్ధములగునుగాన మామాటవినుమనియు, ననేకమార్లు హితాహితముల నుపదేశించిరి.

**అవ** - ఇట్లు సంసారులకు సర్వేశ్వరునకు అనేక మార్లు ఉపదేశించుటకు హేతువును దెల్పుచున్నారు.

**50. కతిర్ ఞానమూర్త్తిక్కు ఉణర్తువతు ప్రేమత్తాలే, తమమూడువార్కు వేట్కైయెళ్ళువిప్పతు**
వెలుగుజ్ఞానమూర్తికి ఉపదేశించుట ప్రేమచేత, సంసారులకు భక్తిని కల్గించుట
**ఞానత్తాలే.**
కృపారూపజ్ఞానముచే.

వ్యా - ప్రళయకాలమున చేతనాచేతనము లన్నిటిని తనయందుంచుకొని సృష్టికాలమున ఒకరి కర్మము వేరొక్కరికి అంటకుండ సృజించియు,అట్టి సమయముననను తన స్వరూపమునం దెట్టి మార్పును గలుగకుండ నద్వితీయమై యపరిచ్ఛిన్నమగు కీర్తిప్రభావమను జ్ఞానస్వరూపుడగు సర్వజ్ఞునకు ఉనక్కోన్తుణర్తున్ (నీకు నేనొకమాట తెల్పెదను) అని యుపదేశించుట స్వామి యందలి ప్రీతి వలన.

ఐశ్వర్యము నాశహేతువని తెలిసియు దానియందాశపడెడి అజ్ఞానపరవశులగు సంసారు లకు నిన్‌కణ్‌వేట్కైయెళ్ళువిప్పన్ (నీలోనుండు జ్ఞానమును ప్రకాశింపచేతును) అని తమ యుపదేశ మువలన భక్తిని గల్గించుట భగవత్సంబంధము మూలముగ వారిని విడువలేక దిద్దుబాటొనర్చి తమ వలెనేవారినిన్ని భగవదనుభవపరులుగజేయవలెననెడి కృపారూప జ్ఞానమువలననని తెలియదగును.

**అవ** - ఆళ్వార్లు చేతనేశ్వరులిరువురకును ఉపదేశించుటకు కారణము, పరులకష్ట మును జూచి సహింపజాలక పోవుటయేగాని కృపారూపజ్ఞాన ప్రీతులందురేమియనిన తెల్పుచున్నారు.

**51. ఉయిర్ మాయ్‌తల్ ఆళ్ళుమెన్నారుయిర్ ఎన్నుమ్ పరదుఃఖమ్ సహియామై**
ఆత్మ నశించుట తల్లడిల్లుదునునాఆత్మ అనుచోట్ల పరదుఃఖము సహింపక పోవుట

**యిరణ్డిలుమ్ ఉణ్డు**
రెంటియందును కలదు.

**వ్యా** - ఉయిర్మాయ్ తల్ కణ్డు ఆత్తేన్ (సంసారులు నశించిపోవుటను చూచి సహింపజాలను అను పాశురమున పరుల దుఃఖమును జూచి సహింపజాలకుండుటయు, అశురర్కళ్ తలైప్పెయ్యిల్ యవజ్గొలాజ్గైన్లు ఆఝుమెన్నారుయిర్ (రాక్షసులు వచ్చి నీ పై బడినచో నేమి యాపత్తు గలుగునో యని నాయాత్మ తల్లడిల్లుచున్నది) అనెడి పాశురమున సర్వేశ్వరునికి గల్గుకష్టమును సహింపజాల కుండుటయు ఉపదేశమునకు కారణములగుట జ్ఞానప్రేమలు రెంటి యందును అంతర్భూతములే కావున జ్ఞానప్రేమలు రెండును పరదుఃఖఅసహిష్ణుత్వమును విడిచియుండవని తెలియుచున్నది.

**అవ** - ఇట్లు ప్రీతిమాత్రమేగాక ఈశ్వరుని అభిప్రాయమున తాము వానికి ఆత్మభూతుల గుట చేతను వానికి గల్గు చెడ్డను సహింపలేరని తెల్పుచున్నారు.

**52.** ఎన్నతున్నతావియిలే **అఱివార్ ఆత్మావెన్లు అవన్మతమ్ తోన్లుమ్.**
నాది నీయాత్మఅనుచోటను జ్ఞాని(తనకు) ఆత్మయనెడి వాని అభిప్రాయము తెలియును.

**వ్యా** - నీ దివ్యాత్మస్వరూపము నేను కాపాడినది యని తెలుపు సందర్భమున, అఱివార్ ఉయిరా నాయ్ (జ్ఞానులను ఆత్మగాకలవాడు) జ్ఞానీత్వాత్మైవమేమతమ్ (జ్ఞానినాకు ధారకమని నా అభిప్రా యము) అని భగవానుడు చెప్పినట్లు తాను భగవానునకు ఆత్మయగుటచేత వానికి కలుగు దుఃఖ మును సహింపజాలరు అనుట.

**అవ** - ఆళ్వార్లు చేతనేశ్వరుల కిద్దరికిని ఉపదేశించినను, శిష్యునకుండవలసిన యోగ్య తలులేని సర్వేశ్వరుడు ఉపదేశమునకు తగినవాడు కాడే? యనిన తెల్పుచున్నారు.

**53.** ఇరుత్తుమ్ **ఎణ్ణానాయ్ పొయ్ కలవాత అన్పుశెయ్తు పత్తిలనాయ్ క్షుత్**
పాదసన్నిధినిజేర్చి అనుకూలుడై అబద్ధముకాని ప్రీతినిజేసి నిత్యులనున్నవీడి ఆకలి

**తృట్ పీడిత నిర్ధనరైప్పోలే కణ్డుకొణ్డు ఉణ్డు పరుకి, పరిజనాదికళోడే**
దప్పికలచే పీడింపబడు దరిద్రులవలె చూచుకొనుచు అనుభవించి త్రాగి పరివారముతో

**తన్నైత్తన్లు ఎన్ శెయ్వన్ ఎన్లైయిరున్లు అఖిలభరత్తైయుమ్ సమర్పిక్క అతు శుమన్లు**
తననిచ్చుకొని ఏమిచేయుదుననియుండి సకల భారమును సమర్పింప అది మోయుచు

**అల్లునన్పకలుమ్ పోకు ఎన్లాలుమ్ అకల్వానుమల్లనాయ్ పోకేల్ ఎన్లాలుమ్**
రాత్రింబగళ్ళు పొమ్మనిచెప్పినను విడిచిపోలేనివాడై పోవద్దనినప్పుడు

**ఉకప్పైయుమ్ తవిర్న్లు విథివకైయేనడత్తు మవనే ఉపదేశ సత్పాత్రమ్.**
ఇష్టమైనవియు విడిచి విధించినట్లే నడుచువాడే ఉపదేశసత్పాత్రము.

వ్యా - సచ్ఛిష్యుడు, ఆచార్యుని వారు ప్రేమించినచోటనుంచి వారి యిష్టప్రకారము నడుచుకొనుచు వారి దివ్యదేహమున నెట్టి భేదబుద్ధియునులేక అన్ని విధములను వారిని ప్రేమించినవాడై వారికంటె నితరవిషయముల ప్రీతిలేనివాడై దరిద్రుడు ధనమును, ఆకలిగొన్నవాడు అన్నమును దప్పికగొన్నవాడు నీటిని ఆదరించునట్లు ఆచార్యుని ఆదరించి, తనకు తనకున్న సర్వమును వారికి సమర్పించి, ఇంతచేసినను వారుతనకొనర్చిన ఉపకారమునకు సమానము కాకపోవుటచేత కొఱతగలవాడై ఆచార్యుని దేహపోషణమునకు కావలసినవన్నియు భరించుచు రేయింబగళ్ళు వారిని విడనాడక, వారు కోపగించి పొమ్మన్నను పోక, తనకిష్టములైనవియు వారికయిష్టములైనచో వాటిని విడిచి వారు విధించిన ప్రకారము నడచుకొనువాడగునట్లు.

సర్వేశ్వరుడును, ఇరుత్తుమ్ వియన్దైన్నైత్తన్ పొన్నడిక్కీళ్ (తివాయ్ 8-7-1) నన్ను తన అందమగు పాదముల క్రింద సంతోషముతో నుంచును అన్నట్లు వీరికిష్టమైన చోటనే వీరినుంచి, ఎన్ ఎణ్ణానాన్ (తివాయ్ 1-87) నా యిష్టప్రకారమైనాడు అన్నట్లు వీరి యిష్టప్రకారము ప్రవర్తించువాడై పొయ్‌కలవాతు ఎన్మెయ్‌కలన్దాన్ (తివాయ్ 1-8-5) నిజముగ నా శరీరముతో కలిసెను అన్నట్లు వీరిశరీరములో నున్నప్పుడు భేదమునెంచక, అన్దామత్తన్బుశెయ్‌తు (తివాయ్ 2-5-1 నిత్యసూరులను ప్రేమించునట్లు నన్ను ప్రేమించి, అన్నట్లు పరమపదమునందలి ప్రీతిని వీరియందు జేసి పత్తిలనీశనుమ్ (తివాయ్ 1-2-6) మహిషీపరిజనాదులయందు సంగమును విడిచి అన్నట్లు వీరితోడి సంబంధముతో పరమపదవాసుల సంబంధమునున్ను విడిచి, ఇరున్దాన్‌కణ్డుకొణ్డు (తివాయ్ 8-7-2) అనుగ్రహించుచు నాలో నున్నాడు అనియు ఎన్నై ముత్తవుమ్‌తానుణ్డాన్ (తివాయ్ 9-6-8) నన్ను పూర్ణముగ అనుభవించినవాడు అనియు దరిద్రునకు నిధియు, ఆకలికొన్నవానికి అన్నమును, దప్పికగొన్నవానికి నీరును దొరికినట్లు మిక్కిలి ఆశతో వీరిని అనుభవించి, ఎనక్కేతన్నైత్తన్దకఱ్పకమ్ (తనను నాకొసంగిన కల్పవృక్షము) అన్నట్లు తనను తన విభూతినిన్ని వీరి కొసగి, ఉన్ అడియార్కెన్ శెయ్‌వ నెన్డేయిరుత్తి (నీదాసులకేమిచేయుదునా యని ఆశించి, ఏమియుచేయనట్లు కొఱతగలవాడై, నమః అనుశబ్దముచే వీరు తమ భారమును సమర్పించగా భూయిష్ఠాం తే నమ ఉక్తిం అన్నట్లు అది తనకు మిక్కిలి ఘనముగా తోచి, అల్లునన్పకలుమ్ ఇడైవీడిన్నినల్కియెన్నై విడాతే (తివాయ్ 1-10-8) రేయింబగళ్ళు నన్ను ప్రేమించి దాసునిగా నమ్మి విడువకున్నాడనినట్లుండి, పోకునమ్పీ (పూర్ణుడా పొమ్ము) అన్నను అకల్వాను మల్లవిని (తివాయ్ 2-6-7) ఎడబాయువాడు కాడు అన్నట్లు లోనప్రవేశించి పోనివాడై, ఆన్పిన్‌పోకేల్ (తివాయ్ 10-3-8) ఆవుల వెంట పోవలదు అనినను తివత్తిలుమ్ పశునిరైమేయప్పుకత్తి (తివాయ్ 10-3-10) పరమపదమునకంటెను ఆవులమేపుటనే ప్రేమించితివి అన్నట్లు తనకిష్టమైనవియు విడిచి, అరుళ్తరువానమైకిన్తానతునమతువితివకైయే (తివాయ్ 10-6-1) (సర్వేశ్వరుడు తన కృపను జూపుటలో నా నియమనప్రకారము చేయుచున్నాడు) అన్నట్లు వీరు నియమించినట్లు చేయువాడగుటచే నీతడే ఉపదేశమునకు తగినవాడు అని తెలియదగును.

**అవ** - సంసారవిరక్తులై ఆత్మగుణోపేతులై శ్రద్ధతో నాశ్రయించినవారికి ఉపదేశింపవలసిన విషయములను భగవద్విముఖులై ప్రయోజనాంతరపరులై అనువర్తనలేని వారికి బలవంతముగ నేల యుపదేశించిరన తెల్పుచున్నారు.

**54.** **నణ్ణాతార్ మెయ్యిలూన్ ఆశై నిర్వేదత్తోడే ఆస్తిక్య అమానిత్వాదికళ్**
నణ్ణాతార్ మెయ్యిలూన్ ఆశై వైరాగ్యముతో ఆస్తిక్య అమానిత్వాదులు
**విఞ్జిన ప్రణిపాత అభివాదన పరిప్రశ్నసేవాపరర్క్కు ఉళజ్ఞ్గొళ్**
వృద్ధియై ప్రణిపాత అభివాదన పరిప్రశ్న సేవాపరులకు లోననుండి
**పేశుమళవన్రెన్నుమ్ అర్థత్తై వమ్మిన్ విరోతమ్ ఈనచ్చొల్ ఎవ్వుయిర్క్కుమ్**
(పైకి)చెప్పరాదనెడి అర్థమును వమ్మిన్ విరోధమ్ ఈనచ్చొల్ ఎవ్వుయిర్క్కుమ్
**అఱియ ఎన్ఱు అడైవుకెడ అతపస్కర్క్కు ఉపదేశిక్కిఱతు ఞాలత్తార్**
అఱియ అనుచోట్ల శాస్త్రవిధిమీరి అనధికారులకు ఉపదేశించుట భూలోకవాసుల
**బన్ధబుద్ధియుమ్ అనర్థమ్ కణ్డు ఆత్తామైయుమ్ మిక్కకృపైయుమిఱే.**
బంధనబుద్ధియు అనర్థమును చూచి సహింపజాలమి మిక్కిలి దయయు గదా.

**వ్యా** - నణ్ణాతార్ముఱువలిప్ప (తివాయ్ 4-1-1) మెయ్యిల్వాళ్క్కై, (పెరుమాళ్తిమొ 3-1) ఊనేరు శెల్వత్తు (పెరుతి 4-1) ఆశైవాయ్చ్చెన్నశిన్తై (తివాయ్ )మొదలగు పాశరముల చెప్పినట్లు భగవద్విముఖుల లోకయాత్ర యందును మలరూపదేహమునందును కర్మోపాధిచేనేర్పడిన దేహబంధువుల యందును, దోషమును దర్శించుటచే వైరాగ్యముగల్గి ఆస్తికః ధర్మశీలశ్చ శీలవాన్ వైష్ణవః శుచిః గమ్భీరః చతురః ధీరః, అనియు, అమానిత్వం అదమ్భిత్వం అహింసా క్షాన్తిః ఆర్జవం ఆచార్యోపాసనం శౌచం స్థైర్యం ఆత్మవినిగ్రహః అనియు శిష్యలక్షణములైన, ఆత్మగుణములతో పూర్ణులై ఆభిజాత్యము వీడినవారై ప్రణిపాత అభివాదన పరిప్రశ్న సేవలయందాసక్తులై చిరకాలముగ ననువర్తించువారికి ఉళజ్ఞొళ్జ్ఞానత్తువైమ్మిన్ (ఉజ్జీవించుటకై కురుకాపురిని మనస్సున నుంచుకొనుడు) అనియు, పేశుమళవన్తితువమ్మిన్ నమర్ పిఱర్ కేట్పతన్మున్ (భగవద్విషయము నోటచెప్పుటకు సాధ్యపడనిది మాతో చేరదలచినవారు ఇతరులు (మూడవవారు) వినకముందే వచ్చి చేరుడు) అని ఉపదేశింపవలసిన యర్థమును, వమ్మిన్ పులవీర్ (తివాయ్ 3-9-6) (ఓ కవులారా రండు) అన్నట్లు బలవంతముగ పిల్చి, శొన్నాల్ విరోధమితు ఆకిలుమ్ శొల్లువన్ కేణ్మినో నేను చెప్పెడిది మీ మనస్సునకు విరుద్ధమైనను నే చెప్పదలచితిని వినుడు అనియు మత్తొన్నిల్లై శురుజ్గచ్చొన్నోమ్ మానిలత్తెవ్వుయిర్క్కుమ్ శిత్తవేణ్డా (తివాయ్ 9-1-7) వేఱొక్క యుపాయములేదు సంగ్రహముగా జెప్పితిమి లోకులెల్లరకును భయపడనక్కఱలేదు అనియు, నిట్లు క్రమముతప్పి "ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన" అను తావున చెప్పబడిన అనధికారులకున్ను ఉపదేశించుటకు కారణము, నిత్యవిభూతిలో నుండువారివలెనే లీలావిభూతిలో నుండువారికిన్నీ భగవత్సంబంధము సర్వసాధారణమైయుండగా నిచ్చటివారు నష్టపడగూడదనెడి సంబంధజ్ఞానమున్ను, సంసారుల

యనర్థమును సహింపలేకుండుటయును, అంతమాత్రమేగాక క్షిపామి (త్రోసివేతును) న క్షమామి (క్షమించను) అని సర్వేశ్వరుడు చేయివిడిచినవారినిన్ని దిద్దుబాటొనర్చిననేగాని నిలువలేని కారుణ్యాముచేతనున్నుగదా, లోకుల మందబుద్ధిని అనర్థమును సహింపలేకపోవుటచే నిట్లుపదేశించుటయని వీరి శ్రీ సూక్తులవలన తెలియవచ్చుచున్నది.

**అవ** - ఇంకను ఇట్లుపదేశించినవార లెవ్వరైన కలరా? యనిన తెల్పుచున్నారు.

**55. తాయ్క్కుమ్ మకనుక్కుమ్ తమ్బిక్కుమ్ ఇవర్క్కుమ్ ఇవర్అడి పణిన్దవర్క్కుమే**
పిరాట్టికిని పుత్రునకును తమ్మునకును వీరికిని వీరిపాదాశ్రయణపరులకే
**యివై యుళ్ళతు.**
యివి కలవు.

**వ్యా** - తనయందు విపరీతబుద్ధిగల పాపియగు రావణునకు, శ్రీరామునితో స్నేహముచేసుకొనుట మంచిదనియు, నాతడు ధర్మాత్ముడుగను శరణాగతవత్సలుడుగను ప్రసిద్ధినొందినవాడు సుమా యని హితోపదేశమొనర్చిన సకలలోక జననియగు సీతామాతకును, భగద్విముఖుడును మహాపాపి యునగు హిరణ్యునిగూర్చి, సర్వభూతములకు నాత్మయగు జగన్నాథునియందు ద్వేషము వలదని యు, ఆతడంతటను నిండియున్నాడనియు, అసురపుత్రులనుగూర్చి సంసారసాగరము నుండి ఉద్ధరించువాడు అచ్యుతుడేగాన వాని నారాధించుడనియు హితోపదేశమొనర్చిన ప్రహ్లాదునకును, రాక్షస కులమున చెడబుట్టితివని ధిక్కరించిన రావణుని గూర్చి శ్రీరామునకు సీతను సమర్పింపుమని యుపదేశించిన శ్రీవిభీషణులకును, విషయాంతరపరులై చెడిపోయెడి సంసారులను విడువక అనేక తావుల హితోపదేశమొనర్చిన శ్రీనమ్మాళ్వార్లకును, రుచి విశ్వాసములు లేనివారికిన్ని చరమోపదేశవైభవము దెలియజెప్పిన పామన్నుమారనడిపణిన్దుయ్న్దవన్ (ఇరా. నూత్తం. 1) ననుసంధించు నట్టి శ్రీనమ్మాళ్వార్ల శరణు జొచ్చినవారని ప్రసిద్ధిగల శ్రీరామానుజులకును "ఇవి" అనబడిన సంబంధజ్ఞానమున్ను పరదుఃఖఅసహిష్ణుత్వమును అనవధిక కృపయు నీమూడును గలవని తెలియదగును.

**అవ** - ఇట్లు విముఖులగు సంసారులగూర్చి ఆళ్వార్ల ఉపదేశము ఫలించినదా! యనిన తెల్పుచున్నారు.

**56. ఖ్యాతి లాభ పూజాపేక్షై అఱ మలర్ నాడి ఆట్చెయ్య్ ఉయ్యక్కొణ్డు ఆరైక్కొణ్డు**
కీర్తిని ధనమును గౌరవమును కోరక పుష్పమువెదకి సేవయొనర్ప ఉయ్యక్కొండు ఆరైక్కొండు
**వాళుమ్ విల్లుమ్ కొణ్డుఎన్గిఱ ఇఴవుకళ్ తీరప్పెత్తతు.**
వాళుం విల్లుం కొండు అనెడి కొరతలు తీరినవి.

**వ్యా** - నీశనేన్ నిఱైవొన్ఱుమిలేన్ (నీచుడను గతిలేనివాడను) అని నీచులలో పరాకాష్ఠగా తమను

చెప్పుకొనుటచేతను పెరుమ్‌శెల్వమ్ నెరుప్పాక (ఐశ్వర్యము అగ్నితోసమము) అని తలచుటచేతను, తొణ్డర్ తొణ్డర్ తొణ్డర్ తొణ్డన్ శడకోపన్ (భక్తుల భక్తుల భక్తుల భక్తులకు దాసుడను) అని తమను భాగవతశేషత్వము నందాశగలవారికి దాసుడుగ జెప్పుకొనుట చేతను, ఓతవల్ల పిఱాక్కళ్ నమ్మై యాళుడైయార్కళ్ పణ్డే (ఈ ప్రబన్ధమును అభ్యసించినవారు నాకు యజమానులు) అని అధ్యయనపరుల తమకు శేషిగా భావించుటచేతను ఖ్యాతిని స్వప్రయోజనమును గౌరవమును అపేక్షింపక, నఱియ నన్ మలర్నాడి (శేషత్వపరిమళముగల ఆత్మపుష్పముల వెదకి) ఆట్ చ్చెయ్‌తు ఆళ్ళి ప్పిఱానై చ్చేర్‌న్దవన్ (తివాయ్ 4-10-11) (కైంకర్యమునుజేసి సర్వేశ్వరుని బొందినవారు) అని ఉపదేశమున్ను కైంకర్యరూపముగ నొనర్చుటచే జగత్తంతయు దిద్దుబాటుకాగా ఉమ్మై ఉయ్యక్కొణ్డుపోకిరిల్ (మిమ్ముల నుజ్జీవింపజేసికొని పోవలసినచో ) అనుచోట సంసారులు ఉజ్జీవించుటకై కష్టపడుటయు, ఆరైక్కొణ్డెన్నుశాకో (తివాయ్ 7-3-4) ఎవరిని సాయముగాగొని యేమాట చెప్పుదును అనుటచే తమకు సహాయభూతులు లేరనెడి దుఃఖమును, వాళుమ్ విల్లుమ్‌కొణ్డు పిన్‌శెల్వార్ మత్తిల్లై (తివాయ్ 8-3-3) (ఖడ్గమును ధనస్సునున్ను చేతబట్టుకొని వెంటపోవువారులేరే) అని వాని సౌకుమార్యమును కాపాడువారొక్కరునులేరే యని దుఃఖించుటయు, నీ కొఱతలన్నియు వీరి ఉపదేశములచే తీరినవని తెలియనగును.

అవ- శాస్త్ర మర్యాదానుగుణముగనే సంసారులు వీరినాశ్రయింపగా వీరుపదేశించిరని చెప్పగూడదా ? యనిన తెల్పుచున్నారు.

**57. బ్రహ్మనిష్ఠరుమ్ సంవత్సరవాసికళుమాకిల్ ఏపావమ్ పయనన్నాకిలుమ్ శేరాతు.**

బ్రహ్మనిష్ఠులై సంవత్సరోపవాసులకుపదేశించుచో ఏపావమ్ పయనన్నాకిలుమ్ (అనుట)తగదు.

వ్యా- నమ్మాళ్వార్లు బ్రహ్మనిష్ఠులవలె నుపదేశించినను, శిష్యులు సంవత్సరోపవాసులవలె ప్రవర్తించినను ఏపావమ్ పరమే అయ్యో ఏమినాపాపము, ఈఉపదేశము నేను చేయవలసివచ్చెనే పయనన్నాకిలుమ్ అనుపాశురమున మధురకవులు ప్రయోజన శూన్యులయినను అనుకూలురు కాకపోయినను వడనడికను బాగుగ దిద్దుబాటొనర్చి భగవద్భాగవత కైంకర్యమునందన్వయింపజేసిరనియును సాధించినట్లు ఉపదేశించుటయు కృతజ్ఞతను తెల్పుటయు పొసగవు, కావున ఆళ్వార్లు విముఖులైన వారినిగూర్చి ఉపదేశింపగా నట్టి ఉపదేశశుద్ధివలన నెల్లరును దిద్దుబాటగుటచే నాళ్వార్ల కష్టములు తీరినవని తెలియనగును.

అవ - ఇట్లు వీరు ఉపదేశపరులగునప్పుడు వీరి భగవదనుభవమునకు విఘ్నమురాదా యనిన తెల్పుచున్నారు.

**58. మెయ్ నిన్ఱు మఱ్ఱవొట్టుక్కు నడువు అనుభవగర్భ ఉపదేశమ్.**

మెయ్ నిన్ఱు మఱ్ఱవొట్టుకు మధ్యన అనుభవపూర్వక ఉపదేశము.

వ్యా - వీరి మొదటి గ్రన్థమగు తిరువిరుత్తములోని మొదటిపాశురమున మెయ్‌నిన్లుకేట్టరుళాయ్ అడి యేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ (దాసుడొనర్చు విన్నపమును కృపతో వినుము, అనునది మొదలు చివరి గ్రన్థమగు తిరువాయ్‌మొళ్లిలోని (10-7-10) మజ్గవొట్టు ఉన్‌మామాయై, (నీ యాశ్చర్యకరములైన ప్రకృతిప్రాకృతములను నశింపజేయుమా ) అనువరకును మధ్యనుండు నాల్గు ప్రబన్థములును అను భవపూర్వకముగనే ఉపదేశించిరని తెలియనగును.

అవ- వీరి భగవద్గుణానుభవ పరోపదేశ రూపములగు నాల్గు ప్రబన్థములును తిరుమంత్ర ద్వయ చరమశ్లోకార్థములను ప్రతిపాదించునవని తెల్పుచున్నారు.

**59. ఇవత్తుక్కు మంత్ర విధి అనుసంధాన రహస్యజ్గళోడే శేర్‌త్తి.**

వీనికి మంత్ర విధి అనుసంధాన రహస్యములతో చేరిక.

వ్యా - ఈ నాల్గుప్రబన్థములు సకల శాస్త్రతాత్పర్యమగు అర్థపంచకమును సంశయ విపర్యయము లులేక ప్రతిపాదించునట్టి సర్వమష్టాక్షరాన్తస్థమ్ అనబడిన తిరుమంత్రము, సిద్ధోపాయ అంగీకార మును అంగములతో ప్రతిపాదించునట్టి (విధి=వ్రజ) చరమశ్లోకము, ఉపాయ ఉపేయ అంగీకార ప్రార్థనలను సక్రమముగ ప్రతిపాదించు కాలక్షేపమునకును భగవద్గుణానుభవమునకును సారజ్ఞులచే నిరంతరానుసంధేయమగు ద్వయము, అనబడు మూడురహస్యములతోను చేరియుండుననుట.

అవ - వాటిలో నేప్రబన్థము ఏరహస్యముతో చేరియుండుననెడి విషయమును విభ జించి తెల్పుచున్నారు.

**60. అళిప్పాన్ అడియేన్ అడైక్కలమ్ శూడి పొయ్ ఆతానుమ్ అళున్దార్ ఎన్లు స్వరూప**

అళిప్పాన్ అడియేన్ అడైక్కలమ్ శూడి పొయ్ ఆతానుమ్ అళున్దార్ అని స్వరూప

**విరోధి నివృత్తి గళైయుమ్; తామరై యున్ది పెరుమామాయన్ ఆళాకవే వాళ్గియ ఎన్లు**

విరోధి నివృత్తులనున్ను తామరై యున్ది పెరుమామాయన్ ఆళాకవే వాళ్గియ అని

**ప్రాప్య, ఫలజ్గళైయుమ్ నెఱికాట్టి మనత్తుళ్‌క్కొణ్డు కణ్ణనాల్ అడిత్తు కణ్డిలమాల్**

ప్రాప్య ఫలములను నెఱికాట్టి మనత్తుక్కొండు కణ్ణనాల్ అడిత్తు కణ్డిలమాల్

**యాతాకిల్ ఎన్లు ఉపాయత్తైయుమ్ శొన్నవై మంత్ర శ్లోకజ్గళోడే శేరుమ్.**

యాతాకిల్ అని (మోక్ష)ఉపాయమునున్ను చెప్పినవి తిరుమంత్ర చరమశ్లోకములతో చేరును.

వ్యా - తిరువిరుత్తము, ప్రథమ మధ్యమ పదములగు ప్రణవ నమస్సులను, తిరువాశిరియము, తృతీయపదమగు నారాయణాయ ను ప్రతిపాదించుటచే నారెండు ప్రబన్థములును మూలమంత్ర మగు తిరుఅష్టాక్షరిని ప్రతిపాదించుచున్నవి, పెరియతిరువన్దాది, చరమశ్లోకార్థమును; ప్రతిపాదించు చున్నది. అది యెట్లనగా ప్రణవము నందలి అకారముయొక్క ధాత్వర్థమగు రక్షకత్వమును ఉయిర

శిప్పాన్ (ఆత్మలను రక్షించువాడు) అనుటచేతను అకారమునందలి లుప్తచతుర్థి, ఉకారము, మకారములచేతను తెలుపబడు ఆత్మస్వరూపమును అడియేన్ (దాసుడను) అనుటచేతను, ప్రణవమునకు ఆత్మసమర్పణమున్ను అర్థమగుటచే దానిని అడియేనడియావియదైక్కలమ్ అనుటచేతను, నమస్సు నందు అర్థాత్సిద్ధమగు తదీయశేషత్వమును తిరుమాల్ తిరుప్పేర్ వళ్ళారడిక్కణ్ణిశూడియ మారన్ (శ్రియఃపతి నామసంకీర్తనపరుల పాదములనెడి పుష్పమాలను శిరసునధరించిన ఆళ్వార్లు) అనుటచేతను, మరియు షష్ఠ్యన్త మకారముచేత నేర్పడు దేహాత్మాభిమానరూపమగు అవిద్యాది విరోధులను న కారముచే నిషేధించుటకు పొయ్నిన్రఞానముమ్ పొల్లావొழுక్కుమழுక్కుడమ్బుమ్ (తిరువి) అసత్యవాచ్యమగు అచేతనము (శరీరము) నందు ఆత్మయనెడి జ్ఞానమును మురికి శరీరమును అనియు యాతానుమోరాక్కైయిల్ పుక్కు అజ్ఞాప్పుణ్ణుమాప్పవిழ்న్దుమ్ (ఏదోయొక శరీరమున ప్రవేశించి దానియందు ప్రారబ్ధకర్మచే సక్తులై కర్మానుభవముచే వదిలించుకొని) అనియు తెల్పుటచే అవిద్యను దానిచే గల్గు అకృత్యకరణాదులను వానిచేగల్గు దేవమనుష్యాదిరూప ప్రకృతి సంబంధమునకు వన్ శేత్తళ్ళల్పొయ్న్నిలత్తు అழுన్దార్ (బలమగు ప్రకృతియందు దిగబడరు) అని సర్వరక్షకుడగు సర్వేశ్వరునికి అనన్యార్హశేషమై జ్ఞానానందలక్షణమై తదీయపర్యంతము శేషభూతమగు ఆత్మస్వరూపమును సంసారహేతువులగు అవిద్యాది నివృత్తినిన్ని ప్రతిపాదించుటచే ప్రథమపదమగు ప్రణవార్థమును మధ్యమపదమగు నమః అర్థమును తిరువిరుత్తము ప్రతిపాదించుచున్నది.

నారాయణపదముచే తెలుపబడు ఉభయవిభూతినాథుని తామరైయున్ది తనిప్పెరునాయక (నాభికమలము గల్గి అద్వితీయుడవగు సర్వాధికా) అనియు ఎమ్బెరుమామాయన్ (నాయొక్కగొప్ప స్వామి) అనుటచేతను, నారాయణపదముపైనగల చతుర్థియర్థమగు ఫలస్వరూపమును తనిమాత్తెయ్వత్తడియవర్క్కిని నామాళాకవే యిశైయుంగొల్ (తిరువాశి 3) అద్వితీయ పరదైవమగువానికి దాసులగుశ్రీవైష్ణవులకు నిక మనము దాసులగుట గూడునా యనియు, ఊழிతోరూழி యోవాతువాழிయ వెన్ఱుయామ్తొழுవిశైయుఙ్గొల్ (తిరువా. 4)స్వామికి కల్పకల్పముల విచ్ఛిత్తిలేక మంగళాశాసనమొనర్చుట సంభవించునా) యనియు తెల్పుటచే ప్రాప్యఫలముల దెల్పు తిరువాశిరియము నారాయణాయ ను తెల్పుచున్నది.

చరమశ్లోకార్థమును పెరియ తిరువన్దాది ప్రతిపాదించుట యెట్లన, సర్వధర్మాన్ పరిత్యజ్య (సకలధర్మములను పూర్తిగవిడిచి) యందు చెప్పబడిన ఉపాయాంతరత్యాగమును నెతికాట్టి నీక్కుతియో (ఉపాయాంతరములజూపి యెడబాటొనర్తువా) యనుటచేతను, మామేకంశరణంవ్రజ (నన్నొక్కనినే ఉపాయముగా గొనుము) యందలి ఉపాయాధ్యవసాయమును వెణ్కోట్టు ఏత్తేழுడనే కొన్రానైయే మనత్తుక్కొణ్డు (క్రూరమగు కొమ్ములుగల ఏడువృషభములను సంహరించినవానిని హృదయమున నుంచి) అనుటచేతను, అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి (నేనునీసకలపాపముల నుంచి విముక్తుని జేయగలను) యందు తెల్పబడిన సర్వపాపవిమోచనము శీరార్మనత్తలైవన్ తున్బత్తై మాత్తినేన్వానోరివత్తలైవన్ కణ్ణనాల్యాన్ (25) సౌలభ్యముగల శ్రీకృష్ణునిచే మనసునం

దలి క్రూరమగు దుఃఖమును బోగొట్టుకొంటిని అనియు, ఇష్యామి యందలి ణిచ్ ప్రత్యయమగు నీవును నేనును చేయవలసినదిలేదు పాపములు వాటియంతట యవే పోవును అనుటను వానోమరి కడలో యని మొదలిడి వన్దుయిరై - మరుఝ్ఝ కణ్ణిలమాల్ యని విరోధులు తమంతనే తాము తెలి యనట్లు పోయిన విధమున్నుమాశుచః (శోకించకుము) అనెడి నిర్భరత్వానుసంధానమగు ఉపాయ మును, అడర్ పొన్ముడియానై (శత్రువుల బాధించు కిరీటము గలవాడు 30) అనియు తెల్పుటచేత పెరియతిరువన్దాది చరమశ్లోకములోని మోక్షోపాయమును ప్రతిపాదించినది.

**అవ** - తిరువాయ్మొఝి ద్వయార్థమును వివరించుచున్నదనియు నావిషయమును తమ అన్నగారగు పిళ్ళైలోకాచార్యులవారు సారసంగ్రహగ్రన్థమున దెల్పిన విధమును తెల్పుచున్నారు.

**61**. ద్వయార్థమ్ దీర్ఘశరణాగతి యెన్దతు సారసంగ్రహత్తిలే.

ద్వయార్థము దీర్ఘశరణాగతి అనినది సారసంగ్రహమున.

**వ్యా** - దీర్ఘశరణాగతియనబడు తిరువాయ్మొఝి పదిపత్తుల యందును ప్రతిపాదింపబడిన శ్రియః పతిత్వము మొదలు కైంకర్యవిరోధినివృత్తి వరకును ద్వయమునందు ప్రతిపాదింపబడిన పదియర్థ ములును సారసంగ్రహగ్రన్థమున ప్రతిపాదింపబడినవి. అవియేవనగా, మొదటిపత్తునందు మలర్మకళ్ విరుమ్బుమ్ (లక్ష్మీదేవిచేప్రేమింపబడువాడు) ఇత్యాదులచే శ్రియఃపతిత్వము, రెండవపత్తునందు ఎమ్బెరుమాన్ నారణత్కే (నాకు స్వామియైన నారాయణునకు) ఇత్యాదులచే నారాయణత్వము, మూడవపత్తునందు వాణ్మలరామడిత్తామరై (అప్పుడే వికసించిన పుష్పములవంటి పాదములు) ఇత్యాదులచే నారాయణుని సర్వలోకశరణ్యభూతచరణారవిందద్వయమును, నాల్గవ పత్తునందు ఇల జైనకర్ అమ్బెరియుయ్ త్తవర్ (లంకానగరమున బాణాగ్నిని నింపినవాడు ) ఇత్యాదులచే అనిష్టని వృత్తిపూర్వక ఇష్టప్రాప్తికి హేతువగు ప్రాపకత్వమును, ఐదవపత్తునందు తమియేనుక్కరుళాయ్ (ఒం టరినగు నన్ను దయచూడుమా) ఇత్యాదులచే ప్రార్థనారూపమగు భక్తియు, ఆఱవపత్తునందు తిరు మామకళిరుమ్నామ్ మలిన్దిరున్దు (మహాలక్ష్మియు తానును సమృద్ధితో నుందురు) ఇత్యాదులచే కైంకర్యప్రార్థనయు, ఏడవపత్తునందు కన్నలేయముతే (పటికబెల్లము అమృతమువంటివాడా) మొద లగువానిచే కైంకర్యమునుగొనునట్టి సర్వేశ్వరుని భోగ్యతయు, ఎనిమిదవపత్తునందు అడియేన్పెరి యవమ్మాన్ (దాసునికి స్వామి) మొదలగు వానిచే సర్వస్వామిత్వము, తొమ్మిదవపత్తునందు పణ్డైనా ళాలే నిన్దిఱువరుళుమ్ పఙ్గయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డునిన్ కోయిల్ శీయ్త్తు (చిరకాలముగ నీ యనుగ్రహమును పిరాట్టియనుగ్రహమును కలవాడవై నీవున్న దివ్యదేశమున కైంకర్యమొనర్చుచు) మొదలగు వానిచే నిత్యకైంకర్యమును, పదియవ పత్తునందు తుయర్కెడుమ్ కడితు (మన దుఃఖ మును నశింపజేయును శీఘ్రముగ ) మొదలగువానిచే కైంకర్య విరోధినివృత్తియు నను పదియర్థము లను తిరువాయ్మొఝి పదిపత్తులచే ప్రతిపాదించుటచే ద్వయార్థప్రతిపాదితములగు పది విషయము లును సారసంగ్రహగ్రన్థమున యుదహరింపబడినవని తెలియనగును.

**అవ** - తిరువాయ్‌మొழிకి తక్కిన ఆచార్యులు సాదించిన అర్థ సమన్వయములను దెల్పుచున్నారు.

**62. మూన్‌ఱిల్ శురుక్కియ ఐన్దైయుమ్ ఉయర్ తిణ్ అణై ఒన్ఱు**
మూటియందు సంగ్రహించిన అర్థపంచకమును ఉయర్వఱ తిణ్ణన్ వీడు అణైవతు ఒన్ఱుదేవుం
**పయిల్ ఏఱు కణ్ కరు వీడు శొన్నాల్ ఒరు కొణ్డ**
పయిలుమ్ ఏఱాళుమ్ కణ్ణళ్ కరుమాణిక్క వీడుమిన్ శొన్నాల్ ఒరునాయకమ్ కొణ్డపెణ్డిర్
**నోత్తనాలుమ్ ఎమ్మా ఒழி నెడు వేయ్‌కిఱ ఇరుపదిలే విశదమాక్కి**
నోత్తమొ. నాల్గును ఎమ్మావీడు ఒழிవిల్ నెడుమా వేయ్‌మరు మొ. 20 అందు వివరించి,
**ఎణ్‌పదిలే పరప్పుగైయాలే ఐన్దైయుమ్ అరుళినన్ వీడుపెత్తు ఎన్దైయాలే ఐన్దిలుమ్**
80లో విస్తరించుటచే అర్థపంచకము అరుళినన్‌మొ. వీడుపెత్తు అనువరకు అర్థపంచకములో
**ఇరణ్డైయుమ్ తొழுతు కళిత్తేన్ శొల్లుప్పెత్తేన్ పణిశెయ్ ఎన్‌గిఱ ముక్తలక్షణవృత్తియాలే**
ఉపాయోపేయములతొழுతు కళిత్తేన్ శొల్లుప్పెత్తేన్ పణిశెయ్ అనుచోట్ల ముక్తలక్షణవృత్తిచేత
**ఇరణ్డిల్ ఒన్దైయుమ్ ఇదుక్కు ప్రమేయమెన్ఱుమ్.**
రెంటిలో ఉపేయమే దీనికి ప్రమేయమనిరి.

వ్యా - తిరుమంత్ర చరమశ్లోకముల సంగ్రహముగ తెలుపబడిన యర్థములను ద్వయము వివరించినట్లు వీరి మొదటి మూడు ప్రబన్ధములందును ప్రతిపాదింపబడిన అర్థపంచకము చివరిదగు తిరువాయ్‌మొழிయందు విస్తారముగ ప్రతిపాదింపబడినది. అర్థపంచకమున తెలుపబడు పరస్వరూపమును, ఉయర్వఱచే శృతిచ్ఛాయలో పరత్వేపరత్వము, తిణ్ణన్‌వీడుచే ఇతిహాసపురాణప్రక్రియచే అవతారమున పరత్వము, అణైవతరవణైచే మోక్షప్రదత్వమును చెప్పుటచే పరత్వము, ఒన్ఱుమ్ దేవుచే అర్చావతారమున పరత్వము, ఈ నాల్గు తిరువాయ్‌మొழிలచేతను ప్రతిపాదింపబడినది. స్వస్వరూపమనబడు జీవస్వరూపము, భగవచ్ఛేషత్వపరాకాష్ఠయగు భాగవతశేషత్వ మనుట పయిలుమ్‌శుడరొళిచేతను, ఏఱాళుమ్‌చే శేషత్వబహిర్భూతములగు ఆత్మాత్మీయములు త్యాజ్యములనుటయు, కణ్ణళ్శివన్దుచే ప్రకృతికంటె విలక్షణమగు ఆత్మ జ్ఞానానందములు గలదనియు, కరుమాణిక్కమలైచే అనన్యార్హశేషత్వమును ఈనాల్గిటిచే ప్రతిపాదింపబడినది. విరోధి స్వరూపము వీడుమిన్‌చే అహంకారమమకారములు త్యాజ్యములనియు, శొన్నాల్‌చే సేవింపతగనివారిని సేవించుట (అసేవ్యసేవనము) తగదనియు, ఒరునాయకమ్‌చే ఐశ్వర్యకైవల్యములు త్యాజ్యములనియు, కొణ్డపెణ్డిర్‌చే బంధువులు కానివారిని బంధువులనుకొనుట (అబంధుసంగమము) తగదనియు నీనాల్గిటిచేతను తెలుపబడినది. ఉపాయస్వరూపము, నోత్త నోన్బుచే అకించనుడనగు నాకు నీపాదములే శరణనియు ఆరావముతుచే వేఱొక్కగతిలేదని భగవంతుని శరణుజొచ్చిన విధము, మానేయ్‌నోక్కుచే భక్తిపారవశ్యములో భగవంతుని శ్రీపాదములు శరణుజొచ్చిన విధమును పిఱన్దవాఱుచే (శేషశాయినిధ్యానించె

ఱు) విధము, ఈనాల్గు తిరువాయ్‌మొழிలచేతను తెలుపబడినది. ఫలస్వరూపము ఎమ్మావీడుచే కైంకర్యమున స్వప్రయోజనముండరాదనియు, ఒழிవిల్‌కాలమ్‌చే సర్వకాలసర్వావస్థలయందును సమస్తకైంకర్యములను చేయవలెననియు, నెడుమాఱ్కడిమైచే అట్టి కైంకర్యము భాగవతులవరకును అనుష్ఠింపవలెననియు, వేయ్‌మరుచే దానిలోను పరసమృద్ధియే ముఖ్యముగానుండవలెననియు, నీ నాల్గు తిరువాయ్‌మొழிలచేతను ప్రతిపాదింపబడెను, ఇట్లే యిరువది తిరువాయ్‌మొழிలయందును ప్రతిపాదింపబడిన విషయమే తక్కిన ఎనుబది తిరువాయ్‌మొழிలయందును విస్తారముగా జెప్పబడి యుండుటచే అర్థపంచకమే యీప్రబన్ధమునకు విషయమని ప్రతిపాదించినను వాటిలో ప్రధానమగు ఉపాయోపేయములు రెండును దీనియందు ప్రతిపాదితములనియు అందునను తొழுతు (నమస్కరించి), కళిత్తేన్ (సంతసించితిని) అనెడి ముక్తలక్షణములచేతను శొల్లిణిశెయ్ ఆయిరమ్ అన్నట్లు స్తుతించుటచేతను వాచికకైంకర్యమొనర్చుటయను ఉపేయమొక్కటియే యిందు తెలుపబడిన విషయమని చెప్పబడినది.

**అవ** - మొదటిగ్రన్థమగు తిరువిరుత్తము చివరిగ్రన్థమగు తిరువాయ్‌మొழி యందలి సారము వాని మొదటిపాశురములందు సంగ్రహింపబడిన విషయము విశదపఱచుచున్నారు.

**63. రహస్యత్తుక్కు ఓర్ ఎழுత్తుమ్ అదుక్కు ఓర్‌ఉరువుమ్‌పోలే అన అవత్తిలే ఇమైయోర్**
తిరుమంత్రమునకు ఒక అక్షరము దానికి ఒక ప్రకృతివలె అయిన వానిలో నిత్యులకు
**అతిపతి అడియేన్‌మననే పొయ్ మయఱ్వు పిఱన్దు అరుళినన్ విణ్ణప్పమ్**
అధిపతి అడియేన్ మననే పొయ్ మయఱ్వు పిఱన్దు అరుళినన్ విణ్ణప్పమ్
**తొழுతెழுఎన్ఱ పఞ్చకత్తోడే అవిద్యాది స్వరూప స్వభావ ఆత్మేశ్వరబన్ధ రక్షణక్రమ**
తొழுతెழு అనిన అర్థపంచకముతో అవిద్యాది స్వరూప స్వభావ జీవపరసంబంధ రక్షణవిధము
**గుణవిగ్రహ విభూతియోగ తదీయాభిమాన ఉపదేశ విషయఅన్యాపదేశ హేత్వాదికళుమ్**
గుణము రూప విభూతియోగ భాగవతాభిమానమే ఉపదేశ విషయ అన్యాపదేశ కారణములు
**సఙ్గృహీతమ్.**
సంగ్రహింపబడెను.

**వ్యా** - తిరుమంత్రమునకు సంగ్రహము ప్రణవము, దానికి సంగ్రహము అకారము నైనట్లు తిరువిరుత్త తిరువాయ్‌మొழி లకు సంగ్రహము వాటియందలి మొదటిపాశురములనుచున్నారు.

ఇమైయోర్‌తలైవా (నిత్యసూరినిర్వాహకా - తిరువి) అయర్వఱుమర్‌గళతిపతి (అజ్ఞాన రహిత నిత్యులకధిపతి (తివాయ్ 1-1-7) అనుటచే పరస్వరూపమును, అడియేన్ (దాసుడను తిరువి,1) ఎన్మననే నామనస్సా (తివాయ్ 1-1-1) అనుటచే శేషభూతమై పరిశుద్ధాంతః కరణముగల

దగు స్వస్వరూపమును, పొయ్‌నిన్ఱఞానముమ్ (దేహాత్మాభిమానము, సాంసారిక దుష్కర్మప్రవృత్తి, మురికిశరీరము (తిరువి, ) మయర్వు (అజ్ఞానము) (తివాయ్ 1-1-1) అనుటచే అవిద్యాదిరూపమగు విరోధిస్వరూపమును ఉయరళిప్పాన్ (ఆత్మలకాపాడుటకై )(తిరువి1), మతినల మరుళినన్ (జ్ఞానానందమును కృపజేసెను (తివాయ్ 1-1-1) అనుటచే వాని కృపయే ఉపాయమని ఉపాయస్వరూపమును, శెయ్యుమ్ విణ్ణప్పమ్ (చేయు విజ్ఞాపనము (తిరువి1) తొళుదెళు (దండము సమర్పించి స్తుతించి (తివాయ్ 1-1-1) అనుటచే కైంకర్యమే పురుషార్థమనెడి ఫలస్వరూపమును ఇట్లర్థపంచకమును సంగ్రహముగ జెప్పిరి. మరియు పొయ్‌నిన్ఱఞానమ్ ఇత్యాదుల అవిద్యాదుల జెప్పునప్పుడు దేహాత్మాభిమానము దాని వలన సాంసారిక దుష్కర్మ దానిచే దేహసంబంధము జన్మపరంపర వీని స్వరూపములును, వీనిచే అన్యథాజ్ఞానమును, సంసారహేతువగుటయును, స్వరూపమును మరుగుపరుచుటయును, ఇనియామురామై అనుటచే వాటి యనాదిత్వము సోపాధికత్వమును, మయర్వఱ మతినలమ్ అనుటచే నవి జ్ఞానముచే పోగొట్టదగినవగుటయు, ఇమైయోర్తలైవా - అడియేన్ అతిపతి - అడితొళుతు ఇత్యాదులచే శేషశేషిసంబంధము, ఉయరళిప్పాన్ ఎన్ఱెన్ఱియోనియుమాయ్ ప్పిఱన్దాయ్ (ఆత్మల రక్షించుటకై ఎన్నిజన్మలనెత్తితివి) అనియు, మయర్వఱ మతినలమ్ (అజ్ఞానరహితమగు భక్తిరూపాపన్న జ్ఞానము) అనుచోట్ల అవతారములనెత్తి రక్షించుటయు, ఉయర్వఱ ఉయర్ నలమ్ - తుయరఱు శుడరడి ఇమైయోర్తలైవా అయర్వఱు అమరర్కళ్ అనుతావులగుణ విగ్రహ విభూతులును తదీయాభిమానమును, నిన్ఱుకేట్టరుళాయ్ (స్థిరముగ నుండుము మనసా) తొళుతెళ్ఱెన్మననే (దండమిడుము మనస్సా) అనుటచే నామనస్సు వలెనే భవ్యుడగు సర్వేశ్వరుడును వానివలెనే భవ్యులైనవారును ఉపదేశవిషయములనియు, నలమరుళినన్ అనుచోట జ్ఞానానందముల నిచ్చినాడనుటచే అన్యాపదేశమునకు గావలసిన భక్తియు మొదలగు నర్థములు సంగ్రహముగ జెప్పబడినవి.

**అవ** - అవిఘ్నపరిసమాప్తికై ప్రబన్ధారంభమున జేయబడు ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశ రూపమగు మంగళాచారములు ఈప్రబన్ధమునకు గలవా యనిన తెల్పుచున్నారు.

**64. అడి తొళుతు ఎన్ఱ ఇతిలే వస్తునిర్దేశ-నమస్కార-ఆశీస్సుక్కళుమ్ ఉణ్డు.**

అడి తొళుతు అనిన దీనిలో వస్తునిర్దేశము-నమస్కారము-ఆశీస్సులును ఉన్నవి.

**వ్యా-** తుయరఱు శుడరడి (దుఃఖమునుబోగొట్టు ఉజ్జ్వలపాదము) అనుటచే వస్తునిర్దేశమును, **తొళుతు** (నమస్కరించి) అనుటచే నమస్కారమును, ఎళు (ఉజ్జీవించుము) అనుటచే ఆశీర్వాదమును తెలుపబడినవి.

ఆళ్వారులీప్రబన్ధమును రచింపవలెననెడి తలంపుతో వ్రాసినదిగాక వీరి కవిత్వమువలన లోకమును దిద్దుబాటు చేయవలెననెడి కోర్కెగల సర్వేశ్వరుని సంకల్పమువలన సర్వలక్షణోపేత

ముగ ముగించిన గ్రన్థమగుటచే మంగళాచారమున్ను తలవని తలంపుగ నేర్పడినది. **అడితొఘ్రుతు** అను తావున నివి కలవని చెప్పిరే గాని వీటిని బుద్ధిపూర్వకముగ చేసియుండిరని చెప్పలేదు.

**అవ** - ఈ ప్రబన్ధము పదిపత్తులుగా నవతరించుటలో నుపయోగము దెల్పుచున్నారు.

**65. శాతుశనమ్ నణ్ణా మయర్వఱ మాశఱుక్కుమ్ తెరుళ్కొళ్ళ పత్తరావర్**
శాతుశనమ్ నణ్ణా మయర్వఱ మాశఱుక్కుం తెరుళ్కొళ్ళ పత్తరావర్
**అడిమైయఱ ఉరియ నోయ్కళ్ అఱుక్కుమ్ ఉడైన్దు ఏత్తరుమ్ వానిన్**
అడిమైయఱ ఉరియ నోయ్కళ్ అఱుక్కుం ఉడైన్దు ఏత్తరుం వానిన్
**తాళిన్కీళ్ అడిక్కీళ్ ఇన్బక్కతి పయక్కుమ్ ఈడుపుక్కు మూవులకుమ్**
తాళిన్కీళ్ అడిక్కీళ్ ఇన్బక్కతి పయక్కుం ఈడుపుక్కు మూవులకుం
**ఉరుకానిఱ్పర్ ఎన్నుమ్ సామ్యత్తాలే వాచ్యన్ పత్తినాయ త్తోత్తమ్పోలే**
ఉరుకా నిఱ్పర్ అనెడి సామ్యముచేత వాచ్యుడు పదిగ అవతరణవలె
**త్తోత్తజ్గళ్ ఆయిరత్తిన్ పత్తు ప్పత్తాన ఇతిన్ ఆవిర్భావమ్.**
అవతరించిన వేయిలో పది పదులుగ దీని ఆవిర్భావము.

**వ్యా** - శాతుశనత్తైనలియుమ్ కణ్ణనై శాతిప్పతఱ్కు (తివాయ్ 3-5-5) సాధుజనులను బాధించు కంసునిచంపుటకై అన్నట్లు సత్పురుషులను రక్షించుటకు సర్వేశ్వరుడవతరించినట్లు ఈ ప్రబన్ధ మును నణ్ణా అశురర్ నలివెయ్త (ద్వేషించువారు చచ్చునట్లు) అన్నట్లు ఆసురస్వభావులు నశించునట్లును మయర్వఱ (అజ్ఞానముబోగొట్టి) అన్నట్లు స్వామి అజ్ఞానమును బోగొట్టి జ్ఞానభక్తుల నొసగినట్లు ఈ ప్రబన్ధమును మాశఱుక్కుమ్ (తివాయ్ 5-2-11) మనోదోషముల పోగొట్టును అన్నట్లు మనస్సునందలి దోషము పోగొట్టి తెరుళ్కొళ్ళచ్చొన్న (తివాయ్ 2-10-10) జ్ఞానముగలుగునట్లు చెప్పిన అన్నట్లు తత్వజ్ఞానముగల్గునట్లొనర్చియు ఇప్పత్తాల్ పత్తరావర్ (తివాయ్ 3-6-11) ఈప దిచే భక్తులగుదురు, అనియు అడిమైయఱక్కొణ్డాయ్ (దాసునిగా స్వీకరించితివి) అనియు ఉరియ తొండరాక్కుం (తివాయ్ 6-9-11) అనన్యార్హశేషభూతులనొనర్చును అనియు నోయ్కళఱుక్కుమ్ (కష్టములబోగొట్టును), ఉడైన్దు నోయ్కళైయోడువిక్కుమ్ (తివాయ్ 1-7-11) సంసారాది మహావ్యా ధులను పోగొట్టును, పత్తరుమ్ వైకున్దత్తై యరుళుమ్ నమక్కు (స్తుతింపరాని పరమపదమును మనకు కృపజేయును,) అన్నట్లు సాంసారిక సకల దుఃఖములను నశింపజేసి పరమపదమును కృప జేయును అనునట్లు ఈప్రబన్ధమున్ను వానిన్మీతేత్తియరుళ్శెయ్తు (పరమపదమును బొందించునట్టి కృపను గల్గజేయును) అనియు, తన్ **తాళిన్ కీళ్** శేర్తి తమ శ్రీపాదములక్రింద చేర్చుకొని సర్వేశ్వ రునివలెనే యిదియు అరుళిఅడిక్కీళ్ఇరుత్తుమ్ కృపతో శ్రీపాదములక్రిందికి గొనిపోవుననియు, ఇన్బ క్కతిశెయ్యుమ్ (తివా 7-5-11) ఆనందరూపమోక్షమిచ్చునన్నట్లు ఇదియు ఎజ్ఞనే శొల్లిలుమ్ ఇన్బ మ్పయక్కుమ్ ఎట్లు అనుసంధించినను మోక్షము గల్గించుననియు, **ఈడుపుక్కు**ఎనతావియై ఉరుక్కి

ఉండిడుకిన్ఱనిన్ఱన్నై (తివాయ్ 5-10-10) లోనప్రవేశించి నాయాత్మను కరిగించి చంపుచున్నది అన్నట్లు యిదియు ఒన్బతోడొన్నుక్కు మూవులకుమురుకుమ్ (తివా 9-5-11) తొమ్మిదితోగూడినఒక టిని (పదిని) అనుసంధించిన ప్రేమ వలన మనసుకరుగుననియు, ఊత్తిన్‌కణ్మణ్మణఱ్పొలురుకాని ఱ్పర్ నీరాయ్ (తివాయ్ 6-8-11) చెలమ యందలి సన్నని యిసుకవలె కరిగిపోదురు అన్నట్లు ఇదియు తన ననుభవించుటకు యత్నించువారలను ద్రవద్రవ్యముగాజేయుననియు, ఇట్లీప్రబన్ధము సర్వేశ్వరునితో సమానమై వాచ్యుడగు సర్వేశ్వరుని పత్తినాయతోత్తమ్ అన్నట్లు పదియవతారములవ లెనే తోత్తఙ్గళాయిరమ్ అన్నట్లు పదిపత్తులుగా నవతరించెనని యెఱుగతగును, దీనిచే సర్వేశ్వరుడు లోకరక్షణార్థము పదియవతారము లెత్తినట్లు ఈప్రబన్ధమున్ను లోకరక్షణార్థము పదిపత్తులుగా నవత రించినదాయెను,

**అవ** - ఇక ఈ పదులనున్ను వీనితోగూడిన ప్రబన్ధమున్నున్ను, దీనిని సాదించిన ఆళ్వార్ల అభిప్రాయమును సోదాహరణముగ తెలుపుచున్నారు.

**66. ఐన్దినోడు ఒన్బతోడు ఒరుపత్తు ఎన్నుమవైపోలే నూఱే శొన్న పత్తునూఱు**
ఐదిటిలో తొమ్మిదితో ఒకపది అన్నట్లుగనే నూరుగచెప్పిన పదినూర్లు
**ఓరాయిరమ్ ఎన్ఱతుమ్ సాభిప్రాయమ్.**
ఒకవేయి అనుటయు అభిప్రాయ గర్భితము.

**వ్యా** - ఇన్దినోడైన్దుమ్‌వల్లార్ ఐదిటితో ఐదిటిని అభ్యసించువారు అనుటచే మొదటి ఐదు పాశురము లకు నొకయభిప్రాయమును తరువాతి ఐదుపాశురములకు నొకయభిప్రాయమును అనితెల్పుట. అట్లే తొమ్మిదితో నొకటి యనుటచే తొమ్మిదిపాశురములకు నొక యభిప్రాయమును ఒకపాశురమునకు నొక యభిప్రాయమును తెల్పుట. అట్లే పత్తుం అని పదిపాశురములకును చేర్చి యొక్కటియే యభి ప్రాయమనుట. పాదలోరాయిరత్తుళ్ ఇవైయుమొరుపత్తు వేయిపాశురములలో నీ నూరును అనుటచే నూరు పాశురములకును ఒకే యభిప్రాయమని తెల్పుట, నూఱేశొన్నవోరాయిరమ్ నూఱునూఱులుగా చెప్పిన వేయియనియు పత్తు నూత్తు ళిప్పత్తు పది నూర్లలో యీ పదియనియు తెరియచ్చొన్నవోరా యిరమ్ నూఱు నూఱులుగా చెప్పిన వేయియనియు పత్తు నూత్తుళిప్పత్తు పదినూర్లలో యీపదియ నియు తెరియచ్చొన్నవోరాయిరమ్ అనియు మిక్కఓరాయిరమ్ అనియు అవావిలందాదికళాలివైయా యిరముమ్ అనియు వేయిపాశురముల నొక్కటిగాజేర్చి చెప్పినదియు ఒక్కొక్క అభిప్రాయముండు టచే నని తెలియనగును.

**అవ** - ప్రతిపత్తునందును ఒక్కొక్క తిరువాయ్‌మొ‌ళ్ఴి ప్రధానమై ఆయాపత్తులకు ఆయా తిరువాయ్‌మొళ్ఴియందు లక్ష్యముండుటను సోదాహరణముగ తెలుపుచున్నారు.

**67. పాట్టుక్కు క్రియైయుమ్ పత్తుక్కు క్కరుత్తుమ్బోలే నూత్తుక్కు ఉపదేశప్పత్తు.**
పాశురాలకు క్రియయును పదికి తాత్పర్యమునువలె నూటికి ఉపదేశపరమగుపది.

వ్యా - పాశురము క్రియాపదముతో పూర్తికావలసియుండుటచే ప్రతిపాశురమునకును క్రియాపదము ప్రధానమైనట్లును, ఒక్కొక్క తిరువాయ్‌మొళ్ళికిని పరత్వము, భజనీయత సౌలభ్యము, అపరాధసహత్వము మొదలగునవి ప్రత్యేక ప్రత్యేకముగ నుండుటచేతను పదిపాశురముల అభిప్రాయమును తెలుపునట్టి పాశురము ప్రధానమైనట్లును, నూరు పాశురములలో పరోపదేశపరములగు పదిపాశురములును ప్రధానములని ఏర్పడుచున్నది.

పిణఙ్గి యమరర్ పితత్తుమ్ (తివాయ్ 1-6--4) నిత్యసూరులు తామనుభవించెడి గుణమేగొప్పదని తమలోతాము వివాదపడెడి స్వామియొక్క పరత్వ సౌలభ్యాదిగుణములను ఆళ్వార్లు తామొక్కరే యనుభవింప సాధ్యముగాక అడియార్‌కళ్ కుళ్ళాంగళై ఉడన్ కూడువతెన్లుకొలో (భాగవతుల గోష్ఠిలో చేరుట యెన్నడో) అని భాగవతగోష్ఠికై వెదకి యట్టి వారి నెచ్చటను లభింపక, అందుబాటులో నున్న అనధికారులగు సంసారుల అయోగ్యతను జూడక, వారినే దిద్దుబాటొనర్చి భగవద్గుణానుభవమున రుచిగలవారినిగా చేసి తమ గోష్ఠిలో చేర్చుకొనుట మంచిదని తలచి పరోపదేశమొనర్చిన పాశురములు ప్రధానములని తెలియదగును.

అవ - పరోపదేశపాశురములో భగవద్భక్తులనుగూర్చి ఉపదేశించిన పాశురముల యభిప్రాయమును దెల్పుచున్నారు.

**68**. భగవత్‌భక్తపరఙ్గళ్ ఆశ్రయణ విధి విశేషఙ్గళ్.

భగవత్‌భక్త పరములు ఆశ్రయణవిధికి అంగభూతములు.

వ్యా - భగవంతుని స్వరూప రూప గుణాదులను తెలుపునట్టి పాశురములును భాగవతుల స్వరూప స్వభావాదుల తెలుపునట్టి పాశురములును నివి యన్నియును భగవదాశ్రయణమునకు అంగములే యగుచున్నవి.

స్వర్గముకోరువారు జ్యోతిష్టోమయాగముచేయునది యనెడిచోట స్వర్గఫలమునకు జ్యోతిష్టోమము అంగమైనట్లు తిరునారణన్‌తాళ్‌కాలమ్బెఱచ్చిన్దిత్తుయ్‌మినో (తివా 4-1-1)నిరుపాధిక స్వామి యగు శ్రీమన్నారాయణుని శ్రీపాదములను కాలవిళంబములేక ధ్యానించి యుజ్జీవించుడనియు, నలమన్దమిల్లతోర్‌నాడు పుకువీర్ (తివా. 2-8-4) అంతములేని యానందముగల సాటిలేని పరమపదమును ప్రవేశింపదగువారలారా యనియు, నిట్లు విధింపబడిన భగవదాశ్రయణమునకు, పయిలుమ్ శుడరొళి మొదలగు భాగవతులవిషయమగు పాశురములు అంగభూతములు.

అవ - పరత్వాది గుణవిశిష్టుడగు సర్వేశ్వరుడు, ఆళ్వార్లకు కల్గించిన దశలను ప్రతిపత్తునందును తెల్పియుండిరని సంగ్రహముగ తెలుపుచున్నారు.

**69**. పరత్వ కారణత్వ వ్యాపకత్వ నియంతృత్వ కారుణికత్వ శరణ్యత్వ శక్తత్వ సత్యకామత్వ

పరత్వ కారణత్వ వ్యాపకత్వ నియంతృత్వ కారుణికత్వ శరణ్యత్వ శక్తత్వ సత్యకామత్వ

**ఆపత్సఖత్వ ఆర్తిహరత్వవిశిష్టన్ మయత్తైవ్ యఱుక్క తత్త్వవేదన మఱప్పత్తు**
ఆపత్సఖత్వ ఆర్తిహరత్వవిశిష్టుడు అజ్ఞానమును పోగొట్టగా తత్త్వజ్ఞానమున మరువులేక
**జ్ఞప్తిఫల ముక్తి తలైశేర నిష్కర్షిత్తు మోక్షఫలవృత్తిశెయ్య అర్థిత్తు**
జ్ఞానఫలమగు మోక్షమును శిరోధార్యముగ నిష్కర్షించి మోక్షవృత్తిజేయ ప్రార్థించి
**పురుషార్థఫలాన్య రుచియొழிన్దు విరక్తి ఫలరాగమ్కழிయమిక్కు ప్రేమఫల ఉపాయత్తే**
పురుషార్థ ఫలమగుఅన్యరుచిని విడిచి వైరాగ్య ఫలప్రీతి మిక్కిలి కాగా ప్రేమఫలఉపాయమున
**పుకున్దు సాధన ఫల ఉపకార కైమ్మాఱిన్ఱి కృతజ్ఞతాఫల ప్రతికృతమానత్తై ఉణర్న్దు**
జేరి సాధన ఫల ఉపకార ప్రతి లేక కృతజ్ఞతాఫల ఆత్మసమర్పణను తెల్సుకొని
**ఆత్మదర్శన ఫలప్రాప్తిమరణావధియాకప్పెత్తు కాలాసత్తి ఫల గతిక్కు**
ఆత్మదర్శన ఫలప్రాప్తిమరణావధిగనెరిగి కాలమౌటచే ఫలమగు అర్చిరాదికి
**త్తుణైకూట్టిన తమ్ పేత్తై పిఱర్ అఱియ పత్తు త్తోఱుమ్ వెళియిడుకిఱార్.**
సహాయమగు తమఫలమును ఇతరులెరుగ పదులన్నిటను ప్రకాశింపజేసిరి.

## అழகియమణవాళ ప్పెరుమాళ్‌నాయనార్ తిరువడికళే శరణమ్.

**వ్యా** - పరత్వ కారణత్వ వ్యాపకత్వ నియంతృత్వ కారుణికత్వ శరణ్యత్వ సర్వశక్తిత్వ సర్వకామత్వ ఆపత్సఖత్వ ఆర్తిహరత్వమను పది గుణములును తిరువాయ్‌మొழிయందలి పదిపదులచేతను ప్రతిపాదింపబడినవి. ఇట్టి గుణములుగల సర్వేశ్వరుడు ఆళ్వార్లకు మయర్వఱమతినలమరుళినన్ (అజ్ఞానరహితమగు భక్తిరూపాపన్న జ్ఞానమును కృపజేసెను) అన్నట్లు అజ్ఞానమును నిశ్శేషముగా బోగొట్టగా, మరప్పనో ఇని (మరతునాయిక) యన్నట్లు, మరువనివారై అట్టి జ్ఞానఫలమగు మోక్షమును నిన్సెమ్మాపాదపఱుత్తలైశేర్తు (నీ యెఱ్ఱని పాదపద్మములను నా తలపై నుంచుము) అని, స్వరూపానురూపముగా నిష్కర్షించి దానికి ఫలమగు కైంకర్యవృత్తిని వழுవిలాఅడిమైశెయ్య వేణ్డుం (విచ్ఛిత్తిలేని కైంకర్యమును చేయవలెను) అని ప్రార్థించి, అట్టి పురుషార్థఫలమగు విషయాన్తర నివృత్తిని ఐజ్జరువి కణ్డవిన్బమ్ (పంచేంద్రియముల సుఖమును) అనియు, శిత్తిన్బమ్ ఒழிన్దేన్ (అల్పమగుకైవల్య సుఖమును విడిచితిని) అనియు, విషయాన్తర విరక్తిని తెలిపి, దానికనుకూలమగు భగవద్విషయప్రీతిని కழிయమిక్కతోర్కాతల్ (మిక్కిలి అతిశయించిన ఆశ) అని తెల్పి ఆప్రీతివలన ఆలస్యమును సహింపలేక కల్గిన త్వరచే అలర్‌మంగై ఉఱైమార్బా ఉన్నడిక్కీழ் అమర్న్దు పుకున్దేన్ (లక్ష్మిని వక్షస్థలమునగల శ్రీమన్నారాయణా నీ శ్రీపాదములను శరణుచొచ్చితిని) అన్నట్లు ఉపాయమును వరించి, అట్టి ఉపాయమువలన కల్గిన ఉపకారమునకు ప్రత్యుపకారముగ ఉతవికైమ్మాఱెన్నుయిర్ అని ఆత్మసమర్పణ మొనర్పదలచి, అతువుమత్తాఙవన్‌తన్నతు (అదియును వానిదే) అని యిచ్చుటకు తనదెద్దియును లేదని తొట్రుపడి తోళ్‌కళైయారత్తழுవి అని చేతులార కౌగలిం

చుకొని నిన్గఒన్రైయుణర్న్దేన్ (వ్యాపించియున్న నిన్నెఱిగితిని) అని వ్యాపించియుండి ఆత్మను శరీర ముగాగలవాడు తనకు శేషభూతుడననెడి జ్ఞానమును నాకు గల్గించెనని యెఱిగి, దేహాదులకంటె విలక్షణమై శేషభూతమై అనన్యార్హమైన ఆత్మతత్వము నెఱిగి, ఆయాత్మజ్ఞానఫలమగు భగవత్ప్రాప్తిని మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్ (శరీరానంతరము శ్రీవైకుంఠమునిచ్చును) అని సర్వేశ్వరుడేర్పఱచిన కాలమున అర్చిరాదిమార్గమున పరమపదమునకు బోవుటయే ఫలముగాన అందులకై కాలమేకత్తైయన్నిమత్తొన్నిలమ్కతి నీలమేఘశ్యామునికన్న వేరొకగతి లేదు అనినట్లు సర్వేశ్వరునే పరమాప్తుడగు రక్షకునిగ ప్రార్థించి, నేనులభించిన ఫలమును ఇతరులును లభించి సుఖింపవలెనను తలంపుతో మొదటి శతకము నుండి పదియవశతకము వరకును తెలిపియుండిరి.

సర్వేశ్వరుడు ఆళ్వార్లకు అజ్ఞానములేని జ్ఞానానందమును కృపజేసినట్లు, ఆళ్వార్లును లోకుల అజ్ఞానమును బోగొట్టి జ్ఞానభక్తులను ఉపదేశమూలముగ గల్గజేసి భగవాను నాశ్రయింపజేయుచున్నారని యెఱుగునది.

## ఆచార్యహృదయమున తృతీయ ప్రకరణము సమాప్తము.

## పెరియజీయర్ తిరువడికళే శరణమ్.

# చతుర్థ ప్రకరణము

## తిరువాయ్‌మొళ్ళి ఒకటవ పత్తు సారసంగ్రహము

1. పరపరనాయ్ నిన్ఱ వళవేర్ప్ వైప్పామ్ అవన్ అవైయుళ్ ఉమ్బర్‌వానవర్ అతిపతి
శ్రేష్ఠకారణుడైఉన్న సమృద్ధిలోకనిధియై అతడు వానిలో నిత్యసూరులకు అధిపతి
మయర్వఱ మన్ని మనమ్‌వైక్క త్తిరుత్తి మఱక్కుమెన్ఱు నల్‌కి విడాతే మన్ని
అజ్ఞానములేక స్థిరముగ మనసుంచ దిద్ది మఱచునని ప్రీతిచేసి విడువక ఉండి
అయర్విలన్ అఱుత్తేన్ ఎన్‌శొల్లి మఱప్పనో ఎన్నుమ్బడి తత్త్వజ్ఞరానవర్
స్తుతింతును జన్మపోగొట్టితిని ఏమనిచెప్పి మఱతును అనునట్లు తత్త్వజ్ఞులగువారు
శుడరడి ఎమ్బిరానై విడాతు, కణ్డాయ్ నీయుమ్ నానుమ్ ఎన్గిఱ
వెలుగుగల పాదములఉపకారకుని విడువకు, చూచితివా నీవును నేనును అనెడి
సహృదయానుభవమే సంసారికళుక్కుమామ్బడి వీడుమిన్ ఎన్ఱు త్యాజ్యోపాదేయ
మానసానుభవమే సంసారులకునగునట్లు వీడువుడు అని త్యాజ్యఉపాదేయ
దోషగుణ పరిత్యాగ సమర్పణ క్రమత్తై సాలమ్బన మన్త్రమాక ఉపదేశిత్తు ఎళితాక
దోషగుణ పరిత్యాగ సమర్పణ క్రమమును ఆధారమగు మంత్రముతో ఉపదేశించి సులభుడై
అవతరిత్తు ప్పిళ్ళైకళై సహిత్తు ప్పరైయఱ క్కలన్ఱు అల్పసంతుష్టనాయ్ అమృతమే
అవతరించి దోషములను సహించి భేదములేక కలిసి అల్పసంతోషియై భగవద్విషయమే
ఔషధమాక్కి నీర్‌పురైయ తన్నై నియమిత్తు భోగత్తై సాత్మిప్పిత్తు భక్తి గణనైకళుక్కు
మందుచేసి నీటివలె తనను నియమించి భోగమును ఒంటపట్టించి భక్తికి లెక్కించుటలకు
ఒక్క వరుమవనుడైయ సేవైక్కు ఎళిమైయుమ్ ఇనిమైయుమ్ ఉణ్డు. తొళ్ళుతాల్
సమముగ వచ్చువానియొక్క సేవకు సౌలభ్యమును భోగ్యతయును కలవు. దండమిడుచో
అరుమ్ పయనాయ తరుమ్ ఉద్యోగత్తే వినైకళుమ్ మాళుమ్ అవన్ ఉరైత్త
దుర్లభ ఫలములను ఇచ్చును యత్నముననే పాపములున్ను నశించును అతడు చెప్పిన
మార్గత్తేనిన్ఱు ఇరుపశై మలమఱ ఉణర్వుకొణ్డు నలమ్‌శెయ్‌వతెన్ఱు తామ్ మయర్వఱ
దారినుండి అజ్ఞాన దోషములేక జ్ఞానముగల్గి భక్తిని చేయుడని తాము అజ్ఞానములేని
మతినలమరుళి భజనత్తిలే శేర్క్కిఱార్ ముతల్ పత్తిల్.
భక్తినిచెప్పి ఆశ్రయణమున చేర్చుచున్నారు మొదటి శతకమున.

వ్యా - సకలవస్తువులకును శ్రేష్ఠమగు కారణమై ఆ వస్తువులను ప్రళయకాలమున తనలో నుంచుకొని సమస్తపదార్థములను తనకు శరీరముగ గలిగి, ఉభయవిభూతి నాథుడై ప్రాప్యప్రాపకములు తానేయై, అపరిచ్ఛేద్యమగు ఆనందము గలవాడై, నిత్యసూరి నిర్వాహకుడై వారలకును ఇంతమాత్ర

మని చెప్పశక్యము గాని మహిమగలవాడగు సర్వేశ్వరుడు, ఆళ్వార్లయొక్క తొలగించుటకు సాధ్యప డని ప్రబలమగు పుణ్యపాపరూపకర్మలను విషయాంతరములందు గల రుచివాసనలనున్ను పోగొట్టి, తమ అయోగ్యతను తలుచుకొని వెనుదీయునప్పుడును తన స్వభావముచూపి తనవైపునకే వీరి మనసుండునట్లులొనర్చి, బీడుభూమిని సేద్యమొనర్చినట్లు చక్కజేసి.

వీరింకను మరచిపోవుదురేమోనని మిక్కిలి ప్రేమించి వీరి హృదయమున స్థిరముగ నిలిచి, యోగ్యతాయోగ్యతల జూడక భూమినంతను కొలిచిన శ్రీపాదముల లభింపజేసి జన్మచేగల్గిన అజ్ఞానమును బోగొట్టి తత్వజ్ఞానమును సంశయవిపర్యయములులేనట్లనుగ్రహించగా,

ఆళ్వార్లు తాము పొందిన ప్రయోజనమును మనసా నీవును నేనును కలిసియున్నచో చేయలేని దేమున్నదనియు, వాని ఉపకారమును చూచితివిగదా యనియు, మన అయోగ్యతలను తలచక వాని యందు స్థిరబుద్ధితో నుంటిమేని ఆతడు మన అనాదికాలార్జితమైన కర్మమును విషయప్రావణ్యమును ప్రయోజనాంతర శ్రద్ధను, సాధనాంతరసంగమును మనదరికి చేరనీయడుసుమాయని మనసునకు బోధించి, తామనుభవించిన భగవదనుభవమును తామొక్కరే ఒంటరిగా ననుభవించుట కిష్టపడక, సర్వేశ్వరునితో సంబంధము అందరికిని కలదగుటచేత తాము దిద్దబడినట్లే లోకులెల్లరును దిద్దబడవలెననెడి పరహితమును కోరినవారై సంసారులెల్లరకును త్యాజ్యోపాదేయ విభాగరూపమగు అల్పాస్థిరత్వాదిదోషములతో కూడిన అహంకార మమకారరూపమగు మనోమాలిన్యమును వీడి మీయాత్మలను స్వామికి సమర్పింపుడనియు, అట్టి ఆత్మసమర్పణరూపముగా అర్థమును తెలియబఱచెడి తిరుమంత్రమును ఉపదేశించిరి.

సర్వేశ్వరుడు, ఆశ్రయించువారలకు అతీంద్రియుడనుకొనవట్లు రామకృష్ణాద్యవతారములెత్తి తన సౌలభ్యమును తెలిపి, సులభుడై, ఆశ్రితుల అపరాధముల సహించువాడై, వారితో అరమరికలేక కలిసిమెలసి యుండెడి తన సౌశీల్యగుణమును జూపి, వారొనర్చిన సేవలకు తృప్తిపొందనివాడువలెగాక పూర్ణుడై స్వారాధ్యుడై, అమృతమును ఔషధముగాచేయువానివలె తనయనుభవామృతమునే వారిసంసారవ్యాధికి ఔషధమొనర్చి, మెరకకు నీరెక్కించు ఉపాయజ్ఞునివలె వీరి మనసు తన వైపునకు మరల్చుకొని, గోష్పాదమున సముద్రము నిముడ్చునట్లు తనయనుభవమును వారికి గల్గించి, ఆశ్రయింపజేసికొని, వారి మోక్షమున కాటంకములగు సకల క్రూరపాపములను పోగొట్టి అనంతమగు తన ప్రయోజనము నొసంగుటకై,

మనమేమి చేయవలెననగా, అనాదికాలముగ నీ యాత్మతో నంటియున్న అత్యంతక్రూరపాపములు ఆశ్రయింపగనే నశించుననియు, వేద బాహ్యములగు నాఱుసిద్ధాంతములందలి విరోధము పోవునట్లు నిరవధిక వాత్సల్యయుక్తుడగు శ్రీకృష్ణుడు, రథమునందు అర్జునవ్యాజముతో లోకులకుపదేశించిన మన్మనాభవ అనుతావుల జెప్పిన భక్తిమార్గమందుండి దేవతాంతరములందు ఈశ్వరత్వ బుద్ధిని వీడి వాని విషయమగు జ్ఞానముతో ఫలాపేక్షలేక భక్తినిచేయవలెనని, తాము ప్రమాదములేని విధమున సర్వేశ్వరునిచే లభించిన జ్ఞానానందములను సంసారులును పొందవలెననెడి పరమ కృపతో నుపదేశించుట మొదటి శతక సారము.

## తిరువాయ్‌మొழி రెండవ పత్తు సారసంగ్రహము

2. **శోరాత మూవా వేర్‌ముతలాయ్ ఉలకమ్ పడైత్తవన్ ఎన్గిఱ చిదచిత్త్రయ**
కొఱతలేక త్రివిధ మూలకారణుడై లోకముసృజించినవాడు అన్నట్లు చిదచిత్రయ
**త్రివిధకారణమానవన్ అఱియాతన అఱివిక్క ఉళ్ళమ్‌తేఱి తూమనమ్ మరుళిల్ ఎన్గుమ్**
త్రివిధకారణుడు తెలియనివి తెల్పగా మనసుతేటయై పవిత్రమనసు అజ్ఞానములేని అనిన్నీ
**జ్ఞానఫలమాన ఒళిక్కొణ్డ మోక్షమ్ తేడి వాడ ఉలరామల్ ఆవిశేర్న్దు శిక్కెన పుకున్దు**
జ్ఞానఫలమైన కాంతిగల మోక్షమును వెదకి వాడగా తల్లడిల్లనట్లు ఆత్మతోచేరి త్వరగ ప్రవేశించి
**సమ్బన్ధికళుమ్ శేర్‌తల్‌మాఱినర్ ఎన్న వాழ்విత్తు ఉపకరిక్కిఱ నీన్దుమ్ కెడలిల్**
సంబంధులున్ను చేరుటమానిరి అన్నట్లు సుఖింపజేసి ఉపకరించునట్టి నీన్దుమ్ కెడలిల్
**ఎమ్మావీట్టై, ఉభయానుగుణమాక్కినవర్ ఆశ్రయణీయనుక్కు పూర్వోక్తపరత్వత్తై**
ఎమ్మావీడు మొ.ఉభయానుగుణమొనర్చిన ఆళ్వార్లు సర్వేశ్వరునకు ముందుచెప్పినపరత్వమును
**స్థాపిక్కిఱ సకలఫలప్రదత్వ కారణత్వ శేషశాయిత్వ శ్రియఃపతిత్వ సౌలభ్యాదికళై**
స్థాపించిన సకలఫలప్రదత్వ కారణత్వ శేషశాయిత్వ శ్రియఃపతిత్వ సౌలభ్యాదులను
**తిణ్ణన్ అణైవతెన్గు వెళియిట్టు కళ్వా తీర్తన్‌ఎన్గు వచనప్రత్యక్షజ్ఞళుమ్ కాట్టి,**
తిణ్ణన్ అణైవతులలో బయల్పఱచి కళ్వా తీర్తన్ అను వచన ప్రత్యక్షముల జూపి
**పులనైన్దు ఎన్గు సంసార మోక్ష సాధన దుఃఖానన్దరసమ్ మున్నాక విధిక్కిఱ**
ఇంద్రియములైదు అని సంసార మోక్ష సాధనము దుఃఖానందరసముల ముందుగ విధించుచున్న
**అన్తర్గుణోపాసనత్తై మతిత్తు పెరుక్కి మూழ்కి అழுన్ది కీழ்మై వలమ్ శూతుమ్ శెయ్‌తు**
అంతర్గుణోపాసనను మతిత్తు పెరుక్కి మూழ்కి అழுన్ది కీழ்మై వలం శూతుంశెయ్‌తు(మొ.చోట్ల)
**ఇళమై కెడామల్ శెయ్యుమ్ క్షేత్రవాస సఙ్కీర్తన అఞ్జలి ప్రదక్షిణ గతి చింతన ఆది**
బాల్యము చెడకనే చేయదగు క్షేత్రవాస సంకీర్తన అంజలి ప్రదక్షిణ గతి చింతనమొదలగు
**అఙ్గయుక్తమాక్కుకిఱార్ ఇరణ్డామ్ పత్తిల్.**
అంగములతో చేర్చుచున్నారు రెండవ పత్తున.

**వ్యా** - సర్వకారణుడగు సర్వేశ్వరుడు, మొదటిశతకమున దెలిపినట్లు ఆళ్వార్లకు తెలియనివన్నియు తెలియునట్లు జేయగా, జ్ఞానసంపన్నులైన వీరు, జ్ఞానఫలమగు మోక్షమును వెంటనే పొందగోరి, అది లభించకపోవుటచే దుఃఖితులుకాగా, సర్వేశ్వరుడు వీరి దుఃఖముబోవునట్లు స్వయముగ వచ్చి వీరిని ఆలింగనమొనర్చి, అందుచే తానే ప్రీతిగలవాడై అట్టి ప్రీతిని వీరివరకేగాక, వీరితో సంబంధముగలవారి పరంతము వ్యాపింపజేసి, అట్టి ప్రీతిమూలముగ వీరికి పరమపురుషార్థమగు మోక్షము నొసంగ యత్నింప, అట్టిమోక్షమును వానిశేషిత్వమునకును తమయొక్క శేషత్వమునకును తగినట్లు నిష్కర్షించి, సర్వేశ్వరుని పరత్వలక్షణములను బయల్పఱచి వానికితగిన శ్రీసూక్తులను ప్రత్యక్షాది

ప్రమాణములను దెల్పి, ఆశ్రయణరుచిగల్గుటకై విడువదగినదగు సంసారమున గల దుఃఖమును, పొందదగిన మోక్షమునగల ఆనందమును వాటికితగు సాధనమున గల రసమును ముందుగ విధించునట్టి సగుణ బ్రహ్మోపాసనమును, నిషిద్ధానుష్ఠానత్యాగపూర్వకముగ క్షేత్రవాసాది అంగములతో గూడ దెల్పుట రెండవపత్తునందలి సారము.

## తిరువాయ్మొழி మూడవ పత్తు సారసంగ్రహము.

3. ముழுతుమాయ్ ఎజ్గణుమ్ ఒழிవర అరువాకినిన్ఱు తోయ్విలనామ్ సర్వవ్యాపకన్
మొత్తమునై అంతటను విడుపులేక లోననుండి అంటనట్లు సర్వవ్యాపకుడు
తీర్న్ద అడియార్కళై త్తాళిణైక్కీழ் కొళ్ళుమ్ తన్పడిక్కుమ్ నీ తన్ద మామాయ
అనన్యార్హదాసులను పాదద్వయముక్రిందగొను తనవిధికి నీవిచ్చిన ఆశ్చర్యయుక్త
ప్పుణర్వినై ప్పిఱప్పుழுన్ది అలమరుకిన్దేన్ వేరఱ అఱిన్దు ఎన్నాళ్ ఎజ్గువన్దు
కర్మమూలమగు జన్మలమునిగి తల్లడిల్లుచుంటిని వేళ్ళతో నరికి ఏనాడు ఎటకువచ్చి
త్తలప్పెయ్వన్ ఎన్ఱు క్కూ ఱిత్తు ప్పుకున్దుమ్ తజ్గాతలుక్కుమ్ సదృశమాక క్కణ్డుకొళ్ళున్నుమ్
సమీపింతునో అని పోగొట్టి చేరతగిన తమఆశకు తగినట్లు చూచుకొనుమని
ఊనమిల్ మోక్షఫలమాన ముడిచ్చోదియిల్ అనుభవత్తాలే నిత్యవస్తు వీడుపెత్తు
కొఱతలేని మోక్షఫలమగు ముడిచ్చోదియందలి అనుభవముచే నిత్య ఆత్మ సత్తనుపొంది
అవచ్ఛేదమత్త అడిమైశెయ్యవేణ్డుమ్పడి సర్వాత్మభావత్తై ప్పుకழ்న్దు శొల్లి ప్పాడి
హద్దులేక కైంకర్యముచేయతగినట్లు సర్వాత్మభావమును కీర్తించి చెప్పి పాడి
ఏత్తి ప్పితత్త ఎழுన్దుమ్ పఱన్దుమ్ తుళ్లి క్కనిత్తు త్తడుకుట్ట క్కమ్బిడు నట్టమిట్టు
స్తుతించి జల్పించి లేచియు పరుగిడి త్రుళ్లి గెంతి తల్లక్రిందుల దండమిడి నాట్యమాడి
శిరిక్క క్కుழైన్దు నైయుమ్ ప్రీతియుకళ త్తమ్మడి యారెన్న ఉడన్కూడుమ్ సాధ్యమ్వళర
నవ్వగా కరిగి శిథిలమగు ప్రీతిపొర్ల తమభక్తులనునట్లు కలిసియుండు ఫలముపెరుగ
పైప్పకొళ్ పామ్పుపోలే యిన్ద్రియవృత్తి నియమమఱ పాడవన్ద కవియన్ఱిక్కే పడైత్తాన్
పడగల పామువలె ఇంద్రియచేష్టలు హద్దులేక పాడవచ్చిన కవికాక సృజించినవాని
శ్లోకక్కృత్తాయ్ కుழైముట్టు పరివిడర్ తుయర్ తున్బమల్లల్ తుక్కమ్ తళర్వు కేడుకళ్ ఇన్ఱి
పొగడువారై కొఱతగాని ప్రీతికిఅడ్డు సంగము ఇతరకష్టములు దుఃఖము తల్లడపాటు చెరుపులు లేక
అమృతానన్దమగ్నరానవర్ శెయ్యతామరైక్కణ్ణన్ అమరర్ కులముతల్ ఎన్ఱు అఞ్జాతపడి
మిక్కిలిఆనన్దమగ్నులగువారు పుండరీకాక్షుడు నిత్యులకు కారణుడు అని భయపడనట్లు
ఎళివరుమ్ ఇణైవనామ్ ఎన్దవై పరత్వమామ్పడి అవనాకుమ్ సౌలభ్యకాష్ఠైయై క్కాట్టి
సులభుడై తోడగును అనినవి పరత్వమగునట్లు అర్చావతార సౌలభ్యసీమను తెలిపి
వழி వైత్తరుమవన్ నిఱ్కఇழியక్కరుతువతు ఎన్నావతు వేణ్డిత్తెల్లామ్తరుమ్

అర్చిరాదిగతినిచ్చువాడుండ నీచతను తలచుట ఏమగును కోరినవెల్లనిచ్చును
**తన్నాకవేకొళ్లుమ్ కవిశొల్లవమ్మిన్ ఎన్లు ముక్త్యైశ్వర్యత్తై మున్నిట్టు శ్వవృత్తియై**
తనతో సామ్యమిచ్చును స్తుతింపరండు అని ముక్త్యైశ్వర్యమును ముందుంచి నీచసేవను
**మాత్తి స్వవృత్తియిలే మూట్టుకిఱార్ మూన్దామ్పత్తిల్.**
మాన్పి భగవత్సేవలో ముంచుచున్నారు మూడవపత్తున.

వ్యా - సకల వస్తువులను శరీరముగాగల్గి నిర్వాహకుడై సర్వవ్యాపకుడై తెలియరానట్లుండి వానియం దలి దోషములంటనట్టి సర్వేశ్వరుడు, ప్రాప్యప్రాపకములు రెండును సర్వేశ్వరుడేయను నిశ్చయము గల ఆశ్రితులను జన్మపరంపరలో పడనీయక రక్షించి స్వస్వరూపావిర్భావము గల్గించి తన పాదముల క్రింద జేర్చుకొను ఉపకారకుడు, శరీరావసానమున అర్చిరాదిమార్గమున గొనిపోవునట్టి ఉదారుడు, సృష్టికాలమున తనను జేరుటకు తగిన శరీరమీయగా నట్లుగాక, దానికి పరవశుడనై అన ర్థపడి త్రిగుణాత్మకమగు ప్రకృతిచే దేవమనుష్యాది శరీరముల బద్ధుడనై జన్మపరం పరలోబడి సమ ర్థుడనుగాక చెడుమార్గమున దట్టమగు పొదలోచిక్కివానిని పొందజాలని నన్ను అనాదియు అనంత మును అతిప్రబలమునగు పాపములను సమూలముగ ఛేదించి, భగవద్గుణానుభవముతో ప్రొద్దుపు చ్చుకొనునట్లొనర్చవాని -దివ్యమంగళవిగ్రహమును తిరు ఆభరణములను అనుభవింపమొదలిడి తృప్తిగలుగకపోవుటకు ఇంద్రియ లోపముగా దలచి కష్టపడెడి వీరికి విషయవైలక్షణ్యమును దెల్పి యాకష్టమునుపోగొట్ట సత్తనుబొంది అందులకు ప్రయోజనముగ దేశకాలాది నిర్బంధములేక సర్వ దేశ సర్వకాల సర్వావస్థలందును సర్వవిధకైంకర్యముల నపేక్షింప నాతడందులకు, తగినట్లు సర్వా త్మభావమును జూప, పృధివ్యాదిభూతములును వాటినుండి గల్గిన పదార్థములును ప్రకాశించునట్టి మాణిక్యాదులును రసవత్పదార్థములును గానాది శబ్దరాసులును మోక్షాది పురుషార్థములును ప్రధా నులగు బ్రహ్మరుద్రాదులును కారణభూతమగు ప్రకృతిపురుషులును ఇవన్నియు సంపదగ కలవాడై అన్నిటియందును అంతరాత్మగానుండియు వాని దోషములంటక యున్నవాని ననుభవించి సంతస ముప్పొంగి, వాచిక కాయిక మానసిక వ్యాపారములచే పండిన ప్రీతి తలకెక్కగా నట్టి ప్రీతి సర్వేశ్వ రుని వరకే గాక వాని దాసులకును దాసులుకావలెనని వృద్ధిబొందగా, అన్ని యింద్రియవ్యా పారములను అన్ని యింద్రియములును చేయవలెననెడి యాతురతగలవారై సమస్తదుఃఖములు పోయినవారై ముక్తులు భగవద్గుణానుభవముచే నానందించునట్లు కాగా, పుండరీకాక్షత్వాది పరత్వచి హ్నములు గలవానిని జ్ఞానసంకోచములేని నిత్యులు స్తుతింపవలెనేగాని నిత్యసంసారులమగు మన మట్టివాని నాశ్రయింపదగుదుమా? యని భయపడనక్కఱలేక అవతారసమయమున సౌలభ్యమున్ను పరత్వముగా దలపదగినట్లు అర్చావతారమున అతిసులభుడైన విధమును లోకులకుదెల్పి, అట్టివాని నిగాక క్షుద్రమనుష్యులను గూర్చి కవనము జెప్పుటవలన ప్రయోజనమేమని దెల్పి వాక్కుగలందు లకు వాని విషయముననే దానిని వినియోగించుడనియు అంతమాత్రముననే ఆతడు పరమసామ్యాప త్తినొసంగుననియు ముక్త్యైశ్వర్యరూప ఫలమును దెల్పి, తామొనర్చిన వాచిక కైంకర్యమున లోకు లను ప్రవేశపెట్టుట మూడవ శతకముయొక్క సారాంశము.

## తిరువాయ్‌మొళ్ళి నాల్గవ పత్తు సారసంగ్రహము

4. ఈశనై ఈశన్ ఈశన్‌పాల్ ఎన్న ఏర్‌కొళ్ వానత్తుమ్ ఆయే ఎన్గిఱ వ్యాప్తినిఱమ్‌పెఱ
ఈశనై ఈశన్ ఈశన్‌పాల్ అనుచోట్ల ఏర్‌కొళ్ వానత్తుమ్ ఆయే అనుచోట్ల వ్యాప్తి ప్రకాశింప
త్తనిక్కోల్ శెలుత్తుమ్ సర్వనియన్తా ఒళ్ళి విల్ కాలత్తుక్కు చ్చేర పూర్వభోగఙ్గళై
దివ్యాజ్ఞ నడిపించు సర్వనియన్త ఒళ్ళి విల్ కాలమునకుతగినట్లు వెనుకటిభోగముల
ఓతుమాల్ ఎయ్‌తిన చాపలత్తుక్కుచ్చేర సమకాలమాక్కి పోతాల్ వణఙ్గామై తీర్త్త
తోచినట్లు చెప్పెడి ప్రీతికి తగినట్లు ఏకకాలమొనర్చి కాలమున దండమిడమిని తీర్చిన
ప్రణయిత్వత్తిలే కాతల్‌మైయలేఱియ పిత్తాయ్ దేశదూరత్తుక్కు క్కూవియుమ్‌కొళ్ళాయ్
అభిమానమున ప్రీత్యతిశయముచే భ్రమించు దేశదూరమునకు పిలుచు కొనుము
ఎన్ఱతు తీర క్కణ్ణ శతిరైయుమ్ ఒరునిలమాకక్కాట్ట వీవిలిన్బమ్ కూట్టినైయెన్ఱు
అనుట తీరునట్లు చూపిన చతురతను ఏకభోగముగజూప నిరవధికానందము కూర్చితివని
ముక్తభోగ మానస ప్రాప్తి ఫలమాన దేవతాన్తర ఆత్మాత్మీయ లోకయాత్ర
ముక్తులభోగము మనసున పొందిన ఫలముగ ఇతరదేవతలు ఆత్మాత్మీయములు లోకయాత్ర
ఐశ్వర్య అక్షరఙ్గళిల్ వైరాగ్యమ్, ఉన్నిత్తు ఉయిర్ ఉడమ్బినాల్ కొడువులకమ్
ఐశ్వర్యము కైవల్యముల వైరాగ్యము నిన్నుతప్ప ప్రాణము, శరీరములచేత క్రూరలోకముల
వేట్కైయెల్లామ్ ఒళ్ళిన్దేన్ ఎన్న ఉడైయరానవర్ ఒరునాయకమెన్ఱు రాజ్య స్వర్గ
కోర్కెయంతయు వీడితిని అన్న విరక్తికలవారు ఒరునాయకమని రాజ్య స్వర్గ
ఆత్మానుభవ అల్పఅస్థిరత్వ సావధికత్వాదికళైయుమ్ ఆడుమ్ కళ్ ఇఱైచ్చి కఱుమ్
కైవల్యముల అల్ప అస్థిరత్వ హద్దులను మేకను కల్లు మాంసము నల్లని
శెమ్ శోఱ్‌ఆకిఱ నిన్ద్యఙ్గళాలే ఇళమ్ తెయ్‌వత్తుక్కు ఇట్టైత్తాడుమ్ నిహీనతైయైయుమ్
ఎఱ్ఱని అన్నమనెడి నింద్యములచే క్షుద్ర దేవతకు బలినిచ్చిగెంతెడి నీచత్వమును
పేశనిన్ఱ దేవతా అజ్ఞానఅశక్తి సాపేక్షత్వాదికళైయుమ్, ఇలిఙ్గత్తు విళమ్బుమ్
చెప్పుచున్న నీచదేవతల అజ్ఞాన అశక్తి సాపేక్షత్వాదులను లింగమును స్తుతించెడి
బాహ్యకుదృష్టిమత తమోనిష్ఠతైయైయుమ్ శొల్లి ఓడి క్కణ్డీర్ కణ్డుమ్ తెళియకిల్లీర్
బాహ్యకుదృష్టిమత తమోనిష్ఠతను చెప్పి పరుగిడి చూచితిరి చూచియు తెలియకున్నారు
అఱిన్దోడుమిన్ ఆట్చెయ్‌వతే ఉఱువతావతు ఎన్ఱు విరక్తిపూర్వకమాక ఆశ్రయణత్తై
తెలిసితిరుగుడు సేవచేయుటయే స్వరూపము అని విరక్తితోగూడి ఆశ్రయించుటను
రుచిప్పిక్కిఱార్ నాలామ్పత్తిల్
రుచిపుట్టించుచున్నారు నాల్గవపత్తున.

వ్యా - వెనుక జెప్పిన వ్యాప్తి, ఆకాశవ్యాప్తివంటిదిగాక, మిక్కిలి ప్రకాశముగలదై అన్తః ప్రవిష్టశ్శాస్తా

జనానాం (సర్వేశ్వరుడు అంతరాత్మగా వ్యాపించియుండి జనులను నియమించు చున్నాడు) అనియు, య ఆత్మానమంతరోయమయతి, (ఎవడు ఈ ఆత్మలోనుండి దానిని నియమించుచున్నాడో) అనియు, శాస్తా విష్ణురశేషస్యజగతః (వ్యాపకుడగు నారాయణుడు జగత్తునంతను నియమించువాడు) అనియు, శాస్తాచరాచరస్యైకః (చరాచరములనన్నిటిని నియమించువాడు) అనియు చెప్పబడునట్లు తానుతప్ప తక్కిన వస్తువులన్నిటియొక్క ప్రవృత్తి నివృత్తులన్నియు తన యధీనములో నుండునట్లు నియమించుకొనుటచే సర్వనియంతయగు సర్వేశ్వరుడు ఒళ్గివిల్కాలమెల్లాం అను తిరువాయ్మొళ్గియందు తెలిపిన కైంకర్యప్రీతివలెనే కాలాంతర దేశాంతరములనున్న సర్వేశ్వరుని అతిమానుషచేష్టలను ఆయాదేశకాలములయందున్నట్లుగ చూచి యనుభవింపవలెనని అధిక చాపల్యముగల వీరిచే కాలోపాధిని పోగొట్టి యనుభవింపజేసి వీరిదుఃఖమును బోగొట్టి వీరి త్రికరణ వ్యాపారములనున్ను భోగ్యముగా స్వీకరింప, నట్టి స్నేహమున మగ్నులై వాని యెడబాపునందును వానితో సమానమగు పదార్థములను వానితో సంబంధించిన పదార్థములను జూచినప్పుడు వాడే యనుకొని భ్రమించి, పరమపదమునందలి భగవదనుభవమునకై యాశించి, ప్రార్థింపగా, నా కష్టము తొలగిపోవునట్లు పరమపదమున పెరియపిరాట్టియు తానును వేంచేసియుండుస్థితిని ప్రత్యక్షముగా ననుభవింపజేయ మానసికముగాననుభవించి, దాని ఫలితముగ దేవతాంతరముల యెడల వైరాగ్యము గల వీరు ఐశ్వర్యకైవల్యములు అల్ప అస్థిరములగుటను, దుష్టవస్తువులగొని క్షుద్రదేవతల నారాధించుట హీనమగుటను, బ్రహ్మరుద్రాదులయొక్క అజ్ఞాన అశక్తులను, వేదబాహ్యులయు కుదృష్టులయు మతములు తమోగుణ మూలములగుటను, బయల్పఱచి, సృష్టిస్థితి సంహారకారణుడగు సర్వేశ్వరుడే రక్షకుడనియు నితరులెల్లరును రక్షింపబడువారనియు శాస్త్రములద్వారా తెలిసికొనియు లోకులు ఉజ్జీవించకపోవుటకు కారణము, భగవానుడేర్పఱచిన ప్రకృతితోగల సంబంధమనియు, వాని కైంకర్యమే పొందదగిన నిరతిశయపురుషార్థమనియు, దేవతాంతర ప్రయోజనాంతరముల యెడల వైరాగ్యమే పరమప్రయోజనమనియు, నుపదేశించి భగవానుని ఆశ్రయించుటయందు రుచిని పుట్టించుట నాల్గవశతకముయొక్క సారము.

## తిరువాయ్మొళ్గి ఐదవ పత్తు సారసంగ్రహము

**5. ఆవా ఎన్ఱు తానే తన్నడియార్క్కు చ్చెయ్యుమ్ తొల్ అరుళ్ ఎన్ఱు పరత్వాదికళై**
అయ్యో అని తానే తన భక్తులకు చేయునట్టి స్వాభావికకృప అనిన పరత్వాదులు
**ఉడైయవన్ ఎవ్విడత్తాన్ ఎన్ఱుమ్‌పావియర్కుమ్ఇరుకరైయుమ్అళ్గిక్కుమ్ కృపాప్రవాహమ్**
కలవాడై అంతటనున్నాడనినట్లు పావులకున్ను రెండుగట్లు తెగగొట్టు కృపాప్రవాహము
**ఉడైయవన్ పొయ్ కూత్తు వఞ్జ క్కళవుమ్ తవిర ముత్తవుమ్ తానాయ్ ఉన్నైవిట్టు**
కలవాడు అసత్యము కపటము వంచన చౌర్యము పోవ మొత్తమును తానై నిన్నువిడువను
**ఎన్నప్పణ్ణిన విరక్తి ఫల పరమాత్మరాగమ్ పేరమర్ పిన్‌నిన్ఱు కళ్గియ మిక్కు**
అన్నట్లుజేసిన విరక్తి ఫలము భగవత్ప్రీతి హద్దులేనిదై బాధించుచు మితి మీరిన

**యానే యెన్నై వాయ్‌వన్దు అత్తకిల్లాతు నీరాయ్ మెలియ వూడుపుక్కు వళర**
నేనేఅని అనుకరించి సహింపలేక నీరై బాధపడ లోనజేరి పెరుగ
**విషవృక్షఫలఙ్గళ్ కైకూడినవర్ అడిమై పుక్కారైయుమ్ ఆట్చెయ్వారైయుమ్ కాణ లోక**
విషవృక్ష ఫలములు చేజిక్కినవారు దాస్యమునచేరిన వారిని కైంకర్యపరులను చూడ వైకుంఠ
**ద్వీపాన్తరఙ్గళిల్‌నిన్ఱుమ్ పోన్ద తేవర్‌కుళ్ఙాఙ్గళై కణ్డు కాప్పిట్టు ప్రహ్లాద విభీషణర్ శొల్**
క్షీరాబ్ధులనుంచి వచ్చిన నిత్యులగోష్ఠిని సేవించి రక్షనిడి ప్రహ్లాద విభీషణుల మాటల
**కేళాత అరక్కర్ అశురర్‌పోల్‌వారై త్తడవి ప్పిడిత్తు దేశ కాల దోషమ్‌పోక ఎఙ్గుమిడమ్**
వినని హిరణ్యరావణులవంటివారిని వెదకి పట్టుకొని దేశ కాల దోషములుపోవ అంతటను
**కొణ్డవర్‌కళై మేవి త్తొఴుతు ఉజ్జీవియుఙ్గోళ్ నీఙ్గళ్ నిఱుత్తుకిఅవర్‌కళై దేవతైకళాక**
వ్యాపించినవానిని ఆశ్రయించిదండమిడి ఉజ్జీవించుడు, మీరు నమ్మినవారలను దేవతలుగ
**నిఱుత్తిన అవనైమేవి ప్పరమ్బుమవరోడొక్క త్తొఴిల్ యుగదోషమిల్లై యామ్ ఎన్ఱు**
చేసిన వానినాదరించి వారలతోసమముగ సేవించిన యుగదోషముండదు అని
**విష్ణుభక్తి పరరాక్కి కణ్ణుక్కినియన కాట్టలామ్బడియానార్ కణ్డిలే నోక్కిక్కాణుమ్**
విష్ణుభక్తి పరులజేసి కన్నులకింపుగ చూపదగినవారై కన్నులతో చూడదగినట్లు
**భక్తి సిద్ధాఞ్జనత్తై యిడుకిఱార్ అఞ్జామ్ పత్తిల్.**
భక్తి సిద్ధాంజనమును పెట్టుచున్నారు ఐదవ శతకమున.

వ్యా - అయ్యో యని యీచేతనుని దయతోచూచి, కోరకుండగనే తనపనిగా కృపజేసి, తనపై భారముంచినవారికి కలిదోషములేమియు నంటకుండజేయుననియు, శంఖచక్రముల ధరించిన దివ్య మంగళవిగ్రహసౌందర్యమును నిత్యసూరులకు దర్శింపజేయుచు పరమపదముననుండు సర్వేశ్వరు డెక్కడ! నిత్యసంసారులలో నిహీనుడనగు నేనెక్కడ? యని పరత్వ కారణత్వ నియంతృత్వాదుల మూలముగ వచ్చిన వాని యుత్కర్షతను తమ నికర్షతను తలచి వెనుదీసెడి యెంతమహాపాపులనై నను వారల కర్మానుగుణముగ నిర్వహింపదగిన తన నిరంకుశస్వాతంత్ర్యరూపమగు గట్టునున్ను, తన యనుగ్రహము ఈచేతనుల పట్ల రాకుండునట్లు అపరాధముల నొనర్చెడి వీరికిగల ఔపాధిక స్వాతంత్ర్యరూపమగు గట్టునున్ను ఈ రెంటిని పొర్లిపోవునట్లు కృపాప్రవాహముగల సర్వేశ్వరుడు అమృతమువంటివాడా యని కొన్నియసత్యముల చెప్పగా నవియు, నిన్నువంచించు కపట హృద యమును గలిగి అనగా ప్రాకృతవిషయముల ప్రీతికల్గియు అనన్యప్రయోజనులవలె తోచునట్లు సర్వ జ్ఞుడవగు, నిన్నును వంచించునట్టి కృత్రిమ మనస్సును పోగొట్టుమా యనగా నవి వీరి చెంతకు చేర నట్లు వీరికి సర్వవిధ భోగ్యవస్తువును తానేయై, నేనునిన్నువిడిచినను నన్నువిడువని వాడవగు నిన్ను విడుతునా? యని వీరేచెప్పునట్లుచేసిన, పరమాత్మయందలి ప్రీతి ప్రక్కవారును చెప్పునట్లు అవధిలేనంతగపెరిగి, వాని యొక్క జగత్కారణత్వాద్యద్భుతకార్యములను నేనే చేసినాననెడి

యనుకారము వలన క్షణకాలమైనను వానిని విడిచి యుండలేనివారై పరమాత్మవిషయమునగల భోగ్యతవలనగల్గిన ప్రీత్యతిశయముచే ఆత్మ మనస్సులే కాక వానికాశ్రయమగు శరీరముసైతము శిథిలమై మిక్కిలి బాధపెట్టునదియై భగవద్గుణములు లోన ప్రవేశించి విడువక ద్రవమైపోవునట్లు వృద్ధిపొందగా, సంసారవిషవృక్షముయొక్క అమృతఫలములగు భగవద్భక్తి భాగవత సమాగమ ములు రెండును చేజిక్కినవారగువీరు, దేవతాంతరములకు పరత్వములేమిని, భగవానుని పరత్వ మును వానినాశ్రయించువిధమును కైంకర్యమే పరమపురుషార్థమనియు, విశదముగ నుపదేశింప, విని దిద్దుబాటై కైంకర్యమగున్నలైన శ్రీవైష్ణవులను, కైంకర్యనిష్ఠగల తమనున్ను సేవించుటకై వైకుంఠ వాసులును ద్వీపాంతరవాసులునగు నిత్యముక్తులును వచ్చి సేవించితిమి సేవించితిమి అని అనేక పర్యాయములు|తెలిపి యీ సంపదకు పొలిక పొలిక వృద్ధికావలె నని మంగళాశాసనమొనర్చి, అంత టను భగవానుడున్నాడని ప్రహ్లాదుడుపదేశించగా వినియును దిద్దుబాటుకానట్టి రాక్షసుడగు హిరణ్యు ని వలెను, రాఘవునికి సీతనొసంగుమని విభీషణుడుపదేశింపగా దిద్దుబాటుకాని అసురుడగు రావ ణుని వలెను ఆళ్వారులుపదేశించినను దిద్దుబాటుకానట్టి అసుర రాక్షస స్వభావులగు వారి ని వెదకి పట్టుకొని శరీమును నశింపజేసి ప్రాణములబోగొట్టు నట్టి వ్యాధియు శత్రుత్వములు ఆకలి మొదలగు దేశదోషములు, పదార్థస్వభావములు మారిపోవునట్లు చేయునట్టి కలియుగసంబంధమగు కాలదోష మును పోగొట్టగల సర్వవ్యాపకుడుండగ వానిని అనన్యప్రయోజనులై ఆశ్రయించి యుజ్జీవించుడని యు, మీరుపాసించు దేవతలనున్ను, రాజైనవాడు రాజ్యమునందెల్ల ఉద్యోగస్థులనేర్పఱచినట్లు మీకు ఆశ్రయణీయులనుగా సర్వేశ్వరుడేర్పఱచెననియు, బ్రహ్మరుద్రేంద్రాదులున్ను వానినాశ్రయించియే, ప్రఖ్యాతులైరనియు, అట్లేమీరును, వానినాశ్రయించిన కలిదోషము మీకంటదనియు, నుపదేశించి దేవతలని చెప్పదగినట్లు విష్ణుభక్తులుగ జేసి, దిద్దుబాటుకానివారిని దిద్దుబాటు చేయుటమాత్రమేగా క ముందుగనే దిద్దుబాటై భాగవతగోష్ఠిని సేవించెడి చాపల్యముగల వారైన వారికిన్ని సిద్ధాంజనము వలె తెలియరాని యర్థములను ప్రకాశింపజేయునట్టిదై ప్రాప్య వైలక్షణ్యమును సాక్షాత్కరింపచేయు నట్టి భక్తిని ఉపదేశపూర్వముగ గల్గించుట ఐదవ శతక సారము.

## తిరువాయ్మొళి ఆరవ పత్తు సారసంగ్రహము

**6. ఎన్నైయుం యావర్క్కుం శురర్క్కాయ్ అడియార్ వాళ్ మిన్ ఎన్ఱు కరుణైయాలే**
నన్నును ఎవరికిని సురలకై భక్తులారా సుఖించుడు అనెడి కృపచేత
**సర్వలోకభూతేభ్యః ఎన్ఱవై కడలోశైయుమ్ కళుత్తుక్కు మేలుమ్ ఆకామల్**
సకలలోక భూతములకొరకు అనెడివి సముద్రఘోషము నాల్క చివరివి కానట్లు
**ఉపాయత్వమ్ కల్వెట్టాక్కుకిఱ శరణ్యన్ అజ్ఞాన అశక్తి యాథాత్మ్యజ్ఞానఙ్గళ్**
ఉపాయత్వము శిలాశాసనమొనర్చు రక్షకుడు అజ్ఞాన అశక్తి పారతంత్ర్య జ్ఞానముల
**అళవాల్ అన్ఱిక్కే అఙ్ఙుత్తేన్ ఏన్నాన్ పుణరాయ్ ఎన ఞ్ముడి మెయ్యుమర్**
హద్దుమాత్రమేగాక నిత్యులుకాను నేనేమిచేతును తలచుము అన్నట్లు సంశ్లేషకోరు

**భక్తి భూమా ఫలమాకవుమ్ అనన్యగతిత్వముడైయ తమక్కు ప్పాదమే శరణాక్క అవైయే**
భక్తి అధిక ఫలముగ అనన్యగతిత్వముగల తమకు పాదమే రక్షజేయ అవియే
**శేమమ్‌కొణ్డు ఏకశిన్తైయరాయ్ తిర్యక్కుకళై యిట్టుస్వాభిప్రాయత్తైనివేదిత్తు విళంబరోషమ్**
రక్షగగొని నిశ్చలచిత్తులై పక్షులద్వారా తమకోర్కెను తెల్పి విళంబరోషము
**ఉపాయత్తాలే అఖ్గాయ, ఉరుకామల్ వరిత్తతుమ్ సణ్డి పణంగ ఫలిత్తవాఱే సప్రకారమాక**
ఉపాయమై పోగొట్ట కరుగక వరించుటయు చేరి దండమిడి ఫలించగనే క్రమముగ
**సకృత్ కరణాయ మెన్ఱ పురాణ పౌరాణికర్ త్యాజ్యాంశమాక్కిన చిత్ అచిత్ ప్రాప్య**
ఒక్కమారే చేయదగినదని పురాణ పౌరాణికులు వీడదగినదిగా తెల్పిన చిత్ అచిత్ ప్రాప్య
**ప్రాపక ఆభాసఙ్గళై కైవలిన్ఱు కైక్కళ్ల క్కణ్డుమ్ ఎల్లామ్ కిడక్క నినైయాదు**
ప్రాపక అభాసలను విడిచి గాజులుజారుటచూచియు అన్నియునుండ లక్ష్యపెట్టక
**అకన్ఱుమ్ ఆళీర్ మేవీర్ ఊతీర్ ఎన్ఱు తదీయశేషమాక్కియుమ్ పుఱత్తిట్టు కాట్టి ఎన్ఱు**
ఎడబాసియు ఏలుడు తినుడు త్రాగుడు అని భాగవతశేషమొనర్చియు విషయములజూపి అని
**ప్రసఙ్గిక్కిల్ ముడియుమ్బడి విట్టు తన్దై తాయ్ ఉణ్ణుమ్ శోఱు మానిధి**
ప్రసంగించిన నశించునట్లు విడిచి తండ్రి తల్లి తినెడి అన్నము గొప్పనిధి
**పూవైయుమ్ యావైయుమ్ ఒన్ఱైయాక్కి తళర్వేనో తిరివేనో కుఱుకాతో**
చిలుకలను మొదలగువానిని స్వామిగనేతలచి తల్లడిల్లుదునా తిరుగుదునా దగ్గరించదా
**ముతల్వా ఓ ఎన్ఱుమ్ ఆర్తియోడే తిరువిక్కిరమనాయ్ క్కుఱళ్ కోల ప్పిరానాయ్**
కారణుడా ఓ అనిన్నీ ఆర్తితో త్రివిక్రముడై పొట్టి సుందర ఉపకారుడై
**అడియై మూన్ఱై యిరన్ద వన్‌కళ్వన్ కణ్‌ముకప్పే అకల్‌కొళ్ తిశై వైయమ్**
అడుగులు మూటిని యాచించిన గొప్పవంచకుని ముందే విశాల దిక్కుల భూమిని
**విణ్ణుమ్ తడ వన్ద తడమ్ తామరైకళై ఇణైత్తామరైకళ్ కాణ ఇమైయోరుమ్**
మిన్నును కొలువవచ్చిన విశాలపు తామరలవంటి రెండు పాదములచూడ నిత్యులును
**వరుమ్బడి శెన్ఱు శేర్న్ద ఉలకత్తిలకత్తే కణ్డు అకలకిల్లేనెన్ఱు పూర్వవాక్యమ్ అనుసన్ధిత్తవర్**
వచ్చునట్లు వచ్చి చేరిన తిరుమలలో సేవించి ఎడబాయలేనని పూర్వవాక్యము తలచినవారు
**పిణక్కఱ త్తుడఙ్గి వేతప్పునితవిఱుతి శొన్న సాధ్యోపాయశ్రవణ సశోక**
పిణక్కఱ మొదలిడి వేదప్పునితవిఱుతిన చెప్పిన సాధ్యోపాయశ్రవణముచే సశోక
**సజాతీయర్క్కు త్తన్దనన్ మత్తోర్‌కళై కణ్డిలమ్ పురున్దేన్ ఎన్ఱు స్వసిద్ధోపాయ నిష్ఠైయై**
సజాతీయులకు ఇచ్చెను వేరు రక్షకుల చూడము చేరితిని అని తమసిద్ధోపాయ నిష్ఠను
**ఉక్తి అనుష్ఠానఙ్గళాలే కాట్టుకిఱార్ ఆఱామ్ పత్తిల్.**
**చెప్పుట ఆచరణలచే** చూపుచున్నారు ఆరవ పత్తులో.

వ్యా - ఆర్త రక్షణ దీక్ష వహించియున్న సర్వేశ్వరుని రక్ష్యవర్గములో నేనున్ను ఒకతె నున్నానని తెల్పుదనియు, తిరువిణ్ణకరను దివ్యదేశమున వేంచేసి యున్నవాని శ్రీపాదములు తప్ప వేరేదియు నేయొక్కరికిని ఉజ్జీవనోపాయము కాజాలదనియు, ఆతడు దేవతలకును రక్షకుడనియు, శేషభూతు లెల్లరును ఆపాదముల క్రింద అనన్యప్రయోజనులై ప్రవేశించి ఉజ్జీవించుడని తాను కృపతో చూచు చుండుననియు, శరణాగతుడైన విభీషణులు సర్వలోకశరణ్యుడని చెప్పినమాట సముద్రఘోషవలె వ్యర్థముకాకుండ నీవేరక్షకుడవని నన్ను శరణుచొచ్చినవారిని రక్షించుటయే నాదీక్ష, యని చెప్పి నది నాల్క చివరిమాటకాకుండునట్లును, విష్వక్సేనులతో కూడ నమస్కరించి యుజ్జీవించుచున్నది శ్రీ వేంకటాద్రి యనియు, ఐశ్వర్య కైవల్య భగవత్ప్రాప్తికాములనెడి ముగ్గురి యొక్క పాపములను నాశమొనర్చునట్టి యనియు, నిత్యసూరులును నిత్యసంసారులును ప్రయోజనాంతరపరులును తిర్య క్కులును నాశ్రయింప ననుకూలముగా తిరుమలలో వేంచేసి యుండుటచే తన ఉపాయత్వము శిలాశాసనమొనర్చినట్లు తన యతిశయము నెంతమాత్రము యోజింపక సర్వలోక శరణ్యుడగు సర్వేశ్వరుడు.

ఉపాయాంతరములను పరిశీలించి తెలిసికొనుటకుగాని అనుష్ఠించుటకుగాని, కావలసిన జ్ఞాన శక్తులు లేక పోవుటచే గాని పరతంత్రమగు, స్వరూపమునకు భగవానునే ఉపాయముగా గొనుట తప్ప వేరు విధముకాదని, నిరతిశయ భోగ్యములగు నీ శ్రీ పాదములను జేరునట్లు నీవే యొక మార్గము నేర్పఱుపవలెనని విరోధుల బోగొట్టు సర్వేశ్వరుని శ్రీపాదమునే సహాయాంతర నిర పేక్షోపాయముగ గొనునట్టి అధ్యవసాయముగలవారై, జ్ఞానానుష్ఠానరూపమగు రెండురెక్కలుండు టచే ప్రాప్యమగు భగవానుని శీఘ్రముగ లభింపజేయదగిన ఘటకులద్వారా తమయవస్థను వానికి తెలియబఱచి, వాడు వచ్చుటకాలస్యమగుటచే గల్గిన ప్రణయరోషముచే వాడు వచ్చి పైబడిన ను, వెళ్ళిపొమ్ము, మాగోష్ఠిలో ప్రవేశింపవలదు అని ఉపేక్షించి, వానిని చూడకుండునట్లు ఇసుకలో బొమ్మరిండ్లు కట్టుచు అన్నమువండుచు పిల్లలవలె కార్యాంతరపరులైయుండుట, తనభోగవిరోధియ గుటచే సర్వేశ్వరుడు వారొనర్చిన యనాదరమును, తనకున్ను చరమోపాయమగు శ్రీపాదసౌందర్య ము ద్వారా సూచించునట్టి దివ్య మంగళవిగ్రహసౌందర్యమును జూపించి పోగొట్టగా వానితో నమరి యుండి, వాని గుణములు నా హృదయములో ప్రవేశించి నాయాత్మను మిక్కిలి బాధించుచున్నవని వాటిని సహించి స్థిరముగ ననుభవించుటకు దగిన సామర్థ్యమును గల్గించుమని ప్రార్థించి, వానినే ఉపాయముగా వరించుటచే ప్రీతిపూర్వకముగ అవతారచేష్టలను అనుభవింపగల్గిన నాకు సాటి యెవ్వరని గర్వించి, ఇతరోపాయముల విడిచి సిద్ధోపాయమగు సర్వేశ్వరుని వరించుట ఒక్కపర్యా యమే చేయవలసినదిగా యెఱిగి భవిష్యత్పురాణమున జెప్పబడినట్లు మాతా పితాదులు ధనధా న్యాదులు మొదలగు చేతనాచేతనములన్నిటిని లక్ష్యపెట్టక తమకు ఉపాదేయమగు పరమపదముతో గూడ పురుషకారభూతులకు కాన్కగ సమర్పించి, లోకులు అనుభవించక నిలువలేనట్టి శబ్దాదివిష యములను తలచినమాత్రముననే భయపడి వాటిని విడిచినవారై తాము విడిచిన విషయము వలన గలుగునట్టి రసమంతయు భగవద్విషయముగనే తలచి,

అందమగు లక్ష్మితోగూడ నిన్ను పొందక దాసుడ నింకనూ కష్టపడుదునా ? అనియు, అగ్నితోగూడిన మైనమువలె బాధపడుచు లోకమున సంచరింతునా ? అనియు, నీ శ్రీపాదములజే ర్చుకొనుటకై పిలువదగిన కాలమింకను రాలేదా ? అనియు, గుంపుగనున్న ఏడుమద్దులను కొట్టిన సాటిలేని ధనుర్ధరుడా అనియు, జగత్తున కాధారభూతుడవగు నిన్ను లభింపజేసిన మహానుభావా అనియు, మానసానుభవము మాత్రమేగాక నీ శ్రీపాదముల ప్రత్యక్షముగ జేరుట యెన్నడో అని కష్ట పడుచు,

వశిష్ఠ ఛండాల భేదములేక అందరి శిరములను పాదముంచిన త్రివిక్రమాపదానమునందు ఆశ్రయణోపయోగగుణములను దివ్యతిరుమేనును జూపి వశీకరించుకొనునట్టి వంచకుని,

లోకము కొలిచిన భవ్యపాదపద్మములను నిత్యసూరులును ఆశించివచ్చునట్లు లోకమునకు తిలకమువలె ముఖ్యాభరణముగనున్న తిరుమలయందు సేవించి, తమ యొక్క ఆకించన్య అనన్య గతిత్వములను అనుసంధించుకొనుచు ద్వయమునందలి పూర్వఖండలో చెప్పిన విధముగ దాని యర్థమును అనుసంధించు కొనుటచే పూర్ణ ప్రపత్తి యొనర్చినవారగు ఈ ఆళ్వారులు, సాధనభక్తి యొక్క దుశ్శకత్వ స్వరూపవిరోధిత్వములను తలచి దుఃఖపడి, తమతో సమముగ నుండదగిన అధి కారులకు తమ యొక్క అనుష్ఠానముచేత సిద్ధోపాయనిష్ఠను తెల్పుట ఆరవ శతక సారము.

## తిరువాయ్‌మొళ్ళి ఏడవ పత్తు సారసంగ్రహము

7. ఎణ్ణిలా కుణఙ్గళ్‌కొణ్డు పాలతున్బ వేఱవన్ మాయా పల్‌యోకుశెయ్‌తి
లెక్కలేని గుణములచే సుఖదుఃఖములచే విలక్షణుడు ఆశ్చర్యమగు పలు ఉపాయములజేసి
ఎన్నుమ్ ఆశ్చర్యశక్తియోగత్తాలే తెళివుత్తవర్‌క్కు ఏత్తరుమ్ వైకున్దత్తై యరుళుమ్
అన్నట్లు ఆశ్చర్యశక్తియోగముచే జ్ఞానులకు స్తుతింపరాని వైకుంఠమును ఇచ్చునట్టి
ప్రాపకత్వమ్ పుఱ్ఱా వెఱుమ్బు పకైవనుక్కుమ్ ఆక్కవల్ల సర్వశక్తి పాతమ్
ఉపాయత్వము గరిక చీమ విరోధులకును చేయగల సర్వేశ్వరుని పాదములు
అకలకిల్లాత తమ్మై అకత్తుమ్ అవత్తిన్ నడువే యిరుత్తక్కణ్డు నలివాన్
వీడజాలని ఆళ్వార్లను ఎడబాసి ఇంద్రియముల మధ్యన ఉంచుటజూచి బాధింతువా
శుమడుతన్దాయోఎన్ను సాధనఫలమాన ఆక్రోశత్తోడే పక్లి యిట్టు క్కఙ్గులుమ్ పకలుమ్
బరువుమోయింతువా అని సాధనఫలమగు మొరతో నెవమిడి రాత్రింబగల్లు
అడైవత్త ఆర్తియై క్కోయిల్ త్తిరువాశలిలే ముఱైకెట్ట కేళ్వియాక్కి తేత్తవొణ్ణాతపడి
అంతులేని దుఃఖమును శ్రీరంగపు వాకిట క్రమముతప్పి మొరబెట్టి తేర్చరానియట్లు
తోత్తు ఒన్నినిఱ్కప్పణ్ణిన బలాధానమ్ మత్తుమ్ కళ్ళార్ ఇఱ్ఱువిలే శువఱి పఱైయ
ఓడి కలిసియుండ చేసిన ధైర్యము ఇతరుల స్తుతించు దుఃఖమున మునిగి వెనుకటి

తనిమై కూప్పీడు తలైయెడుత్తు శ్శూళువుమ్ పకై ముకమ్ శెయ్యు ఎడుప్పుమ్
అసహాయతచే మొరబెట్టుట తలయెత్తి తిరిగి విరోధము జ్ఞప్తికిరాగా పెరుగుట
శాయ్ప్పుమాన క్లేశమ్ నడక్క ఉపాయాధికార దోషమొళ్ళియ మాయజ్గళ్
తగ్గుటలుగా దుఃఖమురాగా ఉపాయ, అధికార దోషములులేకున్నను సంసారమున
శెయ్తువైత్త వైశిత్తిరియైక్కేట్క ఐచ్చమాక ఇరుత్తి ఉఱక్కొణ్డ స్వపర ప్రయోజనత్తై
పడవేసిన విచిత్రమునడుగ ఇచ్చచేఉంచి కృతినిగొన తనభక్తుల ప్రయోజనమును
అరుళిచ్చెయ్య ఎన్శొల్లి ఎన్నాళ్ పార్విణ్ణోర్ ఇఱప్పెతిర్ ఎతువుమ్
చెప్పగా ఏమనిచెప్పి ఎంతకాలము భువి,దివి,వాసులు భూతభవిష్యత్తుల ఏదియు
ఎన్గిఱ ఉపకారస్మృతియోడే తన్ శరితై కేళ్వియాకామల్ ఇన్బమ్
(చేయగలదిలేదు) అనెడి ఉపకారతలంపుతో తన చరితను వినిపించినట్లుకాక ఆనందము
పయక్క ఇరున్ద నిలత్తేవర్ కుళువిలే పాట్టు క్కేట్ప్పిప్పతాక గానగోష్ఠియైయుమ్
పొంగ ఉన్న బ్రాహ్మణగోష్ఠియందు గానము వినిపించుటకై నిత్యులగోష్ఠినిన్ని
తేవపిరాన్ అఱియమఱన్దవర్ చరమోపాయపరరానార్క్కు నీణకరమతు తుణిత్తాన్
అంతర్యామి యెరుగ మఱచిరి సిద్ధసాధన నిష్ఠులకు తిరువాఱన్విళై బాణుని
శరణన్ని మత్తొన్నిలమ్ త్తుళ్ళిత్తొళుమిన్ ఎన్ను ప్రాప్య సాధనావధియై
చేతులునరికినవాడు ఉపాయముగాక వేరులేనివారము తుళ్ళి దండమిడుడని ఫలసాధనవుహద్దును
ప్రీతియాలే ప్రకాశిప్పిక్కిఱార్ ఏళ్ళామ్పత్తిల్.
ప్రీతిచేత తెలియబఱచిరి ఏడవ పత్తున

వ్యా - లెక్కలేనన్ని ఆశ్చర్యగుణములు గలవాడా అనియు, సత్వరజస్తమోగుణములచే స్వీకరింపబడిన శరీరముగల విలక్షణులగు బ్రహ్మవిష్ణు మహేశ్వరులనెడి ముగ్గురి స్వరూపమై జగత్తును సృజించి రక్షించి సంహరించువాడై, లేక సత్వాదిగుణములకు తగిన రూపముల గొని సృష్ట్యాదుల నొనర్చు వాడనియు, స్థానమును గుర్తెఱిగి సుఖదుఃఖములను సృజించువాడాయనియు, ప్రతికల్పమునను వేర్వేఱు నామ రూప చేష్టితములు గలవాడవై జగత్తును రక్షించువాడా యనియు, జగద్రక్షణార్థము అనేక ఉపాయములు జేసితివనియు, నిట్లనేక విధముల జెప్పిన ఉపాయకృత్యమునకు గావలసిన అద్భుతశక్తియోగమువలన,

శ్రియఃపతియే ఉపాయోపేయములనెడి జ్ఞానముగల్గి అజ్ఞానమేమియులేనివారై స్థిరముగనున్నవారికి ఆనందరూపమగు మోక్షము నిచ్చువాడనియు, దుర్లభమైన వైకుంఠము నొసంగుననియు, చెప్పినట్లు ప్రాప్యప్రాపకములు రెండును తానేయని నిశ్చయించుకొని తిరిగి లోకులు చేయునట్టి కార్యములజూచికాని వారి తగనిమాటలగొనిగాని వెనుదీయక నిలువబడి వారికి నిరతిశయానందయుక్తమును ఎవ్వరికిన్ని స్వయత్నసాధ్యముగానట్టి శ్రీవైకుంఠమును తన కృపచే నొసంగునట్టి యుపాయత్వమును, గరిక మొదలు చీమల వరకును సకలప్రాణులకు అనగా స్థావరజంగమములన్ని

టినికిని యెట్టి సాధనానుష్ఠానమున్ను లేకనే మోక్షమిచ్చెననియు, లోకము ననుగ్రహముతో ఉజ్జీవింప జేసిన అనియు, అనాదిగ ద్వేషించిన శిశుపాలుడు స్వామియగు శ్రీకృష్ణుని శ్రీపాదముల బొందెనని యు, సాదించినట్లు చేతనాచేతనములనియు శత్రువనియు జూడక మోక్షమీయగల సర్వశక్తియగు సర్వేశ్వరుడు.

క్షణకాలమున్ను తన శ్రీపాదసేవను విడనాడియుండజాలక శరణొనర్చిన ఆళ్వార్లను తన శ్రీపాదములను బొందకుండునట్లు వేరుజేయునట్టి ఇంద్రియముల మధ్యను ఈ శరీరమున నుంచు టను జూచి,

ఇంకనూ బాధింప దలచుచున్నావా ? యనియు, ప్రీతిచే కరిగి యుండదగియుండగా దాని నీయక శరీరమనెడి భారమునిచ్చితివనియు, నిత్యసూరులకు నాయకుడా యనియు, మునుపు సంద్రమును చిలికి అమృతమును గొనిన స్వామీ యనియు, ఆలస్యములేక ఫలమునిచ్చునట్టి, సిద్ధో పాయమగు సర్వేశ్వరుని ఉపాయముగ స్వీకరించినచో నది ఫలించువరకును మొరబెట్టుచుండు టయే చేయవలసినదగుటచేత, సర్వేశ్వరునికి నిత్యవాసమగు పరమపదమునగూడ నాతడు నిలువ లేక తమవద్దకు రాదగినయట్లు సంసారమునందలి శ్రమవలన మిక్కిలి యాతురతతో ఆళ్వార్లు మొరబెట్టుచు తమ వలన గల్గినవానినిన్నీ వానిపై పెట్టునట్టి ప్రాప్తి గలవారగుటచే ఇంద్రియముల ద్వారా నన్ను బాధించుచున్నావే యని వానిపై నెపమిడి, మొఱబెట్టుటకున్ను శక్తిలేక మిక్కిలి దుఃఖితులై పిరాట్టి (నాయిక) దశనుబొంది రేయింబవళ్ళు నిద్రయన్నమాటలేదనియు, ఉంచిన కాలుచేతులు ఉంచినట్లుగనే పడియుండుననియు, అంతటను జూచి ధ్యానించును మోహించును అనియు, రాత్రి పగలనెడి మాటలేక యేడ్చుచు దండమిడుచు మూర్ఛిల్లుచు, ప్రలపించుచు, నిట్టూ ర్చుచు నదియును జేయలేక కదలక పడియుండియు నిట్టార్తి వృద్ధిబొందుటచే ఆశ చిన్త స్మృతి కీర్తి విలాపము ఉన్మాదము విభ్రమము మోహము వ్యాధి మృతి అనెడి పదియు కామముయొక్క వికారములు అన్నట్లు ఈమె అంతులేని దుఃఖాతిశయమును జూచిన తల్లి యీమెను గొనిపోయి శ్రీరంగపువాకిట పరుండ బెట్టి స్వామికి యీమె దశను మొరబెట్టుచు తెలియబఱచి ఓరంగనాధా యీమె విషయమున నేమిచేయదలచితివని పలువిధముల నడుగవలసినట్లు దుఃఖించుచు,

ఓతల్లులారా ! నాకు ధైర్యము చెప్పవలదనియు, శ్రీకృష్ణునికై నా స్త్రీత్వమును లజ్జాభయా దులను బోగొట్టుకొంటిననియు ఇరుగుపొరుగువారును ధైర్యము చెప్పరానియట్లు మనసుచే నాకర్షిం పబడినవారై పారతంత్ర్యమున్ను వదలుకొనగా,

ఇట్లు విరహవేదనచే తొట్రుపడెడి వీరికి ధైర్యము వచ్చుటకై సర్వేశ్వరుడు తనయొక్క విజ యపరంపరలను జూపగా సంతసించినవారై గోవర్ధనము నెత్తిన శ్రీకృష్ణుని భక్తులతో నేకీభవించిన నమ్మాళ్వార్లు, వానినాశ్రయింపక అనర్థపడెడి లోకమునకు హితమొనర్పదలచి, ప్రియహితముల నెరుగగోరువారు శ్రీరాముని విషయమును దప్ప వేఱొకటి అభ్యసింతురా! యని వారి దుఃఖములను మనస్సునకు దెచ్చుకొని యందు మునిగి,

స్థావరజంగమ వస్తువులతో నిండిన ముల్లోకములను సృజించిన పద్మనాభా యని మొదలిడి

బద్ధముక్తులలో నొక్కండనుగాక ఒంటరినగు నన్ను చక్కగ పాలించునట్టిస్వామీ యని వాని జగత్కా రణత్వమును జెప్పుచు మరల వెనుకటి ఉణ్ణిలావి తిరువాయ్‌మొళ్ళి యందలి ఆక్రోశమే మరలహెచ్చగా,

సర్వేశ్వరుని అవయవశోభ ఆళ్వార్ల మనసంతయు నిండి స్థిరమైబాధింప దానిని తలచుకొ నిన ఆళ్వార్లు సద్యోవికసిత తామరలవలె వాని సర్వావయవములును బాధించుచున్నవనియు, నేత్ర ములు రెండుమృత్యువులా యనియు, ముఖసౌందర్యము నాప్రాణములపహరించుచున్నదనియు, విజయముల జూపించి ధైర్యముజెప్పినప్పుడు దుఃఖము తగ్గియు మరల ఇంద్రియముల వలన గల్గిన భయముచే దుఃఖముహెచ్చియు నిట్లు హెచ్చుతగ్గులుగ క్లేశము బాధింప,

సర్వశక్తుడవగు నీవు అవిద్యా కర్మ వాసనా రుచులను నిశ్శేషముగ బోగొట్టి అనన్యార్హశేష భూతునిగ నన్ను స్వీకరించిన పిమ్మటనూ జన్మమరణాది రూప సంసారమున బడవేయుటకు కార ణమేమని యడుగ,

సర్వేశ్వరుడు, మాకును మా దాసులకున్ను కాలక్షేపమునకై మీ ద్వారా తిరువాయ్‌మొళ్ళి దివ్యప్రబన్ధమును పాడించుటకై కర్మమూలమునగాక కేవలము మా యిచ్ఛ చేతనే స్వపర ప్రయో జనములకై మిమ్ములను యిచ్చటనే యుంచితిమిసుమా యనిదెల్ప,

వ్యాస పరాశర వాల్మీకి మొదలగు ఋషులును పొయ్‌కై పూదత్తపేయాళ్వారులనెడి ముద లియాళ్వార్లును ఉండియుండగా తమచే కవిత్వము జెప్పించుకొనుట యనెడి వాడొనర్చిన ఉపకార మును దలచి, ఏమిప్రత్యుపకారముజేసి ధరించియుందుననియు, ఎన్నిదినములు ధ్యానించి తృప్తి జెందెదననియు, భూలోక ఊర్ధ్వలోకములందున్నవారలయొక్క స్వభావము నంతను జేర్చి అనుసం ధించినను తృప్తినొందగలనా ? యనియు, భూత భవిష్యత్ కాలములందెల్లప్పుడు తలచినను తృప్తి గల్గునా? అనియు, ఆత్మసమర్పణమొనర్చుదమన్నను అదియును వానిదేగదా యనియు, కావున ఉభయవిభూతులలోను చేయదగినదేదియు లేదనుకొనునట్టి ఉపకారస్మృతిగలవారై.

సీతను విడిచి శ్రీరాముడు ఒంటరిగ నున్నప్పుడు కుశలవులు శ్రీరామాయణము వినిపించి నట్లుగాక ఆనందమయుడగు సర్వేశ్వరుడును ఆనందమును వృద్ధిపఱచెడి శ్రీదేవియును, చేరియు న్నట్టి గోష్ఠియందు లోకులెల్లరును ఆనందించునట్లు తిరువాఱన్‌విళైయనెడి దివ్యదేశమునందు ప్రత్యుపకారముగ తిరువాయ్‌మొళ్ళిని వినిపించి కైంకర్యమొనర్చు తలంపును పరమపదమునం దును ఆశలేకుండునట్లు ఆదివ్యదేశమున మనసులగ్నమై, పరమపదమున నిత్యసూరుల గోష్ఠి యందు సామగానమును వినునట్టి సర్వేశ్వరునికి తెలియునట్లు తిరువాఱన్‌విళై ప్రాప్యత్వమును దెల్పి అచ్చట వేంచేసియున్న ఉషానిరుద్ధఘటకుడగు సర్వేశ్వరుడే ఆదివ్యదేశమును లభింపజేయు ప్రాపకమనియు ఇందెట్టి యాక్షేపమున్ను లేదనియు, కావున నీ విషయమున రుచిగలవారిని తెలిసి కొనుడనియు, ప్రాప్యముయొక్క అవధి భాగవతపర్యంతమనియు, ప్రాపకము యొక్క అవధి అర్చా వతారమనియు, తమకు గల్గిన యీ సంతసమును బయల్పఱచుట ఏడవ శతక సారము.

## తిరువాయ్‌మొழி ఎనిమిదవ పత్తు సారసంగ్రహము

8. **తేవిమార్ పణియా నేర్పట్ట నల్లకోట్పాట్ ఎన్నుమ్పడి శక్తియాలే నిత్యమాక కల్పిత్త**
తేవిమార్ పణియా నేర్పట్ట నల్లకోట్పాట్ అనిచెప్పిన శక్తిచేత నిత్యముగ ఏర్పఱచిన
**పత్నీ పరిజనాదికళైయుడైయ సత్యకామన్ కొణ్ణ వాగ్వృత్తియైయుమ్ మఱప్పిక్కుమ్**
భార్యా పరిజనాదులుగల సత్యకాముడు గొనిన వాగ్వ్యాపారమును మరపించు
**కలక్కముమ్ శంకైయుమ్ అచ్చముమ్ తీర త్తలైచ్చిఱప్పతన్ద అతిల్ కృతజ్ఞతాఫల**
కలవరమును శంకను భయమును తీర తలైచ్చిరప్పతన్ద అందులో కృతజ్ఞతకుఫలము
**ప్రత్యుపకారమాక వేన్ద ర్తలైవన్ కన్యకాదానమ్పోలే ఆరత్తழுవి అఱవిలైశెయ్త ఆత్మ**
ప్రత్యుపకారముగ జనకుని కన్యాదానమువలె కౌగిలించి అనన్యార్హమొనర్చి ఆత్మను
**లాభత్తాలే అతీవ విళఙ్గి ప్పుకழ்న్దు జన్మపాశమ్‌విట్టు ఆద్వారమ్ ఆళుమాళార్ ఎన్ను**
లభించుటచే మిక్కిలి ప్రకాశించి స్తుతించి సంసారమునువీడి ద్వారమువరకు ఆళుమాళార్ అని
**పరిన్దు అనురూపనోడే అమర్న్దు పిరివిల్ కృపణ దశైయాక త్తువరుమ్**
భయపడి గుణముల తలచి ధైర్యపడి ఎడబాపున నిలువలేని విధముగ తల్లడిల్లిన
**సీతాగుణఙ్గళాలే ప్రీతివర్ధిత్తు తిత్తిక్క వుళ్ళేయుఱైన్దుకణ్డుకొణ్డిరున్దు అమానుష**
సీతతోసమముగ ప్రీతిపెరిగి భోగ్యముకాగా లోననుండిచూచుచు అప్రాకృత
**భోగమాక్కినవన్ మూన్దుపత్తుక్కు పిన్నైత్త అరువినై నోయ్ మఱువలిడామల్ శిఱియేన్**
భోగములిచ్చినవాడు మూడుపదులలో పిన్నైత్త అరువినైనోయ్ మఱువలిడామల్ శిఱియేన్
**ఎన్నతిన్ పెరుమైయై కాట్ట దేహాదికళిల్ పరమాయ్‌నిన్ఱునినైక్కిల్ లక్ష్మీతుల్యమాయ్**
అనుచోట్ల ఆధిక్యమును చూపగా దేహాదులకన్న వేరైయుండి తలచినచో లక్ష్మితోసమమై
**అవర్కే కుడికళాయ్ పరతన్త్రస్వరూపత్తై అనుసన్ధిత్తపర్ స్వసాధన సాధ్యస్థర్**
భాగవతులకే శేషభూతమైన పారతన్త్ర్యస్వరూపము తలచిన ఆళ్వార్లు స్వసాధన సాధ్యస్థులు
**ఇరుకరైయర్ ఆకామల్ మణ్ణవరుమ్ వానవరుమ్ నణ్ణుమ్మత్తైయే కుఱిక్కొణ్మిన్**
రెండుగట్లవారు కాకుండ భూలోకులు నిత్యులును చేరెడిదే స్థిరపరచుడు
**ఉళ్ళత్తెన్ను ప్రాప్యైకపరర్ ఆక్కుకిరార్ ఎట్టామ్ పత్తిల్.**
హృదిన అని ప్రాప్యపరులనుగ చేయుచున్నారు ఎనిమిదవ శతకమున.

వ్యా - తేవి మారావార్ తిరుమకళ్ పూమి ఏవ మత్తమరర్ ఆట్చెయ్‌వార్ (తివాయ్ 8-1-1)(నీకు పట్టమహిషులు శ్రీదేవియు భూదేవియును నీవు నియమింపగా కైంకర్యముజేయువారు వారితో సములగు నిత్యసూరులు అనియు పణియావమరర్ పణివుమ్ పణ్బుమ్ తామేయామ్ (తివాయ్ 8-3-6) ఇతరదేవతల నాశ్రయింపని నిత్యసూరుల ఆశ్రయణమునకును జ్ఞానాదిగుణములకును తామే విషయమైనవారై అనియు, (నేర్పట్టనిఱై మూవులకుక్కుమ్ నాయకన్ఱే(తివాయ్ 8-9-1) పూర్ణ

ములగు ముల్లోకములకు నాయకుడు అనియు, (నల్లకోట్పాట్టులకజ్గళ్ మూన్డినుళ్ళుమ్ తాన్ నిఱైన్ద) (తివాయ్. 8-10-10) మంచివ్యవస్థగల ముల్లోకములలోను తాను వ్యాపించి నిండియున్నవాడు అనియు, సాదించినట్లు లక్ష్మిమొదలగు దివ్యమహిషులకు వల్లభుడై నిత్యసూరులు నియమింప వారి కైంకర్యమునకును జ్ఞానమునకును తానే విషయమై తన నియమమునకు లోబడిన ముల్లోకములకును నిర్వాహకుడై, తన శక్తి చేతనే నిత్యముగ కల్పింపబడిన పత్నీ పరిజన స్థాన భోగ్య భోగోపకరణములు గల్గియున్న సత్యకాముడగు సర్వేశ్వరుడు,

ఉమ్మైక్కొణ్ణు కవిపాడువిత్తుక్కొళ్ళవైత్తోమ్ (తివాయ్ ) మీద్వారా కవిత్వము జెప్పించుకొనుటకై యిచటనే యుంచితిమి, అన్నట్లు తాను వీరిద్వారా చేయించెడి వాచికకైంకర్యమును మరచునట్లొనర్చిన, తనను కంటితోజూచి యనుభవింపనందున గలిగిన కలవరమును, తన ఆశ్రితపారతంత్ర్య గుణవిషయమునను, సర్వప్రకారమగు స్వరూపవిషయమున గలిగిన యనుమానమును, సంసారుల దోషములను జ్ఞాపకమునకు దెచ్చుకొనుటచే గల్గిన భయమును, పోవునట్లు,

పరాశరాది మహర్షులును పొయ్కై పూదత్త పేయాళ్వార్లనెడి ముదలియాళ్వార్లును ఉండియుండగా తమద్వారానే వాచికకైంకర్యమును స్వీకరించిన వెనుకటి ఉపకారమును జ్ఞాపకముజేయగా, తమకుగల కృతజ్ఞతకు తగినట్లు ప్రత్యుపకారమొనర్చుటయే గాన, నాప్రత్యుపకారమునకై,

ఇంతకుముందు ఆత్మను సమర్పింపదలచి యదియును వానిదే యని జ్ఞప్తిగలిగి ఆ పనిని వదలుకొనినదియు, తెలియకుండునట్లు ఉపకారస్మృతివలన గల్గిన సంతసముచే భ్రమించిపోయి, క్షత్రియాగ్రేసరుడై జ్ఞానాధికుడగు జనక చక్రవర్తి శివధనుర్భంగమొనర్చిన రామచంద్రుని పరాక్రమమునకు సంతోషముచే పరవశుడై అవతారమునకు తగినట్లుగ అవతరించిన సీతను, ఇదిగో నాకు పుత్రియగు సీత, ఈమెను పెండ్లాడుమా ఈమె నీకు సహధర్మచారిణిగా నుండగలదని చెప్పి సమర్పించినట్లు నీ పాదములను నాకు లభింపజేసిన గొప్ప ఉపకారమునకు ప్రత్యుపకారముగ నాఆత్మను భుజములను బాగుగ కౌగలించుకొనదగినట్లు నీకే సమర్పించితినని, వ్యక్తమగు నొక ఆకారము కలది కాకపోయినను, అత్యాదరముతో అనన్యార్హముగ సమర్పించిన ఆత్మవస్తువును లభించినందున,

ఆళ్వార్లు తమదికాని ఆత్మను తమదని భ్రమించి సమర్పించినట్లు సర్వేశ్వరుడును తమదైన ఆత్మను తమదికానియట్లు లభించి మిక్కిలి సంతసింపగా వేయిభుజములు గలవాడా వేయి శిరస్సులు గలవాడా వికసించిన పద్మములవంటి వేయి కనులు గలవాడా యని పలు విధముల బిలిచి,

సీతాపిరాట్టి రామచంద్రుని వివాహమాడిన వెనుక వానియందలి ప్రీతిచే జన్మభూమియగు మిథిలను తలచనట్లు ఆళ్వార్లును భగవంతుని శ్రీపాదముల సంబంధమువలన బాహ్య సంబంధములను నిశ్శేషముగ వదలి సీతాపిరాట్టి ద్వారమువరకువెళ్ళి వాని దివ్యమంగళవిగ్రహ సౌందర్యమునకు మంగళాశాసనము జేసినట్లు వీరును వాని సౌకుమార్యమును జూచి శంఖచక్రములను తానే మోసుకొనవలసివచ్చెనే యని భయపడి మంగళాశాసనమొనర్చి, సీత రాముని శౌర్యాదుల దలచుకొని భయము వీడి వానితో కలిసి యనుభవించినట్లు వీరును వాని శౌర్యాదులను తలచుకొని నిర్భ

యులై వానితోకలిసి యనుభవించి రాముని యెడబాసినపుడు సీత మంచుచే చెడుపబడిన తామర పూవువలె కాంతినికోల్పోయినట్లు వీరును సర్వేశ్వరుని సేవించుటకై యాశబడి అన్ని దిక్కులను చూచుచు మొరబెట్టుటచే కంటిలోను నాల్కపైనను తడిలేకుండ బోవుటవలన సీతాదేవియొక్క గుణములగనినందున ఆమెవిషయమై ప్రీతి వృద్ధిబొందినట్లు వీరి విషయమునను సర్వేశ్వరునకు ప్రీతి వృద్ధి బొంది,

ఎల్లప్పుడును ఆమె హృదయమునకు భోగ్యముగ నున్నట్లు తలచినప్పుడెల్ల నిరతిశయ భోగ్య భూతుడై వీరి హృదయమున నెల్లకాలము నివసించి,

దరిద్రునకు ధనము దొరికిన దానివంకనే చూచుచుండునట్లు భగవానుడు ఆళ్వార్లను లభించినందున ప్రీతిచే రెప్పవాల్చకుండ చూచుచుండి సీతచే దివ్యభోగము లనుభవింపజేసినట్లు వీరి నిన్ని అప్రాకృత భోగముల ననుభవింపజేసినను తనయొక్క తక్కువస్థితిని తలచుకొనగనే ఆతడును వీరి అయోగ్యతానుసంధానపు వ్యాధిని పోగొట్టియు, నది తిరిగి వీరి తలపునకు వచ్చినచో నేమిచేయవలెనని భయపడి వీరిట్లు వెనుదీయుటకు కారణము ఆగంతుకమగు అచిత్తుతో వీరి ఆత్మకుగల సంబంధమేగాన దానిని తెలియబఱచిన వెనుదీయరని తలచి, నాకు కౌస్తుభమణివలెను లక్ష్మివలెను మిక్కిలి తేజస్కరమై భోగ్యమై నాకన్న వేరుకానట్టి గుణమువలెనే మీ ఆత్మయుసుమా యని చూపించగా,

దేహేంద్రియములకన్న విలక్షణమై జ్ఞానానందమయమై దివ్యమంగళ విగ్రహుడగు సర్వేశ్వరుని విడిచియుండజాలని భాగవతులకు శేషభూతులగువారు నాకు శేషియనియు, భగవద్భాగవతులు యిరువురియందును మనసుకాకుండ భాగవతులకే అనన్యార్హశేషమగుటయనెడి పరమపురుషార్థము కాలతత్వమున్నంతవరకును నాకు సిద్ధింపవలెనని అత్యంతపరతంత్ర స్వరూపము ననుసంధించుకొనిన ఆళ్వార్లు,

తిరుక్కడిత్తానమను దివ్యదేశమును స్తుతించినప్పుడు దుఃఖములన్నియు నశించిపోవునని మనసున నుంచుకొనుడని ప్రాప్యప్రాపకములు రెండును అర్చావతారమేయని దానియందు ప్రీతిగల వారినిగా చేయుట ఎనిమిదవపత్తు నందలి సారాంశము.

## తిరువాయ్‌మొழி తొమ్మిదవ పత్తు సారసంగ్రహము

**9. ఎణ్డిశైయుమ్ అకల్ఞాలమ్ ఎழுమ్అళిక్కిన్ఱ ఆలిన్ మేల్ ఎన్నుమ్పడి నిత్యభోగ**

ఎణ్‌దిశైయుమ్ అకల్ఞాలమ్ ఎழுమ్అళిక్కిన్ఱ ఆలిన్ మేల్ అగునట్లు వైకుంఠమున

**పాద లీలోపకరణత్తిన్‌లయాదికళై పోక్కుమ్ ఆపత్సఖన్ ఆరుయిర్ ఎన్న**

4వవంతుఅగు లీలావిభూతిన లయాదులను పోగొట్టునట్టి ఆపత్సఖుడు ఆరుయిర్ అనునట్లు

**ప్పడుత్తిన ఆత్మ[illegible]ర్శన ఫల అనుభవ పరంపరైయై క్కూవుతల్ వరుతల్ఎన్ఱు**

అనుభవింపజేసిన ఆత్మదర్శన ఫల అనుభవ పరంపరను పిలుచుకొనుటయో వచ్చుటయోనని

**ముడుకవిట్టు ఏకమెణ్ణుమ్ కాణక్కరుతి ఎణ్ణనణ్ణి నినైతొరుమ్ ఉరుకి అలత్తి కవయిల్**
మొఱబెట్టి ఏకమెణ్ణుమ్ కాణక్కరుతి ఎణ్ణనణ్ణి నినైతొరుమ్ ఉరుకి అలత్తి కవయిల్
**మనమిన్ఱి పతినాలాణ్డు పత్తుమాసమ్ ఒరుపకల్ పొఱుత్తవర్కళ్ ఒరుమాస**
మనమిన్ఱి(అని) 14 సంవత్సరములు పది నెలలు ఒక పగలు సహించినవారు ఒకమాసము
**దిన సంధ్యెయిల్ పడుమతు క్షణత్తిలేయాక ఇరఙ్గుకిఱ త్వరైక్కేడాక ఇని ప్పత్తిల్**
దినము సంధ్యయందు పడినది క్షణమునఅగునట్లు దుఃఖించిన త్వరకు తగినట్లు ఇక పదిలో
**ఒన్ఱు దశమదశైయిలే పేఱెన్ఱు నాట్కడలా త్తమ్బిక్కిట్టతు ఆకామల్ నాళైవతువైపోలే**
ఒకటగు మరణావస్థయందు ఫలమని రోజులుగడచుట తమ్మునకు పెట్టినట్లు కాకుండ రేపు వివాహమని
**నాళిడప్పెత్తవర్ ఇమ్మడ వులకర్ కణ్డతోడుపట్ట అబాంధవ అరక్షక అభోగ్య**
గడవు పెట్టబడినఆళ్వార్లు ఈఅజ్ఞానపు లోకులకు కనిపించెడి అబాంధవ అరక్షక అభోగ్య
**అసుఖ అనుపాయ ప్రతిసమ్బన్ధియై కాట్టి మత్తొన్ఱు కణ్ణనల్లాల్ ఎన్గిఱ వైకల్వాల్**
అసుఖ అనుపాయ వ్యతిరేకిని జూపి మత్తొన్ఱు కణ్ణనల్లాల్ అనెడి వైకల్వాల్
**ముతలాన సిద్ధోపాయమ్ అతిల్ దుర్బల బుద్ధికళుక్కు మాలైనణ్ణి కాలైమాలై విణ్ణు**
మొదలగు సిద్ధోపాయమును అందును దుర్బల బుద్ధులకు మాలైనణ్ణి కాలైమాలై విణ్ణు
**తేనైవాడా మలరిట్టు అన్బరామ్ సాఙ్గభక్తి, అతిల్ అశక్తర్క్కు తాళడైయుమ్ ప్రపత్తి**
తేనైవాడా మలరిట్టు అనుచోట్లచెప్పిన సాంగభక్తి అందును అశక్తులకు పాదాశ్రయణము ప్రపత్తి
**అతిల్ అశక్తర్క్కు ఉచ్చారణమాత్రం సర్వోపాయశూన్యర్క్కు ఇప్పత్తుమ్ పాడియిడుమ్**
అందును అశక్తులకు ఉచ్చారణమాత్రం సర్వోపాయశూన్యులకు ఈపదియు పాడిపెట్టుడు
**తెణ్డన్ ఎన్ఱు గీతాచార్యనైప్పోలే అధికారానుగుణమ్ నెఱియెల్లామ్ ఉరైక్కిఱార్**
దండము అని గీతాచార్యునివలె అధికారులకు తగినట్లు ఉపాయములెల్లను చెప్పుచున్నారు
**ఒమ్బదామ్బత్తిల్.**
తొమ్మిదవశతకమున.

వ్యా - సకలలోకములను ప్రళయకాలమున నశించకుండునట్లు తన గర్భమున నుంచుకొని రక్షించి, సృష్టికాలమున బయల్పఱచి మరల సృష్టించి, హిరణ్యాసురునిచే చుట్టబడి అండభిత్తితో చేరిన భూమిని విడదీసి పైకితెచ్చియు, మహాబలిచే బలవంతముగ నేలబడెడి లోకముల హద్దుల వరకును కొలిచి గైకొనియు నిట్లు రక్షించినవాడు సత్యకామత్వమను నిరపేక్షకుడగుటచే తన ఆధిక్యమును వీరి న్యూనతను చూడక తన ఫలముగ తలచి వీరి కష్టకాలమున తోడ్పడి పరమపదమున నాల్గవభాగమనబడు నీ లీలా విభూతియొక్క లయాదులపోగొట్టునట్టి ఆపత్సఖుడగు సర్వేశ్వరుడు,

ఇరుత్తుమ్వియన్ఱు అను తిరువాయ్మొళ్ళియందు తమతో శేషశేషిభావ క్రమముతప్పి ప్రవర్తించిన స్వభావమునందు ప్రీతిగలిగి, నాయాత్మబొందినట్టిది నిత్యానుభవులగు నిత్యులును బొందిరా! యని చెప్పదగినట్లు తమ ఆత్మవైలక్షణ్యమును క్రిందటి పత్తునందు యధార్థముగ

జూపింపగా చూచి, అందులకు ఫలము స్వరూపానురూపమగు ప్రాప్యమును అనుభవించుటయేగా న, నోరుతెఱచి ఒకమాట చెప్పవలయుననియు, నీ కన్నులతో నొక చల్లని చూపు చూడు మనియు, నీపాదముల నాశిరస్సుపై నుంచవలెననియు, పిరాట్టియు నిత్యులును వేంచేసి యున్న గోష్ఠిని సేవింపజేయుమనియు, నీ యిష్టులతో నీవుకూడియున్నప్పటి నీ మందహాసమును సేవింపజేయుమనియు, అనేక విధముల ఆశబడి క్రమప్రాప్తిని సహింపలేక నీవు వచ్చిననూ సరియే, లేక నన్ను రప్పించుకొన్ననూ సరియే యని మొరబెట్టుకొని,

సర్వేశ్వరుడు నిత్యనివాసమొనర్చువట్టి పరమపదమును జూచుటకు తదేకధ్యానముగ నాశబడియు, పెరియపిరాట్టితోను నిత్యసూరులతోను కూడియున్న సర్వేశ్వరుని సేవింప నాశించియు, సర్వేశ్వరుని జ్ఞప్తికితెచ్చు పదార్థములజూచినపుడెల్ల అనగా గుణానుభవదశయందు వాని రూప గుణ సామ్యముగల పదార్థముల జూచినపుడెల్ల మనసు శిథిలమై కరిగిపోయియు దూతలను బంపియు, ధరించియుండజాలక అక్రమముగ సర్వేశ్వరుని బిలిచి మొఱబెట్టియు ఏకాగ్రమనస్కులై,

పదునాల్గు వత్సరములు రామచంద్రునెడబాసి కాలావధిపూర్తి కాగానే చివరి యొకదినమున పడిన కష్టమును, పదిమాసములు సహించియున్న సీతాపిరాట్టి నెలపైబ్రతుకనని కబురుపంపిన తర్వాత ఆచివరి నెలరోజులలో పడిన కష్టమును, శ్రీకృష్ణుడు పశువులగాచుటకై పోయినప్పుడు పగలంతయు సహించియున్న గోపికలు వాడు పశువుల వెనుకమందలో వచ్చుచుండగా వానిని ముందటిమందలో చూడనందున ఒక సాయంత్రము పడిన కష్టమంతయు ఒక్కక్షణమున పడినట్లును, వానిని విడిచి క్షణకాలమున్ను ధరించియుండజాలనట్టి ఆర్తికి తగినట్లు,

"ప్రథమం త్వభిలాషస్స్యాద్ద్వితీయంచిన్తనంభవేత్, అనుస్మృతి స్తృతీయస్తు చతుర్థం గుణకీర్తనం ఉద్వేగం పంచమం ప్రోక్తః ప్రలాపః షష్ఠఉచ్యతే ఉన్మాదస్సప్తమోజ్ఞేయః అష్టమోవ్యాధిరుచ్యతేనవమేజడతాచైవ దశమంమరణంతథా" అని చెప్పినట్లు కాముకులకు దశమావస్థయందు మరణముగల్గునట్లు మావిషయమున పరమభక్తిగల మీకు మమ్ములను బొందకున్న మృతిచెందించెడి పరమభక్తిదశ పదియవ పత్తులో గలుగవలసియున్నదిగాన నిక ఆలస్యములేక మరణావస్థ యందే ఫలమని,

పూర్ణే చతుర్దశే వర్షే పదునాల్గవ సంవత్సరపు చివరిరోజు అన్నట్లువిరహవ్యసనము సహించలేని భరతులవారికి, ఒకరోజు ఒకసముద్రమువలె దాటరానియట్లు కాలావధిని యేర్పఱచినట్లు కాకుండ, నాళైవతువై మణమెన్ఱు నాళిట్టు రేపటి దినమున వివాహము జేసికొనెదను అనగా, ఈరోజుననే యనిన, ఆనందముతో పరవశమై దక్కదేమోయనియు, కొన్నిదినముల తర్వాత యనిన తాళియుండజాలదేమో యనియు రేపటిదినమనిచెప్పి ఆండాళుకు ఒకరోజుగడువు పెట్టినట్లు మరణమానాల్ అనుచోట ప్రారబ్ధశరీరావసానమున ఫలము గలుగునని వాడే గడువేర్పఱచగా సంతసించిన ఆళ్వార్లు,

చరమోపాయోపేయముల పర్యంతము తాము ఉపదేశించిన హితమును విని దిద్దుబాటయిన వారిని మాత్రమేగాక తక్కినవారినిన్ని విడజాలని కృపచే సంసారములో నున్నందున

జ్ఞానహీనులైనవారికిన్నీ భార్యాపుత్రాదులు ఎదురుగా నున్నప్పుడు ప్రేమింతురేగాని పరోక్షమున ప్రేమింపరనియు, కావున వారు బంధువులుగారనియు, ప్రళయాపదయందును మనలను విడనాడని సర్వేశ్వరుడే పరమబంధువనియు, రక్షకులనబడువారికిన్నీ అనేకావతారములెత్తి ఆతడే రక్షకుడగు టచే సర్వరక్షకుడాతడేయనియు, నిరతిశయభోగ్యుడును సుఖరూపుడును సహాయాంతరనిరపేక్ష కుడగు నుపాయమును ఆతడే యనియు, సర్వేశ్వరుని స్వరూపమును జూపి,

ఈ గొప్ప భూమి యందుండు సకల ప్రాణులకు శ్రమపడవలసినది లేదు, తలపుమాత్రమే చాలును, భగవంతుని యీ విషయమును మీరు వినియేయున్నారని చెప్పుటచే దీనికిపైగా చెప్ప వలసినదిలేదనియు సర్వాధికారమై వరింపసులభమై సిద్ధమై పరమచేతనమై సర్వశక్తియై సహా యాంతరనిరపేక్ష మైన గుణానుభవమునకు తగినట్టి సిద్ధోపాయము నుపదేశించియు,

సకృదేవ హి శాస్త్రార్థః కృతోయం తారయేన్నరం । నరాణాం బుద్ధిదౌర్బల్యాదుపాయాంత రమిష్యతే ।। శాస్త్రార్థమగు ప్రపత్తిని ఒక్కమారు చేసినచో ఈ చేతనుడు తరింపగలడు. ఐనను జనులు అట్టి జ్ఞానములేక ఉపాయాంతరముల నవలంబించుచున్నారు అనినట్లు వారి విశ్వాసములేని భాగ్యహీనతకు, భక్తిపరులై సర్వకాలమును పుష్పాదిద్రవ్యములతో నారాధించి వానివిషయమున భక్తి గలవారు కావలసిదని అంగసహితమగు భక్తిని ఉపదేశించియు,

అంగభక్తివిషయమున కష్టసాధ్యమనియు ఆలస్యముగ ఫలించుననియు ఆచరించుటలో అశక్తులగు వారికి నివృత్తిసాధనమగుటచే సుకరమై సర్వాధికారమై శరీరావసానమున ముక్తినిచ్చునట్టి ప్రపత్తి నుపదేశించియు,

ఉపాయఫల్గుత్వ ఫలవిరోధి గౌరవవిరోధిరూపములగు మూడు సంశయముల మూలమున ఏకాగ్రచిత్తముండుటకు శక్తిలేనివారికి తిరుక్కణ్ణపురమను నామమును ఉచ్చరించిన మాత్రముననే వాడే దిద్దుబాటు జేసుకొనునని బయల్పఱచి,

ఉచ్ఛారణార్థము తమంతతామే యొకపాశురమును జెప్పసమర్థులు కానివారికి, వెనుక జెప్పిన ఉపాయములలో నే యొక్కటియు చేయలేనివారికి ఈ తిరువాయ్‌మొళ్ళిని ప్రీతిప్రేరితులై గానమొనర్చి వాని శ్రీపాదముల నాశ్రయించుడనియు,

గీతాచార్యుడగు శ్రీకృష్ణుడు కృపతో చేతనుల రుచికి తగినట్లు మోక్షోపాయము లన్నిటిని ఉపదేశించిన విధమున, ఆళ్వార్లును పరమకృపతో నన్నివిధముల నెత్తిచెప్పి వారివారి అధికారాను గుణముగ ఉపాయము లన్నిటిని తొమ్మిదవపత్తునందు ఉపదేశించుట సారాంశము.

## తిరువాయ్‌మొళ్ళి పదవ పత్తు సారసంగ్రహము

**10. శురికుళ్ళల్ అఞ్జన పునల్‌మైనిన్ఱ పొళ్లా పునక్కాయా ఎన్నుమ్ ఆపత్తిల్ కొళ్ళుమ్**

**శురికుళ్ళల్. అంజన పునల్‌మైనిన్ఱ పొళ్లా పునక్కాయా అనిన్ని ఆపత్కాలమునధరించు**

కామరూప కన్దరూపత్తాలే ప్రపన్నార్తిహరనానవన్అరుళ్ పెరుమ్నోతు అణుకవిట్టతుక్కు
కామరూపమగు దివ్యరూపముచే ప్రసన్నార్తిహరుడగు స్వామికృపజూపునప్పుడుకౌగలించినందులకు
ఫలమాన వానేఋమ్ కతిక్కు అణ్డ మూవులకుమ్ మున్నోడి కాల్విళ్ళున్దిడత్తే
ఫలమగు అర్చిరాదిమార్గమునకు అండములోని ముల్లోకములకు ముందునడచి కాలుమోపినచోట
నిళ్ళల్తడజ్గళాక్కి అముతమళిత్త తయరతన్పెత్త కోవలన్ ఆకైయాలే వేడన్
నీడ నీరు కలుగజేసి అమృతమిచ్చెడి దశరథసూతిరాముడు గొల్లడగుకృష్ణుడు అగుటచేత గుహుడు
వేడువిచ్చి పక్షి కురజ్గు శరాశరమ్ ఇడైచ్చి ఇడైయర్ తయిర్త్తాళి కూని
శబరి జటాయువు సుగ్రీవుడు చరాచరములు చింతయంతి దధిభాండుడు దధిభాండము కుబ్జ
మాలాకారర్ పిణవిరున్దు వేణ్డిశిలిట్టవర్ అవన్మకన్ అవన్తమ్బి ఆనై అరవమ్
మాలాకారుడు ఘంటాకర్ణుడు ఋషిపత్నులు ప్రహ్లాదుడు విభీషణుడు గజేంద్రుడు సుముఖుడు
మత్తైయాళన్ పెత్తిమైన్దన్ ఆకిఅ పతినెట్టునాడన్ పెరుజ్గూట్టు నడత్తుమ్ అప్తనై
గోవిందస్వామి మార్కండేయుడు అగునట్టి 18 మందిని పెద్దగోష్ఠిని నడిపించు ఆప్తుడై
విళ్ళిత్తుణైయాక్కి అఱియచ్చొన్న సుప్రభాతత్తై తుణై పిరియామల్ పోక్కొళ్ళి త్తు
మార్గదర్శియై తెలియజెప్పి తెల్లవారగనే సాయము వీడక పోనియక
మీళ్కిన్షత్తిల్లై ఎన్ఱు నిచ్చిత్తిరున్దవర్ సఞ్చితమ్ కాట్టుమ్ దశైయానవాతే
మళ్ళనిచ్చుటలేదు అని నిశ్చయించినవారు సంచితము చూపునట్టి కాలమురాగానే
మున్దుత్త నెఞ్జుక్కు ప్పణి మఱవాతు మరుళొగ్గీ నకు కైవిడేల్ ఎన్ఱు
ముందిపొందిన మనసుకు కైంకర్యము మరువకుము పట్టువిడువుము నవ్వము చేయివిడువకు అని
కృత్యాకృత్యజ్గళై విధిత్తు నెఞ్జుపోల్వారై తొణ్డీరెన్ఱు అళైత్తు వలమ్ శెయ్తు
చేయదగిన రానిపనుల విధించి మనసువంటివారిని భక్తులారా! అని పిలిచి ప్రదక్షిణించి
ఎణ్ణుమిన్ పేశుమిన్ కేణ్మిన్ కాణ్మిన్ నడమిన్ పుకుతుమ్ ఎన్ఱు కర్తవ్యమ్ స్మర్తవ్యమ్
తలచుడు చెప్పుడు వినుడు చూడుడు నడువుడు చేరుడు అని చేయదగిన తలచదగిన
వక్తవ్యమ్ శ్రోతవ్యమ్ ద్రష్టవ్యమ్ గన్తవ్యమ్ వస్తవ్యమెల్లామ్ వెళియిట్టు పిణక్కఅఱై
అనదగిన వినదగిన చూడదగిన వెళ్ళదగిన ఉండదగినవెల్ల బయల్పఱచి పిణక్కఅతో ప్రా.
శార్వాక నిగమిత్తు ఎణ్పెరుక్కిల్ ఎణ్ణుమ్ తిరునామత్తిన్ శబ్దార్థజ్గళై చ్చురుక్కి
శార్వాకతో ముగించి ఎణ్పెరుక్కిన చెప్పదగిన తిరునామముయొక్క శబ్దార్థముల సంగ్రహించి
మాతవన్ ఎన్ఱు ద్వయమాక్కి కరణత్రయ ప్రయోగవృత్తి సంసారిగళుక్కు
మాతవన్ అని ద్వయమొనర్చి త్రికరణములచే చేయవలసినది సంసారులకు
కైయోలైశెయ్తు కొడుత్తు శెఞ్జొల్ కవిగళుక్కు కళ్ళవళ్ళి కావలిట్టు మనమ్తిరుత్తి
వ్రాసియిచ్చి భోగ్యమగు కవులకు చెడ్డదారిని అడ్డగించి మనసునుదిద్ది

వీడు తిరుత్తప్పోయ్ నాడుమ్ తిరిన్దినవాతే వన్దు విణ్ణులకమ్ తరవిరైన్దు
వైకుంఠము సరిజేయపోయి లోకము దిద్దుబాటుకాగా వచ్చి వైకుంఠము పొందత్వరపడి
అత్తైమఱన్దు కుడికొణ్డు తామ్ పుఱప్పట్ట ఆక్కైయిలే పుక్కు తాననకర్కళై అదిలే
దానినిమరచి కాపురముండి తాము విడువదలచిన శరీరమున ప్రవేశించి దివ్యదేశప్రీతిని దానియందు
పకుత్తు క్కరవై తువరైకళిల్ పడివుకొణ్ణ చపలనుక్కు దేహదోషమఱివిత్తు
చేసి రాచక్రీడల ద్వారకయందు అనేకరూపములగొనిన చపలునకు శరీరదోషమునుతెలిపి
మాయమై మడివిత్తు వానే తరక్కరుది కరుత్తిన్గట్ పెరియనానవనై ఇన్గుఅహేతుకమాక
మూలప్రకృతిని పోగొట్టి వైకుంఠమీయతలచి తలచినట్లు అధికుడగువానిని ఇప్పుడకారణముగ
ఆదరిత్త నీ అనాది అనాదరహేతువై చ్చొల్లెన్ఱు మడియై పిడిక్క ఇన్ద్రియ కిజ్కరరాయ్
ఆదరించిన నీవు అనాదిగ అనాదరింప కారణము చెప్పుమని రొంటిని పట్టుకొనగా ఇంద్రియవశ్యులై
క్కటితూర్త్తు చ్చువైత్తు అకన్ఱిరెన్నిల్, అవై యావరైయుమ్ అకత్త నీవైత్తవైయెన్బర్
ప్రాకృతవిషయములు రుచిచూచుచు ఎడబాసిరనగా అవియెవరినైననుఎడబాయ నీవేర్పఱచినవందురు
అతు దేహయోగత్తాలే ఎన్గిల్ అన్నాళ్ నీతన్ద శుమడెన్బర్ మున్శెయ్ద ముఖ్యు
అది దేహసంబంధముచే ననిన అనాదిగ నీవిచ్చిన బరువందురు ముందొనర్చిన నిందు
విణైయాలే ఎన్నిల్ అతు తుయరమే ఉత్త ఇరువినైయుమ్ కోపముమ్ అరుళుమ్
పాపముచే అనిన అది దుఃఖమును గల్గించు 2 పాపములును ఆగ్రహము అనుగ్రహమే
ఎన్బర్, ఈవిలాత మతియిలేన్ ఎన్గుమ్, ఉమ్మతన్ఱో కర్తృత్వ భోక్తృత్వజ్గళ్ ఎన్నిల్,
అందురు. ఈవిలాత మతియిలేన్ అన్నట్లు మీవేగదా కర్తృత్వ భోక్తృత్వములు అనిన
ఆజ్ఞారమాయ్పుక్కు శెయ్కై పయన్ ఉణ్బేనుమ్ కరుమముమ్ కరుమపలనుమాకియ
అభిమానించిచేరి చేసిన ఫలము తినువాడును కర్మయు కర్మ ఫలమునైన
నీ కర్తా భోక్తా ఎన్బర్ యానే యెజ్ఞాన్గుమ్ ఎన్గత్తాలే యెన్నిల్, అయర్వాయ్ శమైయ
నీవే కర్తవి భోక్తవి అందురు. నేనే ఎల్లప్పుడు అన్నదానిచే అనిన అజ్ఞాన మతముల
మతి కొడుత్తు ఉళ్ళమ్పేదమ్శెయ్కై ఉన్ తొళ్ళిల్ ఎన్బర్ జీవ ప్రకృతి చైతన్యం
బుద్ధినిచ్చి మతిమార్చుట నీచేష్టలేఅందురు జీవ ప్రకృతుల జ్ఞానము
నీజ్గుమ్ ప్రతహేతు అకమేనియిల్ అఱుక్కఱుక్కై అభిమాని కృత్యమ్,తాన్నల్కుమ్
విడనాడు కారణము ఆత్మయందలి మురికిపోగొట్టుట అభిమాని పని తాను ప్రేమించు
బన్ధమ్ నిరుపాధికమ్, సౌహర్దమెజ్ఞాన్గుమ్ నిఱ్కుమ్, పిణక్కి ప్పేతియాత
సంబంధము నిరుపాధికము స్నేహమెల్లప్పుడు ఉండును చంపి విడదీయని
జ్ఞానాది వైకల్యమిల్లై ఏకమూర్తియిల్ అల్లల్ మాయ్త్త యత్నఫలిత్వజ్గళ్ నమ్మతు
జ్ఞానాదుల లోపములేదు ఏకమూర్తిపా.న దుఃఖములుపోగొట్టు ప్రయత్నఫలములు మనవి

